





# నాటకాలు

## భక్తి,జ్ఞాన,పురాణ,జానపద

# శ్రీకృష్ణ లీలలు బుర్రకథ





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2990100047264

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# శ్రీ కృష్ణ లీలలు

## బుర్రకథ

బమ్మెర పోతనామాత్యులచే రచింపబడిన
శ్రీమదాంధ్ర భాగవత దశమస్కంధ పూర్వభాగమునకు
అనుకరణము



: రచన :

**వారణాసి వేంకట నారాయణ శాస్త్రి**

మిర్యాలగూడెం నల్లగొండ జిల్లా.

# పీఠిక

ఇదేం పీఠిక అనిపిస్తుంది నేను వ్రాయబోయేది. అయినా సమగ్రమైన కావ్యపీఠిక ఇలా వుండాలని నా ఆశయం- సహృదయుని ఆకాంక్ష.

"ధియో యోనః ప్రచోదయాత్" అనేది గాయత్రీ మహామంత్ర భాగం. మనబుద్ధికి ప్రచోదనం- అంటే ప్రసరణ, ప్రేరణ- ముందుకు నడిపించుట- అనుగ్రహించవలసిందిగా ఆ తల్లి గాయత్రిని ప్రార్థించటం దీని వివరణార్థం.

ఈ గాయత్రీ మహామంత్ర గర్భితమైనది శ్రీమద్రామాయణ మహాకావ్యమనీ - వేదార్థ ఉపబృంహణమునకై దీనిని రచించుకొంటిననీ స్వయముగా ఆదికవియే పేర్కొనటం జరిగింది.

అలాగే వ్యాసభగవానుడు 'జయం' అనే పేరుతో మహాభారతం- ఇతిహాసం- రచించారు. తనయిత ఒకపాత్ర అయియుండటం యీ ప్రాచీన కావ్యేతిహాసముల ప్రత్యేకత. తమ అనుభూతినీ- ఆత్మరమణమున పురోగతినీ సూచించి యుందురని ఊహించుట అసమంజసము కాదు.

జయాపజయాలూ, లాభాలాభాలూ వ్యక్తులను పురస్కరించుకుని తెలిపేదీ— అందులో ధార్మిక దృష్టికి జయము లభించటం వివరించేదీ ఇతిహాసం—ఇది చరిత్ర అనుకోటం అసమగ్రదృష్టి. ఈ ప్రకారంగా ధర్మక్షేత్రమైన కురుక్షేత్రంలో- హృదయంలో - యుగయుగాలుగా సంక్షోభం- సంగ్రామం జరుగుతూనే వుంది. నిరంతరం అనంతకాలం జరుగుతూనే వుంటుంది.

జయం వ్రాసి వ్యాస భగవానుడు తృప్తిచెందలేదు. ధర్మాధర్మ వివరణతో ఆయన లక్ష్యం సిద్ధించలేదు. సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ అనే భాగవతుల చరితములను- అనగా ఆచరితములను- రచించి- అనుభవించి జన్మమాటి ఆయన సార్థకజన్ముడనని తృప్తి పడ్డారనుకోటం మన పురోగమనానికి ప్రచోదనంగా వుంటుంది.

ఆ వ్యాసభగవానుని భాగవతాన్ని ఎంతమందో ఎన్నితీరులుగానో వ్రాశారు. నేడీ సాధకుడైన వారణాసి వెంకటనారాయణ శాస్త్రిగారు బుర్రకథగా వ్రాశారు. వ్యాసభగవానునికి ఎంతదగ్గరగా వ్రాస్తే అంత సార్థకత లభిస్తుంది. ఈయనకు పుష్కలంగా ఆ అనుభూతి లభించినదని నా విశ్వాసం.

—సహృదయ

# గ్రంథ ముద్రణకు
# సహాయకులు



మిర్యాలగూడెంలో శివాలయంలో భ్రమరాంబాలయ
నిర్మాతలు, కోదండరామాలయ నిర్మాణమునకును,
అవంతీపుర శ్రీ వెంకటేశ్వరాలయ నిర్మాణమునకును
భూరి విరాళ దాతలు, వదాన్యులు

## శ్రీ కర్నాటి బుచ్చిరామయ్య, వెంకమ్మ
## దంపతులు

# ముందుమాట

ఆర్షధర్మ ప్రచారకులు సుప్రసిద్ధరచయిత బ్ర॥శ్రీ॥ నండూరి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు మిర్యాలగూడెం విశ్వహిందూ పరిషత్తువారి యాజమాన్యంలో ది................ నుండి ది..................... వరకు భారతోపన్యాసాలు, భగవద్గీతోపన్యాసాలు చేసినారు స్థానిక శివాలయంలో-ప్రతినిత్యం శ్రవణానికి నేను వెళ్ళేవాణ్ణి.

నేను రచించిన శ్రీమద్భగవద్గీత బుర్రకథ ప్రతిని ఒకటి యిచ్చాను. వారు మరునాడు మా ఇంటికివచ్చి "నా సందేశం" అని ఇందులో ప్రకటించిన ఒక లేఖ నాకు ఇచ్చి ఆశీర్వదించారు. వారి ఆజ్ఞనే భగవదాజ్ఞగా స్వీకరించి ఈ శ్రీకృష్ణలీలలు ప్రారంభించి బుర్రకథగా వ్రాశాను.

వయోవృద్ధుణ్ణి, మెదడు చురుకుగా పనిచేయడంలేదు. నా మనస్సులో ఏకాగ్రత కలిగి ఈ స్థితిలో భగవచ్చింతనతో కాలం పుచ్చాలని ఇది వ్రాయడం జరిగింది. ఇటు తర్వాతగూడా వ్రాయాలనే తపన ఉన్నది-నేనేం పండితుణ్ణిగాను. సాధ్యమైనంతవరకు తేలిక పదాలను ఉపయోగించాను. సంధులను విరిచి వ్రాయడం జరిగింది. లయకు యతిస్థానానికి కథకు ప్రాధాన్యం ఇవ్వనైనది. దీనివలన లోకానికి ఏమయినా మంచి జరిగితే పెద్దల చలువ. ఇందలి లోపాలన్నీ నావే. దీన్ని వ్రాయడానికి ప్రోత్సహించిన కీ॥ శే॥ నండూరి సుబ్రహ్మణ్యశాస్త్రిగారికి, దీని ముద్రణకు ద్రవ్యదాతలగువారి పేర్లు వ్రాశాను- వారందరికీ, దీనిని ప్రింటుచేసిన శ్రీనాగార్జునా ప్రింటర్స్ వారికీ పీఠిక వ్రాసిన శ్రీ మల్లాది శివరాం గారికి, ముద్రణలో సహకరించిన చి॥ ఉప్పులూరి సత్యనారాయణకూ నాహార్దికాభివందనములు.

— రచయిత

# దీనికి ప్రేరకులు

బ్ర॥ శ్రీ

ఆర్షధర్మ ప్రబోధక, నండూరు సుబ్రహ్మణ్యశాస్త్రిగారు

హాల్‌మకాం, మిర్యాలగూడ ది. 16-11-87

## నా సందేశం

శ్రీ మద్భగవద్గీతా పాణీ విలాసాలను వినుల విందు గావించిన శ్రీ వారణాసి వెంకటనారాయణశాస్త్రిగారు, నవ్య సాహితీ రంగస్థలంలో ప్రాచ్య భారతీయ విజ్ఞాన సరస్వతిని నిలిపి, సనాతన అధునాతనుల హృదయాలను చూరగొన్నారు. వీరు వేదాధ్యయనపరులు. అయినా కవితా వాణి వీరిని చూచి దూరంగా తొలగలేదు. వరించింది.

కవితలో మాధుర్యమేగాక భాష్యకారుల భావ బంధురత కూడా వీరి గేయ కవిత్వంలో తొంగిచూడడం గమనార్హం.

శాస్త్రిగారూ! మీరెందుకు భాగవతరసాన్ని ఆంధ్రులకు అందించరు?

పోతనామాత్యులవంటి మధురరస ఫణితిని చేపట్టారు. ఆ అమాత్యుల్లాగానే కృష్ణలీలలను గూడా గానం చేయండి. చేయించండి. మీ జన్మ సార్థకమౌతుంది.

మీ చిన్నారి పొత్తాన్ని ఆమూలాగ్రంగా చదివిన తరువాత కలిగిన నా భావం.

మీ మిత్రుడు, సమానవయస్కుడు మీకిచ్చిన సందేశం ఇది.

శెలవు

# కథకులకు చిన్న మనవి

వ్రాసేవాళ్ళకన్న చెప్పేవారి వల్లనే బుర్రకథ రక్తికడుతుంది. కథకుని విజయానికి సంపూర్ణ సహాయకులు వంతవారు. అనుభవంగల మీ బృందాలకి కొన్ని సూచనలు చేస్తున్నా. వీలునుబట్టి స్వీకరించండి.

కథకుడు శ్రోతలకు వినిపించే సందర్భంలో వంతవారు :-

1. వినరా భాగవతాన్ని సోదరా వీనుల విందుగనూ
కనరా పావన మోక్షమార్గమును కన్నులముందుగనూ.

2. భాగవతామృతపానము చేయగ భక్తులార రండీ
బాగుపడుట కిదిగాక ఇతరములు పనికిరావు సుండీ

శ్రీకృష్ణునితో పలికే సందర్భములో వంతవారు-

1. మురళీలోలా! గోకులబాలా! మునిజన పరిపాలా
వరగుణజాలా! హృదయవిశాలా! గురుజననుత లీలా!

2. చిత్తగించుమా నాటు మనవినీ శ్రీనివాస! శౌరీ !
నంద నందనా! గోవర్ధనధర! ఇందీవరనయనా!

శ్రీ శుకుని పరీక్షిత్తు ప్రశ్నించే సందర్భంలో వంతవారు

1. మౌనిచంద్ర! శ్రీ శుకయోగీంద్రా! మానితగుణసాంద్రా!
వ్యాసపుత్ర! భవవీతిహోత్ర! సత్పాత్ర! లోకమిత్రా!

పరీక్షన్మహారాజుతో శ్రీ శుకుడు పలికే సందర్భంలో

1. రాజ రాజ హే పరీక్షన్మహారాజా వినుమయ్యా!
పరవశించి భాగవతం వింటే తిరిగి పుట్టరయ్యా!

సామాన్యంగా వంతవారు

"భళానోయి భాయి తమ్ముడా! దేవభళానోయి దాదానా"

అనే వంత పాటకు బదులుగా ఇందులో

భాగవతామృతపానమూ - భగవత్పద సోపానమూ

అని పాడండి.

ఇంకొ

నందామయా గురుడ నందామయా ! ఆనందదేవికీ నందామయా

అనే వంతపాటకు బదులుగా ఇందులో

విందామయా మనము విందామయా

గోవిందకథలనే విందామయా అని పాడండి.

ఇంకా -

తంధాన తానా అనే వంతకు బదులుగా

గోపాల బాలా అని పాడండి.

అంబవైనా నీవేనమ్మా భారతాంబా ! జగ

దంబవైనా నీవేనమ్మా భారతాంబా

అనుమాదిరి.

రాముడవైనా నీవేనయ్యా గోపాలా ! పరం

ధాముడవైనా నీవేనయ్యా, గోపాలా ॥

ఆర్తులైన వారిని కాపాడగ గోపాలా - నీ

వవతరించితివి మా లోకంలో గోపాలా ॥

చిత్ర చిత్రములు మీ కథలన్ని గోపాలా ! స

న్మిత్రమ్ములుగా మాకు లభించెను గోపాలా ॥

భక్తితోడ మిము కొలిచేవారూ గోపాలా ! వారు

బ్రతికియుండగనె ముక్తులగుదురూ గోపాలా ॥

నీ కథామృతము జుర్రేవారికి గోపాలా ! ఇట

నిరతానందము గలుగునుగాదా గోపాలా ॥

వందనాలు అభివందనాలనూ గోపాలా ! మా

వందుకొని మాకిందు దీవనల గోపాలా !

రాముడవైనా నీవేనయ్యా గోపాలా ! పరం

ధాముడవయినా నీవేనయ్యా గోపాలా

# ప్రార్థన
## (పాట)

బాలగోపాలు నీ లీలలు పాడిన- పాపాలు నిను విడిచిపోవా
జీవా! హరినామమును పలుకలేవా నీవా
గోవిందు దయ బడయులేవా॥
వైకుంఠములో నివసింపను-నే
యోగి హృదయములలోన వసింపను
నా భక్తులు నన్నెచట భజింతురో
ఆచట నుందు నన్నాడట శ్రీహరి ॥బాలగోపాలు నీ॥

వాసుదేవుడే సర్వము నా కను
వాడె నాకు ముఖ్యుండని తెలుపుచు
భక్తి త్రాళ్ళచే కట్టబడుదునని
పలికినాడట వాసుదేవుడు ॥బాలగోపాలు నీ॥

మురళీలోలా గోకులబాలా మునిగణపరిపాలా
వరగుణజాలా! హృదయ విశాలా! గురుజననుతలీలా
నందనందనా! గోవర్ధనధర! ఇందీవరనయనా
సుందరాంగ గోవింద ముకుందా నందిత యదుబృందా
నీ లీలలకూ భాగవతమ్మే నిలయమంచు నెంచి
పామరజనులూ తేలికగా నిది పాడుకొనెదరనుచూ

మీ కథాసుధను బుర్రకథనుగా చేకొనగలుగుటయే
నా తొలి సుకృతంబంచు గట్టిగా నమ్మియుంటి కృష్ణా
॥మురళీలోలా గోకులబాలా॥

పాండిత్యం బేమాత్రము లేని పశువు వంటి నేను
బమ్మెర పోతన చూపిన బాటన పలుకుచున్నవాడ
తప్పిన దారిని తిప్పి నడుపుట తప్పదయ్యా నీకు
నీ పాదములను నమ్మి వ్రాసెదను నీరజాక్ష కృష్ణా
॥మురళీలోలా గోకులబాలా॥

ముందు వ్యాసునకు సాగిలపడి నా వందనమ్ము చేసి
తెలుగు కవుల నందరిని భక్తితో తలచి మ్రొక్కుచుంటి
॥భాగవతామృతపానము చేయగ॥

# శ్రీకృష్ణ జననము

చిన్ని కృష్ణ నీ జన్మ కథను నే చెప్పెద వినరండీ
వినిన వారలా కోరిన ఫలితము కనగవచ్చునండీ

ఈ భాగవత దశమ స్కంధమునకు కథాక్రమం
ఎలా ప్రారంభమైనదంటే.

మృత్యువు తప్పదు నాకని నమ్మి మోక్షకామి యగుచు
చిత్రవిచిత్ర పవిత్ర భావముల చిందు భాగవతము
అధిక భక్తితో రాత్రింబవలులు ఆలకించుచున్న
పరీక్షిత్తు శుకయోగివరునితో పలికె వినయముగను

ఓ శుకమునీంద్రా !

మధురముగా మీ నోట మాధవుని కథలు వినిన కొలదీ
శ్రీదయితుని పాదాలు నా మదిని పాదుకొనెను గాన
ఆకలి దప్పిక నిద్దురగూడ నాకు తెలియకుండే
నాలోగల అజ్ఞాన తిమిరములు నాశనమగుచుండె
॥మౌనిచంద్ర శ్రీశుకయోగీంద్రా ! మానితగుణసాంద్రా॥

కావున మహానుభావా !

దేవకీసతీ వసుదేవులకూ శ్రీవిభుడు జనించీ
కంసుని చంపీ నడిపిన గాథల కనుల గట్టినట్లు
వినిపించాలని కుతూహలంతో వేడుచుంటి మిమ్ము
పురుషోత్తము కథ విన్న జన్మకూ చరితార్థము గాదా
॥మౌని చంద్ర॥

అని పరీక్షిత్తు ప్రార్థింపగా శ్రీశుకులవారు ఇలా సాగించారు.

రాజ రాజ ఓ పరీక్షన్మహారాజా వినుమయ్యా!
చాలాకాలము క్రింద రాక్షసులు పాలించిరి ధరను
అన్యాయాలూ అత్యాచారా లంతట పెరిగాయి
పాపుల భారము మోయలేక నా బ్రహ్మవద్ద కేగి
పుడమితల్లి ప్రార్థింప విరించీ పురుహూతాదులతో
కదలి విష్ణువును వైకుంఠంలో గాంచి భక్తితోడ
పరమ పురుషునీ పురుషసూక్తమున ప్రార్థించారండీ
రాజ రాజ ఓ పరీక్షన్మహారాజా వినుమయ్యా॥

అపుడు ఏం జరిగిందయ్యాంటే ?

కమలనాభుడా వచ్చిన విషయం గ్రహించినాడండీ
ధరణీమాతను ఊరడించుతూ ధాతతోడ ననియె ॥రాజరాజ॥

అపుడు శ్రీమన్నారాయణుడు ఏమన్నాడంటే ?

స్రష్టా యదుకులమందు సురలనూ సృష్టి జేయుమయ్యా
ఆ పిమ్మట వసుదేవసుతుడనై అవతరింతు నేను
ఆదిశేషుడూ నా కళతో నా కన్నయై జనించు
అపుడు దుష్టులను పాపుల జంపీ యువని భారమడతు
॥వినరా భాగవ॥

అని స్వామివారు సెలవీయగా, ఆ వచ్చిన దేవతలంతా సంతోషించి స్వామికి నమస్కరించి తమ తమ నెలవులకు వెళ్ళిపోయారు. తరువాత కథ ఏమిటయ్యాంటే.

॥రాజరాజహే పరీక్షన్మహారాజా వినుమయ్యా॥

రాజధాని మధురాపురి యాదవరాజ వంశమునకు
ఆ రాజ్యాన్నీ పరిపాలిస్తూ శూరసేనుడుండె

ఆ శూరసేన మహారాజు ఎలాంటి వాడయ్యాంటే—

తన పాలనలో ప్రజలందరినీ తనయుల వలె జూచి
బాధల నొందని రీతి జనుల కాపాడుచుండెనండీ
శూరసేనునకు వసుదేవుండను సుతు డొకడున్నాడు
సుగుణ సంపదలు ఆ వసుదేవుని సొత్తయి నిలిచాయి

॥రాజ రాజ॥

ఇలాగుండగా—

భోజవంశమున దేవకు డనియెడి భూవిభుడున్నాడు
దేవకి యనియెడి తన బిడ్డను వసుదేవున కొసగాడు

॥రాజ రాజ॥

ఇంకా ఏమిటంటే—

ఉన్నాడొక సోదరుడు దేవకున కుగ్రసేనుడనగా
ఉగ్రసేనునకు కంసుడనెడి కొడుకొక్క డుండెనండీ
కంసునకూ తన చెల్లెలిమీదట గట్టి ప్రేమగలదు
దేవకి పెండ్లిని వైభవమ్ముగా గావించిరి రాజా! ॥రాజరాజ॥

పెండ్లి అయిన తరువాత ఆ కంసుడు—

మంగళ వాద్యాలెన్నో ముందట మారుమ్రోగుచుండ
వధూవరులనూ తాను తోలెడీ రథాన యెక్కించీ
పగ్గాలను సడలించి గుర్రముల పరుగెత్తించాడు
వడివడిగా ఆ రథము సాగెనూ వాయు వేగముగను ॥రాజరాజ॥

అప్పుడు ఆకాశంనుండి అశరీరవాణి ఇలా పలికింది—

కంసా నీ సోదరిని దేవకిని గాంచి ఉబ్బిపోయి
ఫలితము నెరుగక అత్త యింటికీ పంపుచుంటివోయి

ఆ ఫలితం ఏమిటంటే—

దేవకి అష్టమ పుత్రుడు నిన్నూ చావగొట్టునయ్యా

అనెడి పలుకులను విన్న కంసుడూ అరద మాపినాడు.

||రాజ రాజ||

వెంటనే కంసుడు ఉలికిపడి లేచి-

కండ్ల నిప్పులే కక్కెరా సై-పండ్లు పటపటా కొరికెరా సై
కత్తి గిరగిరా తిప్పెరా సై - కాలితోటి నేలతన్నెరా సై
పట్టరాని కోపమ్ముతో-కంసు-డట్టహాసమే చేసెరా
భాగవతామృతపానమూ - భగవత్పద సోపానమూ
జంకు గొంకే లేక కంసుడూ — తన
చెల్లెలి కొప్పును పట్టెరా — ఆమె
తలను క్రిందికి వంచెరా — తన
చేతికత్తినీ ఎత్తెరా — ఆమె
మెడను నరక సిద్ధమాయెరా - అడ్డు-పడిన బావనూ త్రోసెరా
భాగవతామృతపానమూ - భగవత్పద సోపానమూ

అప్పుడు వసుదేవుడు కత్తియెత్తిన కంసుని చేయి పట్టుకొని బ్రతిమాలుతూ -

అడపడుచుపై కత్తిదూయగా పాడియగునె బావా !
ఎల్లవారు తమ నగలు నాణెములు చెల్లెలి కిస్తారు
చీరలు రవికలు పసుపు కుంకుమలు కోరిన విస్తారు
హితవు మాటలను చెప్పి అత్తవారింటి కంపుతారు
||వినరా భాగవతాన్ని సోదరా వీనుల విందుగనూ||

కాబట్టి నీవు గూడా-

ఉన్నత వంశములోన పుట్టినా ఉత్తముడవు నీవూ
గుణవంతుడవని యెల్లవారిలో గణుతి కెక్కినావూ

కోపముతో చెడు పనులు చేసిన పాపము వాటిల్లా
గాలి కూతలను నమ్మి చెల్లిపై కత్తి విసురుతావా
॥వినరా భాగవతాన్ని సోదరా వీనుల విందుగనూ॥

అది గాక-

పుట్టినవారూ గిట్టుట నిజమే భూమిపైన బావా
మృత్యువు మనునూ నేడో రేపో మ్రింగ పొంచియుండె
ఈ శరీరమే శాశ్వతమంటూ యెంచగూడదయ్యా
పూర్వకర్మలనుబట్టి భూమిపై పుట్టునయ్య జీవి
॥వినరా భాగవతాన్ని సోదరా వీనుల విందుగనూ॥

అది యెలాగంటే పచ్చిగడ్డి మీదట

ఆకున ప్రాకే పురుగు రెండవ ఆకుపైకి సాగి
దాని నందుకొని మొదటి యాకునూ తాను వదలినట్లు
కర్మబద్ధుడగు జీవుడు వేరొక కాయమందు చేరు
దీని తెలిసికొని మోహము చెందరు ధీరులైనవారు
॥వినరా భాగవతాన్ని సోదరా వీనుల విందుగనూ॥

ఇంతేగాక -

పుణ్యకర్మలను చేసినవారూ పొందుతారు ముక్తి
పాపకర్మలను చేసినవారూ పాడయిపోతారు
॥వినరా భాగవతాన్ని సోదరా వీనుల విందుగనూ॥

అదిగో అటుచూడు బావా-

కన్నకూతురు వంటిది చెల్లెలు కనుల నీరు నింపి
నిన్ను జూచి భయమంది వణుకుతూ ఉన్నదయ్య బావా
॥వినరా భాగవతాన్ని సోదరా వీనుల విందుగనూ॥

అంటూనే వసుదేవుడు-

గాలిలోన మెరిసేటి కంసునీ కత్తి చూచినాడు
హృదయమందెవో ఊహలు మొలిచీ కదలి యాడుచుండ
॥వినరా భాగవతాన్ని సోదరా వీనుల విందుగనూ॥

కంసుణ్ణి ఇలా ప్రార్థించాడు బ్రతిమాలుతూ. బావా!

ఎనమండ్రవ వాడుగదా మిమ్ముల నెదిరించెడివాడు
దేవకి కడుపున పుట్టిన వారిని తెచ్చియిత్తు మీకు

ఈమెవల్ల నీకు హానిలేదు గదా చంపవద్దు అనిన వెంటనే-

వసుదేవుని దేవకిని కంసుడూ వదిలిపెట్టినాడు
దంపతు లిద్దరు చావుదప్పి తమ తావు-కేగినారు ॥రాజ॥

కొంతకాలము తరువాత దేవకి ప్రసవించింది. మొగ పిల్ల వాడు జనించాడు. అపుడు-

దేవకిదేవి తొలిబిడ్డను వసుదేవుడు ఎత్తికొని
కంసుని ముందట గుండె ధైర్యముతొ పరుండబెట్టాడు ॥రాజ॥

అప్పుడు కంసుడు ఏమన్నాడంటే -

ఆడిన మాటను తప్పక పుత్రుని అప్పగించినావు
నీ నియమానికి సంతసించితిని నిక్కమోయి బావా !
ఎనమండ్రవ వాడుగదా నన్నూ ఎదిరించేవాడు
ఏడుగురూ ఏ మాత్రము నాకూ కీడు చేయబోరు
వీనిని తదుపరి వారిని కూడా స్వీకరింపుమయ్యా
అష్టమ పుత్రుని మాత్రము చంపుట స్పష్టమంచు పలికే
॥రాజ॥

తరువాత ఆ కంసుని మాటలకు -

సంతసించి వసుదేవు డింటికి సాగిపోయినాడు.
సత్యశీలునకు లోకములోన అసాధ్య మేమిగలదు ॥రాజ॥

ఈ విధంగా కొంతకాలం గడిచింది.

ఒక్కరోజు నారదుడు కంసునీ చక్కకి వచ్చాడు
ఏవో కొన్ని మాటలాడుతూ ఇట్లు పలికినాడు ॥రాజ॥

ఏమని చెప్పాడంటే, ఓ కంసరాజేంద్రా !

వసుదేవుడు దేవకియు నందుడూ వారి బంధుజనులూ
నరులుగారు ఆ యాదవు లందరు సురలని ఎరుగుమయా
దేవకి కడుపునబుట్టి శ్రీధరుడు తెగటార్చును నిన్ను
అనుచు పలికి నారదుడు వెళ్లెనూ ఆకాశము కెగిరి ।రాజ।

తాను వచ్చిన పని పూర్తిచేసికొని నారదుడు వెళ్ళాడు.
వెంటనే-

కంసుండా జడదారి మాటలకు కన్నున లేవాడు
దేవకినీ వసుదేవుని కట్టి తెప్పించాడండీ
చెల్లెలు బావయు అన్న ముచ్చటను చెంతకు రానీక
జాలిలేక వారిద్దరినీ చెరసాలలోన త్రోసె ।రాజ।

తరువాత -

దేవకిగన్న ప్రతి శిశువును సందేహము లేకుండా
వరుసగాను అర్భకుని ముక్కలుగ నరికివేసినాడు ॥రాజ॥

ఇంతటితో ఆగక -

పాపం తండ్రిని ఉగ్రసేనునీ బంధించాడండీ
రాజ్యకాంక్ష ఎటువంటి చెడ్డదో రాజా వినుమయ్యా ॥రాజ॥

ఆ చెరసాలలో దేవకీ వసుదేవులు ఉండగానే-

ఏడవ గర్భము దేవకిదేవికి ఏర్పడియెను రాజా
ఆదిశేషుడే క్రమముగ పెరిగెను ఆమె కడుపులోన ॥రాజ॥

అప్పుడు శ్రీమన్నారాయణుడు యోగమాయతో ఇలా అన్నాడు. నీవు వెంటనే వెళ్లి-

వసుదేవుని సతి కడుపులోనగల పసిబాలుని తీసి
నందు నింటగల రోహిణి గర్భమునందు చేర్చవలయు
ఏడవ గర్భము స్రావమైనదని యెల్లరు తలచెదరు
ఆ తరువాతను నీవు యశోదకు కూతురై జనింప
అందరు నిన్నూ భద్రకాళియని ఆరాధిస్తారు
ఆ పిమ్మట నే దేవకి కడుపున అవతరించుతాను

అని శ్రీమన్నారాయణుడు ఆజ్ఞాపింపగా, ఆ యోగమాయ దేవకీ గర్భంలో గల -

ఆ శిశువును రోహిణి గర్భంలో అమర్చినాదండీ
పుట్టిన శిశువుకు బలభద్రుండని పెట్టినారు పేరు ॥రాజ॥

తరువాత నారాయణాంశ దేవకీగర్భంలో ప్రవేశించినది,

తూరుపు దిక్కు చంద్రుని దాల్చిన తీరున నా తల్లి
పరమ పురుషుని తేజముదాల్చి ప్రకాశించెనండీ
నెలది గర్భమున నారాయణుడూ పెరుగుచుండటచేత
హరిమధ్యము యగు దేవకి నిజముగ హరిమధ్యమయయ్యే ॥రాజ॥

ఆ దేవకీదేవి శరీరలక్షణములను చూచి భయపడి తనలో ఇలా అనుకున్నాడు కంసుడు -

వెన్నుడు దూరెనో దేవకీ యుదర వివరములో నకటా
కన్నుల చూడగరాని కాంతితో కానబడుచునుండె
ఏమి చేయుదును రోజురోజుకూ ఆమెచూలు పెరిగి
నిండు గర్భిణిని చంపినచో నను నిందింపరె జనులు

కావున -

పుట్టిన శిశువును పురిటిలోననే మట్టు పెడుదునంటూ
ఎపుడు పుట్టునో చక్రి యీామె కని ఎదురు చూచుచుండె ॥రాజ॥

ఇంతేగాక ఆ కంసుడు భయపడి-

తిరుగుచు త్రాగుచు తినుచు పరుండుచు అరుగుచు కూర్చొనుచు
చెవులకేది వినిపించిన అది మాధవుని పలుకటంచు
కనులబడిన ప్రతివస్తువు గోవిందుని రూపమటంచు
పరక సోకినను హరి అరచేతను చరచినట్లు వెరచు
గాలిని శ్రీహరి తులసీమాలా గంధమంచు దలచు
ఉలికి పడుచు తన చావు భయముతొ కలవరించుచుండు
కదలిన శ్రీహరి చంపునేమొయని కనులు మూసికొనును
లోని తలపులే బెదరిన కనులకు కానుపించు గాదా ॥రాజ॥

ఇలాంటి సమయంలో బ్రహ్మాదిదేవతలూ నారదాదిమునులు పరమ శివుడువచ్చి, చెరసాలలోగల దేవకి గర్భంలోనున్న శ్రీమన్నారాయణుని ఇలాస్తుతించారు-

వాసుదేవ నీ మహిమలు మేమూ వర్ణింపగలేమూ
ఘోదలు మధ్య తుదిలేని వాడవయి పొదలుచుందువయ్యా

మత్స్యమవై కూర్మమువై కిటివై మనుజ సింహామనుచు
భిక్షుడవై అశ్వాననుండవై పెక్కు రూపములతో
ధర్మము తరిగి అధర్మము పెరిగే తరుణాలలో నీవు
సాధురక్షణకు దుష్టశిక్షణకు జన్మలెత్తుతావు
పురుషోత్తమ భూభారమణగు నీవుట్టుకచే స్వామీ
అని బ్రహ్మాదులు దేవదేవుని వినుతించిరి రాజా ॥రాజ

తరువాత దేవకీదేవితో వారిలాగన్నారు-

వెన్నుడు నీ గర్భమున వెలుగుతూ నున్నాడోయమ్మా
కంసునిచే భయమెంత మాత్రమూ కలుగబోదుసుమ్మా!

అని ధైర్యము చెప్పి-

దేవకినీ వసుదేవుని వారూ దీవించారండీ
ఎవరి తావులకు వారు వెంటనే వెడలినారు రాజా ॥రాజ

తరువాత ఒక శుభముహూర్తమున-

సూర్యాది నవగ్రహములు మిక్కిలి శుభదములై యుండ
సుతుఁగనె దేవకి అర్ధరాత్రమున అతి సుఖమ్ముగాను ॥రాజ

ఆ శుభసమయంలో దేవకీదేవి ప్రసవించింది-

సురలాకాశము నుండి పూవులను కురిపించారండీ
గంధర్వులు తమ మధుర కంఠముల గానం చేశారు
అప్సరసలు నాట్యాలుచేసిరీ అర్థవంతముగను
చల్లగ మెల్లగ సుగంధాలతో సాగివీచెగాలి
మోదము కలుగగ దేవదుందుభులు మొరసె నాకసమున
విహాగరవములూ పుష్పఫలాలూ వెలసె నడవిలోన ॥రాజ

అప్పుడు వసుదేవుడు-

నీలదేహా నాజానుబాహా సువిశాలవక్షు హరిని
చారు శంఖచక్రాది విలాసుని సాధుహృన్నివాసు
సరసీరుహముల వంటి కండ్లతో మెరయుచుండువాని
కనులపంటగా దర్శించాడూ తనువు పులకరింప
సాష్టాంగముగా నమస్కరించీ సాగిలపడి లేచి
కేశవునీ వేదాంతసూక్తులతో కీర్తించాడండీ ॥రాజ॥

అప్పుడు దేవకీదేవి-

భక్తపాలకుని లోకనాధునీ పరవశించి చూచీ
కంసరాజుచే ముందీతనికీ కలుగు కష్టమంచు ॥రాజ॥

ఆ పిచ్చితల్లి తన మనసులో తలచి స్వామివారితో ఇలాగన్నది-

పరమ పురుష నాగర్భమునం దీవరయ పుట్టినావు
నాకు జనించెద వీవటంచు అన్యాయముగా మమ్ము
ఖలుడు కంసుడూ బంధించాడీ కారాగారమున
మలిన చిత్తుడూ మంచీ చెడ్డల తలపజాలడయ్యా
॥చిత్తగించు మా నాడుమనవిని॥

అంటూ ఉండగానే-

అప్పుడు దేవకి ఎదుట కేశవుడు అభయహస్తమెత్తి
చిరునవ్వుల వెన్నెలలు తెల్లగా విరియగవిట్లనియె ॥రాజ॥

ఏమన్నాడంటే స్వాయంభువమనువు తరువాత-

అమ్మా నీవూ పూర్వము పృశ్ని యనెడి పతివ్రతవు
సుతపుండనియెడి తొల్లిటి బ్రహయె వసుదేవుండమ్మా
॥వినరా భాగవతాన్ని॥

ఆ పూర్వజన్మలో-

మీరు నన్ను పుత్రునిగా బడయగ ఘోర తపము చేయ
మెచ్చి అట్టులే యగునని వరమును ఇచ్చినాడనేను
॥వినరా భాగవతాన్ని॥

కావున నేను మొదట-

ఆ ప్రకారమే పృశ్నిగర్భుడను అర్భకుండనైతి
తదుపరి మీరూ జనించినారూ అదితి కశ్యపులుగా
అట్టి జన్మలో వామనుండనై పుట్టినాను నేను
ఇప్పుడు మూడవజన్మ నాకు నేనిచట పుట్టినాను
॥వినరా భాగవతాన్ని॥

ఇప్పుడు-

నందనుడని ప్రేమింతురు నను నా యందుభక్తి గలిగి
ఈ జన్మముతో మీకు జన్మ రాహిత్యమగునటంచు
దొడ్డ విష్ణు రూపమును విడిచి పసిబిడ్డగమారాడు
కేరింతలతో దేవకి ప్రక్కన చేరె శేషశాయి.
పూర్వజన్మమున చేసిన పుణ్యము పోదు ఫలితమొసగు
రాజరాజ ఓ పరీక్షన్మహారాజా వినుమయ్యా.

అదే సమయంలో-

నందుని భార్య యశోద గర్భమును పొంది అందె పెరిగి
బాలికగా హరియోగమాయ అట ప్రభవించెను రాజా ॥రాజ॥

అప్పుడు చెరసాలలో ఉన్న వసుదేవుడు, లోగా తనతో శ్రీహరి చెప్పినట్లుగా తన-

కర్తవ్యాన్ని వసుదేవుండూ గుర్తుతెచ్చుకొనుచు
పసిబాలుని గోకులముకు చేర్చగ పయనమాయెనండీ ॥రాజ॥

ఆ సమయమున

మధురానగరం మాటుమడగెనూ తందానో తంధానతంధనా
చల్లని గాలులు మెల్లగవీచెను "
పూలచెట్లు తలలూపుచుండెను "
జైలుకాపరులు మైలుమరచిరీ "
అన్నిచోట్ల కడునిశ్శబ్దతయే ఆవరించెనండే ॥తంధానతాన

ఇనుపగొలుసులూ జరజరజారెను ॥తంధానో తంధాన తంధనా॥
తాళాలన్నీ ఊడిరాలెనూ "
తలుపులు బిలబిల తెరచుకుండెను "
కటిక చీకటులు క్రమ్మెనంతటను "
అనుకూలముగా ప్రకృతిమారెను ఆ కాలమునందూ ॥తంధాన తానా

వసుదేవుడు పసి బాలుని చూచీ ॥తంధానో తంధాన తంధనా
రెండు చేతులన్ ఎత్తి పట్టుకొని "
ముద్దు పెట్టుకొని గుండెకద్దుకొని "
భుజం మీదటపరుండ బెట్టుకొని "

అటునిటుచూచీ మెల్ల మెల్లగా కటకటాలు దాటి — ॥తంధానతాన
కోటను దాటీ రాజమార్గమున పేటదాటినాడూ "
యమునాతటినీ తటము జేర వేగముగ నడిచినాడు "
కాళిందీనది వంతెన మాదిరి చీలిదారినీయ "
వసుదేవుడు ఆ నదినిదాటి రేపల్లెకు చేరాడు.
పిల్లి యడుగులను వేస్తూ నందుని ఇల్లు దూరినాడు ॥రాజ॥

తరువాత-

తెలివి మరచి నిద్రించు వారలకు మెలకువరాకుండా
నల్లనయ్యనూ యశోద ప్రక్కన మెల్లగ దింపాడు ॥రాజ॥

పిమ్మట-

ఆమె ప్రక్కలోనున్న బాలికను అందుకున్నడండీ
తిరిగి వచ్చి ఆ బాలని దేవకిదేవి ప్రక్కదింపీ
వడిగ కాలు సేతులకు సంకెలలు తొడుగుకొనియెనండీ
బెదరుచు గడగడలాడుచు చెరలో ఒదిగియుండెనండీ ॥రాజ॥

అక్కడ నందుని ఇంటిలో-

వనజాక్షుని తెచ్చుట, ఇచ్చుట గల తన సుత లేకుంట
కలికి యశోద గాఢనిద్రలో తెలియ జాలదాయె ॥రాజ॥

మధురానగరంలో దేవకీ వసుదేవులు బంధింపబడిఉన్నారు-

చెరలోపల పసిపాపయేడ్పువిని పురుడు వచ్చెనంచు
కావలివారూ పరుగులు దీస్తూ కంసునికెరిచేరి ॥తంధాన తానా॥

అయ్యా మహారాజా -

నిండు గర్భవతి దేవకి ఇపుడే నీళ్ళాడినదండీ
సరగున రమ్మని కంసరాజుతో బిరబిర చెప్పారు ॥రాజ॥

అప్పుడు-

ఆ మాటను విని కంసుడగ్నిలో అజ్యము పడినట్లూ
భగ్గువమండీ తల్పమునుండీ చిగ్గునలేచాడు
గుండెలోపల దడదడ పుట్టీ గుబులు గొలుపు చూండ
ఉత్తరీయమూ క్రిందికి జారగ తత్తరపడి నిలిచి

గరువముజెచ్చి రోషం పెరిగీ కత్తి దూసిపట్టి
పుడమి అదరగా చెకపిక నడచుచు తడయని కోపంతో
చెమట బట్టి నిట్టూర్పులు విడచుచు చెరసాలకునేగి
ఆ దేవకి ప్రక్కన గల శిశువును అందుకొనగరాగ ॥రాజ॥

అప్పుడు దేవకి కంసునితో ఇలాగన్నది-

అన్నా ఈయమ కోడలుగానీ అల్లుడు కాదయ్యా
మగవాడే నిను చంపునటంచు గగనవాణిపలికె. ॥రాజ॥

కాబట్టి—

ఆడుపిల్లతో నీకే మాత్రము హానికలుగదయ్యా
జాలిలేక ఆర్గురు మగపిల్లల చంపినావు గాదా
ఏడవకానుపు బాలుడుగాదూ ఆడపిల్ల యేనూ
అని ఆ బిడ్డను దేవకి రొమ్ముకు అదిమి పట్టుకొనెను ॥రాజ॥

అప్పుడు-

కంసుడు దేవకి చంకబిడ్డనూ కసరి గుంజుకొనుచూ
పట్టరాని కోపాన నేలకా పాపను విసిరాడు ॥రాజ॥
క్రింద బడక ఆ పాపపైకెగిరె కంచుకమ్ము వోలె
ఆకాశమ్మునకెగసి నిలిచెను ఆశ్చర్యముగాను ॥రాజ॥

ఆకాశములో నిలిచిన ఆ యోగమాయ ఎలాగుందంటే?-

దివ్యవస్త్రములు దివ్యగంధములు
దివ్యాభరణాల్ దివ్యహారములు
దివ్యకుసుమములు దివ్యరత్నములు
దివ్యాకృతితో తేజరిల్లుతూ

మింట నిలిచి ఆ దుష్టకంసునీ కంటబడియెనండీ— ॥తంధాన తానా॥
కాంతు లంతటా కలయ చిమ్ముతూ
శంఖ చక్రములు నదాశూలములు
శరచాపములూ చర్మ ఖడ్గములు
ఎనిమితి చేతులలోన పట్టుకొని
నారాయణ ఆదుష్టకంసునకు నభమున కనిపించె ॥తంధాన తానా॥

అప్పుడా బాలిక గగనభాగంనుండి ఇలా గన్నది.

కావరమెక్కి కండ్లుగాననీ కంసాధమ వినరా
నిన్ను చంపుటకు పుట్టినాడొకడు నీకాయువుమూడె
పాపము దేవకి యార్గురు కొడుకుల బలిగొంటివి గాదా
పాపాత్ములకీ లోకంలోనే ఫలితముండునయ్యా. ॥రాజ॥

అని పలికి అంతర్ధానమయింధి.

అదృశ్యమైనా ఆ బాలికనూ అనేక రూపముల
ఆనందంతో నేటికి ప్రజలూ ఆరాధిస్తారు. ॥రాజ॥

తరువాత కథ ఏం జరిగిందయ్యాంటే కంసుడు.

గడ గడవణకుచు గుండె జారగా కత్తిపారవేసి
చెల్లెలిసీ బావను దగ్గరకూ చేర్చి కౌగలించి ॥రాజ॥

వసుదేవునితో ఇలా గన్నాడు.

పాపకర్ముడను బాలఘాతకుడ బాంధవ దూరుడను
బయిలి పలుకులను నమ్మి నేను పసిపాపల చంపితిని
ఆత్మకు మిత్రులు శత్రులు తలపగ అసలే లేరయ్యా
అజ్ఞానంతో ప్రవర్తించితిని ఆగ్రహించకయ్యా! ॥రాజ॥

అని కన్నీరు విడుస్తూ పాదాలు పట్టుకున్న కంసుణ్ణి లేవ నెత్తి ఇలా గన్నాడు వసుదేవుడు-

బావా నీ వచనాలు నిక్కమీ పామరజనులంతా
నేను నీవను వేరని తలచీ జ్ఞానశూన్యులగుచూ
అందరిలోగల పరమాత్మను తా మరసి చూడలేక
తమలో తామే చంపుకొనుచు కష్టముల నందుతారు.
జరిగిన దానికి చింతింపకుమని మరిది చెప్పగానే
సరగున వారిని విడిచి మందిరము కరిగె కంసరాజు

॥రాజ రాజ॥

ఆ తరువాత-

మలినాడుదయమే కంసుడు మంత్రుల పిలిపించాడండీ
యోగమాయ మాటలను వారికీ బాగుగ వినిపించి

వారితో ఇలాగన్నాడు-

మీరు వెంటనే అన్ని యూళ్ళకూ చారుల బంపించీ
గ్రామాల్ పురములు పట్టణాలనూ గాలించమనండీ

అని చెప్పినాడు. మంత్రులు చారులను రావించగానే వారితో కంసుడు ఇలా గన్నాడు-

ఎచ్చటనయినా పుట్టిన శిశువుల యేడుపు వినిపిస్తే
అచ్చటి శిశువుల నిర్దయులై మీ రంతము చేయండీ

అనగానే ఆ మంత్రులు రాజుగారితో మహారాజా

బాహుబలంలో ధనుర్విద్యలో సాహసమ్ములోన
మహాప్రభో మీ ధాటికెవ్వరీ మహిని నిలువలేరు.

మీ భయానికి దేవత లందరూ -

బ్రహ్మదేవునే శరణు వేడిరో ।తంధానో తంధాన తంధనా।
ఈశ్వరు పాదా లాశ్రయించిరో ,,
హరిని అభయమే కోరియుండిరో ,,
పాతాళానికి జారిపోయిరో ,,
తమ భయానికీ దేవత లెచ్చట దాగియుండినారో
॥తంథానా తానా॥
రణమున ఋణమున శేషము నుంచగరానిది ప్రభువర్యా ! ,,

ఇంతేకాక -

దేవగణాలకు రక్షణనిచ్చే దేవుడు మాధవుడూ
ధర్మమేస్థలములందునుండు నా తావుల నతడుండు
అతని దేహమే విప్రులు వేదా లావులు యాగములు
దయా సత్యములు శాంతి శ్రద్ధలు తపము శమము దమము
వాటిని అంతము చేసిన హరి మన వశుడై నశియించు
అందువలన మాకిప్పుడు మీరూ అజ్ఞనిచ్చు యెడల
సాధువులను గోవిప్రులబట్టి చంపివేతుమండీ
వేదాలను దేవతల మొత్తమును బూది చేతుమండీ

అని మంత్రులు పలుకగా, సరియేనని వారిని పంపించాడు. వారు బయలుదేరి -

అట్టహాసమే చేసిరీ —— సై
పట్టణాలు గాలించిరీ ,,

సాధువులను హింసించిరీ ”
యాగాల్ ధ్వంసముచేసిరీ ”
కోలాహలమును చేయుచూ-వారు- కువలయమంతా తిరిగిరీ
భాగవతామృతపానమూ — భగవత్పద సోపానమూ

ఇక అచట గోకులంలో యశోదాదేవి -

మగబిడ్డని ప్రసవించిన దనియెడి మాట విన్నయంత
వేద పండితుల వసుదేవుడు రప్పించె నాదరముగా
॥రాజ రాజ॥

అప్పుడు వసుదేవుడు —

స్వస్తి వాచనము చేయించాడు ॥తంధానో తంధాన తంధనా॥
జాతకర్మనూ జరిపించాడు ”
లేగల యుతముగ పాడియావులను ”
కనక కలశములు మణులు వస్త్రములు ”
బ్రాహ్మణులకు దానము చేశాడూ భక్తియుక్తు డగుచు ॥తంధాన॥
ప్రతి యింటికి వెల్లలు వేయించిరి ॥తంధానో తంధాన తంధనా॥
ద్వారాలకు తోరణములు కట్టిరి ”
ప్రతి గుమ్మానికి పసుపు పూసిరీ ”
ముంగిళ్ళలో ముగ్గులను తీర్చిరీ ”
ధూప పరిమళము నిండెను రాజా, గోప కులము నందు
॥తంధానతాన॥

గోపకులంలో పెద్దలందరూ ॥తంధానో తంధాన తంధనా॥
పెద్ద పెద్ద తలపాగాల్చుట్టీ ”

పాలు పెరుగు వెన్నలతో నిండిన ॥తంధానో తంధాన తంధనా॥
కడవలనూ కావడులలో తెచ్చీ ”
నందునకూ కానుకగ నిచ్చి రానందముతో రాజా ॥తంధాన॥
నామకరణమును నందయశోదలు ప్రేమతో చేశారు

అపుడు -

పుట్టిన బాలుని చూడగోరి ఆ పట్టణమే కదిలి
సంబరాలతో వచ్చినారలా సమయములో రాజా ॥రాజ॥

ఆ వచ్చినవారు ఇలా అనుకున్నారు -

ఏమి నోముఫలమో శుభవార్తను వింటిమమ్మ మనము
పతతి యశోదకు పురుడు వచ్చి మగపాప పుట్టెనంట
చూచివత్తమూ రారండమ్మా సుదతులార త్వరగా
అనుచు నందుని యింట పురిటి గదియందు అడుగు అడచు
గండు చీమలదండు లాగున కదలిరి స్త్రీలంతా
తాము తెచ్చిన కానుకలన్నీ ప్రేమతోడ నిచ్చి
బాలు నందుకొని ముద్దుపెట్టుకొని పరుండ బెట్టారు
ముదితలు పాడుచు ఊయెల నూపుచు నిదురపుచ్చినారు
॥రాజ॥

ఈ విధంగా, జోల పాటలతో, లాలి పాటలతో రోజులు గడుస్తున్నాయి -

నందు డొకానొక పనిపై మధురానగరం వెళ్ళాడు
తిన్నగ పనుల ముగించి అతడు వసుదేవుని కలిశాడు,

అన్యోన్యముగా కుశల ప్రశ్నల నడిగికున్న పిదప
వసుదేవుడు నందునితో వనియెను వాత్సల్యము తోడ

ఏమన్నాడయ్యాంటే -

నందా రేపల్లెలోన మన వాళ్ళందరు సేమంచా
చిరకాలము సంతానము నందక పరితపించినావు
ఇన్నాళ్ళకు ఆ ముచ్చట దీరీయున్నావా సుఖివై
ఎన్నాళ్ళకు ఎన్నాళ్ళకు సఖుడా నిన్ను చూచినాను
పశుగ్రాసముకు పచ్చికబీళ్ళు పచ్చగ నున్నాయా
భీతిలేక నా కొడుకు మీవద్ద పెరుగుచున్నాడా

అనే వరకు నందుడు ఆశ్చర్యంతో వసుదేవా-

కంసుడు నీ సంతతిని మొత్తము కత్తికి బలి యిచ్చి
చివరి బిడ్డనూ చంపబూన నా శిశువు మింటికెగిరి
వింతగ నచటనె మాయమైనదని విన్నానొకనాడు
అందుచేత నీమతి చెలించెనా ? అటులనుచున్నావు
నా కొడుకును నీ కొడుకని పొరబడి వాకొనుచున్నావు
ధీరులు గూడా దుఃఖం ముసిరిన తెలివి తప్పుతారు

అని మందలించగా వసుదేవుడు తన పొరపాటుకు నాలుక కరచుకొని, మాట సర్దుకొని మిత్రమా -

పన్నుకట్టితివి ఆప్తుల మిత్రుల బంధుల చూచితివి
ఉత్పాతాలూ నేడో రేపో ఉద్భవించునంట
వేగముగా మీ పల్లెకు నీవూ సాగవలయునయ్యా
అనుచు నంచునీ సాగనంపెనూ వినయ మొప్పగాను ॥రాజ॥

తరువాత -

నందుడు తన పరివారము తోడుత నగరి దాటగానే
అశుభ సూచనలు ఎన్నో అతనికి అగుపించెను రాజా
నదులు దాటి కొండలను దాటుతూ అదరి ఉలికిపడుతూ
గుండె నిబ్బరము తోడ ప్రయాణం కొనసాగించాడు ॥రాజ॥

# శ్రీ కృష్ణ లీలలు

వినరా కృష్ణుని లీలలు నరుడా వీనుల విందుగను
కనరా పావన మోక్షమార్గమూ కన్నుల ముందుగను ॥వినరా॥

నందుడు మధురనుండి వస్తూ మార్గమధ్యంలో ఉండగానే -
పాపిరాక్షసీ పూతన కంసుని పంపున వెడలిందీ
పల్లెలు వరుసగ తిరుగుచుండెనూ పిల్లల చంపుటకూ
ఏ యింటన్ పసిపాప లోనచ్చెడి ఏడుపు వింటుందో
ఆ యింటన్ తనుదూరి పాపలను హతమొనర్చు రాజ
॥రాజ॥

ఆ పూతన -
వరుసగ గ్రామాల్ తిరుగుచు నందుని పురముకు చేరిందీ
పల్లెను మొత్తము తిరుగుచు నందుని భవనము చూచిందీ
చన్నుల లోపల విసము నింపుకొని సరసర దూరిందీ
లోపల పాపని ఏడుపు విని తన రూపము మార్చిందీ ॥రాజ॥

అప్పుడు -
సన్న నడుముతో సోగకండ్లతో చక్కని వేషంతో
ఘుమ ఘుమలాడే సువాసనలనూ గుప్పుతు వచ్చిందీ ॥రాజ॥

ఆ సమయంలో -

గోపకాంతలూ సాక్షాల్లక్ష్మియె మాపయి కరుణించీ
సింగారంబగు వేనముతోడను చేరవచ్చెనేమో॥

అనుకున్నారు అప్పుడు పూతన-

పాపడు నిద్దురపోయే ఊయెలదాపుకు చేరిందీ
బాలుని రూపము శ్రద్ధతోడుతా పరికించిందండ్డీ
చిట్టినాన్న బంగారు కొండయని చేతులు చాచిందీ
చెంపలః తాకీ ముద్దిడి మెటికలు చిటచిట విరిచిందీ
ఆ బాలకు నీ రెండు చేతులను అందుకున్నదండీ
లేవదీసి తన చంకకెత్తుకొని పోవదలచుచుండ ॥రాజ రాజ॥

అపుడు-

ఖలురాలగు పూతనను శిశువు క్రీగంట చూచినాడు
పాలిండ్లల్లో విసముండుటనూ పరికించాడండే
ముదమున కదలక మెదలక కన్నులు మూసి గుర్రుపెట్టే
నిదుర పోవుచున్నటుల నటిస్తూ నీరజాక్షుడుండె

పూతన ఆ పసివానిని చూచి ఇలాగన్నది-

అకొన్నావా! బాబూ ఇట్టుల అలసి పడున్నావూ
నా చనుబాలను గుక్కెడు త్రాగుము నీ చెలువము చూతు

అంటూ పసిబాలునితో మాట్లాడే పూతనను చూచి గోపికలు ఇలాగన్నారు-

ఎవ్వరి దానవు నీ విచ్చటికీ ఎందుకు వచ్చావూ
వీడు ఇతరుల చనుబాలను ఏనాడు కుడువబోడు
చాలు చాలు నీ యాగడమ్మ మా బాలు నిమ్మ తల్లీ
అనుచుండగనే యశోద రోహిణు లచటికి వచ్చారు ॥రాజ॥

ఆ సమయాన పూతన తన యొక్క--

చన్నుకుడుపుమని నోట దూర్చగా, చిన్ని కృష్ణుడపుడు
మేలుకున్నటుల రెండు కండ్లనూ మెల్లగ తెరిచాడు
ఆవులించుచూ రెండు చేతులను ఆదరముగ చాచి
బిగిగా చన్నులు బట్టి గట్టిగా పీడించాడండీ ॥రాజ॥

వెంటనే-

గుట గుట పాలను రెండు గుక్కలు గుంజ పీల్చినాడు
పాలతోడుగా పూతన యొక్క ప్రాణాల్పీల్చాడు
బాలుని నెట్టగలేక తన్నుకొని బాధతో తపించి
కెవ్వున కేకనువేసి పూతన క్రింద కొరిగి చచ్చె ॥రాజ॥

అప్పుడు పూతన వేసిన -

ఆ బొలి కేకకు భయపడి అచ్చటి గోపభామలెల్ల
తెలివి తప్పి ముప్పిరిగొని పడిరీ ఇలాతలము మీద
వంచకురాలగు పూతన దేహము వసుధపైన పడగా
ఆరుక్రోసులా దూరంవరకూ అది వ్యాపించిందీ ॥రాజ॥

తరువాత-

మూర్ఛదేరినా యశోద కృష్ణుని ముందుకురికి పోయి
అందుకొనుచు తన గుండె కాతనిని హత్తుకున్నదండీ

గోమూత్రంతో దృష్టి దీసి చను గుడిపి ప్రక్క వేసి
పాటలు పాడుచు బాలుని పాన్పున పరుండబెట్టింది ॥రాజ రాజ॥

పిమ్మట-

మధురనుండి నందాదు లిండ్లకూ మరలివచ్చినారు
చచ్చిన పూతన దేహము చూచి అచ్చెరువందారు
గొడ్డలితో ఆ తనువు ముక్కలుగ కొట్టి చీల్చినారు
దవ్వులకుం గొనిపోయి వాటినీ దహనం చేశారు ॥రాజ॥

సెగలతోడ చిటపట కాలెడి ఆ మగువ తనువు నుండీ
పొగలు వెడలెను సువాసనలతో అగరు ధూమమట్లు
దేహములోని కల్మషాలనా శ్రీహరి పీల్చుటచే
పూతన దేహము దోషము బాసీ పూతమాయె రాజా ॥రాజ॥

ఇంతేగాక-

హరి పూతనపై పదములు కరములు బరపి పాలుగుడువ
హరికి మాతవలె పరగతినందెను దురితాలను బాసి ॥రాజ రాజ॥

కావున-

గోపకాంతలూ, గోవులు పాలను శ్రీపతి కొసగుటచే
వారికి ప్రాపించెడి సద్గతులను వర్ణింపగతరమే ॥రాజ॥

ఇలా రోజులు గడుస్తుండగా-

బాలకు డొడిగిల పడ నేరిచె నని బంధుజనులపిలిచి
పుట్టిన నక్షత్రమున నందుని పొలతి యశోదమ్మ
వేదోక్తములగు కర్మలనూ జరిపించె బ్రాహ్మణులతో

వారి దీవనల బొంది అందరికి కోరిన విచ్చింది
పేరంటాండ్రకు పసుపు కుంకుమలు పెట్టినది బాబూ
విందులు చేసే నూతన వస్త్రా లందరి కిచ్చింది
గోపకాంతలను పూజిస్తూ తన కొడుకును మరచింది ॥రాజ॥

ఆ సమయంలో-

కంసుని పంపున శకటాసురుడను కామరూపుడొకడు
నంద నందనుని చంపుటకొరకై అందు చేరినాడు
ఊయెలలో నటు నిటు దొర్లుతు నా మాట బాలకుండూ
పాదము దగ్గర చేరిన బండిని బలముగ తన్నాడు
హరి తన్నిన కా శకట మెగిరెనూ అంతరిక్షమునకు
వికటముగా చెక్కలు ముక్కలుగా విరిగి నేలకూలె
అకటా యని శబ్దములు మాని గోపకులు చేరినారు
బండిని బాలుడు తన్నెనాయనీ గుండె చరచుకొనుచు

ఇలాగనుకున్నారు-

మిన్నునకూరక బండియెగురదూ తన్నజాల డితడూ
చిన్నవాడు బండిని తన్నినచో మిన్ను కెగురుతుందా ?
మత్త కోకిల
బాలుడెక్కడ బండియెక్కడ కాలదన్నగ జాలునా
గాలిలో పైకెగురునా ఇవి కల్లయో మరి సత్యమో
పాలుపోవదు ఊహకందదు పలుకనేరము చూడగా
ఏల తర్కము ఈ కుమారకు డెంత ఘనబలశాలియో?

అప్పుడు యశోద వచ్చి-

సంగతినంతా విని తన బిడ్డను చంకనెత్తికొనుచు
బాలగ్రహముల బాధ తొలగుటకు బాపల పిలిపించీ
వేదమంత్రముల జపతపాల హోమాదుల జరిపించీ
పైట గప్పి కృష్ణునకు తాను చనుబాల నిచ్చుచుండ
ఎందుకో శిశువు దొడ్డకొండవలె ఎంతో బరువెక్కి-
బరువు భరింపగలేక భూమిపయి పరుండబెట్టిందీ ॥రాజ॥

కృష్ణుడు-

కంస సేవకుడు తృణావర్తుడను గాలి సుళ్ళ తిరిగి
దుమ్ములేపి రేపల్లె యంతటా కమ్మి కనులచిమ్మ
కన్నులు తెరిపిడిపడక అంత చీకటులమయంబాయె
కొడుకు జాడకై యశోద వెదకుచు తడుముకొనెను చేత ॥రాజ॥

కండ్లు తెరిపిడి పడక యశోద దుఃఖిస్తూ-

ఇంతకు ముందే కొడుకా నిన్నూ ఇచటనె దింపాను
పాడుగాలి నిన్నెగురవేసి ఎట పడవేసెనొ బాబూ
ఎందుబోదు నిన్నెట్లు చూతునో సుందరాంగ కృష్ణా!
దేవతలారా నా పసికూనను కావరయ్యా మీరు
అని దుఃఖముతో విలపించెడి ఆ యతివ మోము చూచి
గోపికలూ కన్నీళ్ళు వదలుచూ తాపమందినారు ॥రాజ॥

తదుపరి-

గగన భాగముకు ఎత్తుకపోయెమగాని రాక్షసుండు
గోపబాలునీ బరువు మోయగా నోపజాలడాయె ॥రాజ॥

అప్పుడు-

బాలకుడూ ఏనుగతొండాలను బోలిన చేతులతో
దనుజుని కంఠము నులుపగ ఉరిలో తగులు పెట్టవోలె
ఊపిరి సలుపక తృణావర్తుడూ ఉర్విపైన బడియె
గనునము తప్పె తన్నుకొనుచు ప్రాణముల విడిచెనండీ. ॥రాజ॥

తరువాత-

పడిన తృణావర్తుని కళేబరముపైన నెక్కియున్న
గోవిందునిగొని యశోద కిచ్చిరి గోపభామలపుడు ॥రాజ॥

అప్పుడు గోపగోపికాజనము తమలోతాము ఇలాగనుకున్నారు.

పూర్వజన్మమున మనము చేసిన పుణ్యవిశేషమున
బాలకృష్ణుడి ఉపుట్టి మనకు తన లీలలు చూపాడు
మానవమాత్రుండి తడుకాడుపో, దానవారియనుచు
నందవ్రజమున గోపులంద రానందమందినారు.

ఒకనాడు-

ముద్దులు గొలిపే గోపబాలునీ ॥తంధానో తంధాన తంధనా॥
తల్లి రమ్మనీ దరికి పిలిచెనూ ,,
పాలుగుడిపి కేశాల నిమురుతూ ,,
బుజగించి ముద్దాడు చుండగా ,,
"ఆ"యని కృష్ణుడు నోటిని తెరచి ఆవులించినాడు ।తంధాన తంధన।

ఆపసిబాలుని నోటిలోపల ।తంధానో తంధాన తానా।
తల్లి చూచి ఆశ్చర్యపడినది ,,

దిశలు భూమియును ద్వీప శైలములు ,,
ఏరులు గాలియు ఇనుడు చంద్రుడూ ,,
ఖగోళమంతా అతని నోటిలో కానుపించెనండీ తంధాన తాన
చేతులెత్తి తనుమోడ్చి యశోద చేసెనండి వినుతి

ఇలా రోజులు గడచిపోతూ వుండగా ఒకనాడు-

వసుదేవుని కోరికపై నిజ్ఞుడు వారి పురోహితుడు
ప్రతిభావంతుడు గర్గుడు నందవ్రజముకు వచ్చాడు
నందుడాతనికి వినయంగానూ నమస్కరించాడు
అర్ఘ్యమిచ్చి కూర్చుండబెట్టెను సుఖాసనమ్ముమీద ॥రాజ॥

వసుదేవుడు ఇలా గన్నాడు -

సిఖిలవేద శాస్త్రజ్ఞులూ సై
జ్యోతిశ్శాస్త్ర ప్రవీణులూ ,,
జ్ఞానఘనులు పూజార్హులు ,,
బ్రహ్మవేత్తలూ గురువులూ మా
యూరివారి ఇండ్లు చేరగా సై
ఊరకరారు మహాత్ములూ ॥భాగవతా॥

తలచినంతనే కామధేనువూ దరికి వచ్చినట్లూ
మా పుణ్యము పండుటచే తాము మాకు లభించారు
పేర్లు పెట్టలే దింతవరకు మా పిల్లల కిద్దరికీ
నామకరణమును విధ్యుక్తంగా తాము చేయవలయు
మా బాగోగులు క్షేమము కోరే మాన్యులండి మీరు
పిల్లల రక్షణ కుక్కకవచములు పెద్దల దీవెనలు

అని నందుడు రామకృష్ణులను గర్గాచార్యుల వారికి చూపించాడు. ఇంతేకాక కంసునిచేత దెబ్బతిని, ఆకాశానికి ఎగిరిపోయినట్టి యోగమాయ చెప్పిన విషయాలు తేటతెల్లముగా చెప్పాడు. అప్పుడు వసుదేవుడు లోగా తనతో చెప్పిన విషయం గుర్తుకు వచ్చింది. కృష్ణుడు దేవకి కొడుకనీ నందుని అభిప్రాయం గర్గాచార్యుని వలన నందునికి తెలిసి ధ్రువపడింది. ఆ గర్గాచార్యులు -

పెద్దవానికీ బలరాముడనీ
పిన్నవానికీ శ్రీకృష్ణుడనీ
నామకరణమును జరిపించారు
మాతా పితృ శిశువులకు నాయువు
పెరుగు నటుల దీవించె గర్గుడూ ప్రేమతోడ రాజా
నందుని వలనను సత్కారాలను పొంది వెడలిపోయె ॥రాజ॥

తరువాత -

పిల్లలిద్దరూ రోజురోజుకూ పెరుగుచునున్నారు
తడబడు అడుగుల మాని చక్కగా నడవ నేర్చినారు
ముద్దు మాటలను మాని చక్కగా పద్దులు నేర్చారు
వయసు పెరుగగా బాలకు లిద్దరు పరుగులు తీశారు
వాడలోని బాలురతో నాటల నాడ నేర్చినారు
అద్భుతలీలల చూపి అందరిని ఆకర్షించారు ॥రాజ॥

6)

ఇంకను శ్రీకృష్ణుడు -

ఇరుగు పొరుగు వాకిండ్ల దూరుతూ ఎవ్వరెరుగకుండా
పాలను పెరుగును వెన్నముద్దలను భక్షణ చేస్తాడు
గుట్టు చప్పుడు కాకుండా కనిపెట్టి యింటికేగి
తల్లి దగ్గరకు వెళ్ళిముందుగా రన పొట్టను చూపి
ఆకలి బాధకు తాళజాలనని ఆమె తోడచెప్పి
నిరపరాధివలె పాలను త్రాగి నిద్రవోవునండీ ॥రాజ॥

ఇంకా ఆ కృష్ణస్వామి తన తోటి బాలురతో ఎలాంటి ఆటలాడుకునే వాడంటే-

అబోతుననే నాపులు మీరని అరచి వంగి నడచు
రాజును నేనూ భటులు మీరనీ రాజసాన్ని చూపు
దొంగను నేనని వారి సొమ్ములను దొంగిలించుతాడు
నటులుమీరు నే సూత్రధారినని నాటకాల నేర్పు
దాగుడు మూతలు బంతులాడుతూ తూగుటూయలూగు
ఆటలెన్నియో ఆడి అందరిని హాయి గొలుపుతుండ
పాపని మాటలు గోపకాంతలకు తీపులు పుట్టించె
పనుల మరచి ఆ రూపామృతమును కనుల జుర్రినారు ॥రాజ॥

ఈ విధంగా శ్రీకృష్ణుడు యధేచ్ఛగా తిరగడంలోనూ, మాట్లాడడంలోనూ దక్షుడై -

ఆడుచు నాడుచు దొంగతనాలను క్రీడలుగా జూసి
గోపిక లోపికలేక యశోద ప్రాపుకేగి యనిరి ॥రాజ॥

ఏమన్నారయ్యా అంటే ?

పడతీ నీ బిడ్డడి యాగడములు భరింపలేమమ్మా
పోయెద మమ్మా ఎచ్చటి కయినా ఈ యూరును విడిచీ
కాగిన పాలను త్రాగి యెక్కడోకడవలుదావాడు
ఎచట వెదకినను అవి కనిపించవు ఏమి పాపమమ్మా ॥పడతీ॥

మరో ముదిత-

బాలెంతలు తమ పాపలకోసం పాలు పితుకులోన
ఆవు పొదుగులకు లేగదూడలను త్రావవిడిచినాడు ॥పడతీ॥

మరో యువతి -

ఉట్టి అందక కుండకు చిల్లులుకొట్టి పాలు త్రాగి
మీగడమెక్కి పెరుగు చేరలతో మ్రింగినాడు తల్లీ
తినగ మిగిలినవి కోడలమ్మ మూతికి పూశాడమ్మా
కోడలె త్రాగిందనుచూ ఆమెను కొట్టెనమ్మ అత్త ॥పడతీ నీబిడ్డని॥

ఇంకో స్త్రీ వచ్చి -

వారి యింటిలో దుత్తలోనేతిని చేరలతో త్రాగీ
వీరి యింటిలో కాళీ కడవను పారవేసినాడు
నేయి త్రాగినది వీరేనంటు నేరముపై మోప
వారికి వీరికి పడుగురిలోన వాదమాయెనమ్మా
పడతీనీ బిడ్డని యాగడములు భరింపలేమమ్మా

మరో భక్తురాలు వచ్చి -

దేవుదెవడు నాకంటే వేరుగ దేవుడొకడుగలడా
అనుచు వేలుపుల మందిరమ్ము దాపునకు చేరినాడు

వికవికనవ్వుతు దేవునిపైన వేసెనమ్మ ఉమ్మి
కాంచలేక ఆ దృశ్యము మేము కన్నులు మూశాము.
పడతీ నీబిడ్డని యాగడములు భరింపలేమమ్మా

ఇంకొక గోపిక-

చిన్నవాడనీ బుగ్గపుణికి నీపేరేమని యడుగ
ఈయమ బుగ్గను కొరికెను కాటును ఇంతి చూడవమ్మా
పడతీ నీబిడ్డని యాగడములు భరింపలేమమ్మా।

మరొక అతివ-

మా బిడ్డడు నిదురించుచుండగా మా యింటికి వచ్చి,
లేగదూడ కొకదాని తోకకూ బాగ త్రాడుగట్టి
మా పిల్లడి జుట్టుకు ఆ త్రాటిని మలచి ముడివిగించి
పాపడేడువగ వింటూ నవ్వుతు పారిపోయినాడు ।పడతీ।

మరొక అబల-

నా కుమారుడూ కోడలు కూడిన ఏకాంతమునందు
ఇద్దరి మధ్యన చచ్చిన పామును వేసినాడు తల్లీ ॥పడతీ॥

ఇంకో ఇల్లాలు-

అమ్మా నీ బిడ్డని దుడుకులకూ అంతులేక యుండె
ఎపుడు వచ్చునో నీ కొడుకంటూ ఎచటికేగకుండా
పాలూ పెరుగూ వెన్నమీగడలు భద్రపరచు కొనుచు
తలుపులు మూసీ గదులకన్నిటికి తాళాలను వేసే
ఇంటి చుట్టు తిరుగాడుచుమమ్మా కంటికునుకు మాని
ఒకచోట నిలుచుంటి మమ్ములను వెక్కిరించుతాడు

పోయెదమమ్మా ఎక్కడికయినా ఈయూరును విడిచీ
ఐశ్వర్యము మీకుంటే తినవలెనంతేగాని తల్లీ
బడుగువారి కొంపలపై కొడుకును నిడువతగునటమ్మా
పోవుచుంటిమీ పుట్టిండ్లకు నా యావులపై ఒట్టు ॥పదతీ॥

ఈ విధంగా గోపికలు ఒకర్ని తోసుకుని మరొకరు వచ్చి వరుసగా చెపుతుంటే యశోద తెల్లబోయి ఇలాగన్నది-

నా బిడ్డడు ఒక నిమేషమైనా నన్ను విడిచిపోడు
పయ్యెదచాటున దూరి యెప్పుడూ పాలు త్రాగుతాడు
పసిబాలునిపై ఆరోపణలూ, పాడియగునటమ్మా
మంచివానిపై ఎగ్గులాడుటా మానరమ్మ మీరు

అని యశోద అన్నది. వారందరు చెబుతున్నంతసేపు కృష్ణుడు తల్లి చెంగుచాటున పాలు తాగుతూనే ఉన్నాడు. తరువాత కొంత కాలానికి ఒకనాడు-

బలరాముడు పినతల్లి వద్దకూ పరుగులతోవచ్చి
అమ్మా! తమ్ముడు మన్నుతినెననీ యనగ యశోదమ్మ
చిన్నికృష్ణునీ చేయిబట్టుకొని అన్నదిట్టులండీ
ఇంటిలో పెరుగు వెన్నమీగడలు ఎన్నెన్నోగలవు
మన్నుదినుటకూ కారణమేమో యన్నా చెపుమోయి
ఇంత తుంటరివి అవుతావని నేనెపుడు తలపలేదు

అని యశోద కృష్ణుని బుగ్గపట్టుకోగా కృష్ణుడు చిరునవ్వుతో

అమ్మా వీరలు చెప్పేవన్నీ అసత్యాలు సుమ్మా
మన్ను తినుటకూ నేను శిశువునా మందుడనా తల్లీ!

నను కొట్టింపగ వీరు చెప్పిరీ నమ్మకు మామాట
చూసుకొమ్మ నా నోటిలోన ఆ వాసనగలదేమొ
తదుపరి నిజమును తెలిసికొనుచు నను దండించుము తల్లీ
అనుచు నోటినీ తెరిచినాడయా, అఖిలాండేశ్వరుడు ॥రాజ॥

కృష్ణుడు నోరుతెరవగానే చూస్తూ యశోద తెలతెలపోయింది-

బాలుని నోటిలొ తారలు వనములు
జలధులు గిరులూ చంద్రాదిత్యులు
దిక్కులు దిక్పాలకులూ గ్రహములు
భూతకోటి భువనాలు జీవులూ
బ్రహ్మాండంబే అతని ముఖములో ప్రదర్శింపబడియె ॥తంధాన॥
కలయో వైష్ణవ మాయయోయని తలచె యశోదమ్మ ”

ఆమె తనలో ఇలా చింతించింది-

విశ్వము బాలుని నోటిలోపల వెలయుటేమి కతమో
బాలునివలె నీతడు మనలోపల భాసించెను గానీ
జగతి లోపల బయట నిండిన చక్రధారి యితడు
సర్వాత్ముండగు విష్ణువితడే సందేహములేదు

అని నిశ్చయించి-

పూర్వజన్మమున గోపులు చేసిన పుణ్యఫలమువలన
అఖిల లోకముల కాధారుండే యవతరించినాడు
హరియే ఇచ్చటి నంద వ్రజమున పెరుగుచున్నవాడు
ఆశ్రయింతునే పాపహరణమున కతని పాదములను

అని మనసులో ప్రార్థించింది. ఇంతలో మాయ క్రమ్ముకోగా కృష్ణుడికి పాలివ్వడం ఆరంభించింది. అని శ్రీశుకుల వారు చెప్పగా పరీక్షిత్తు ఇలా అడిగాడు-

యోగి పుంగవా! నారాయణునీ ఒడిలో నుంచుకొని
పాలనిచ్చు భాగ్యము యశోదకూ ఏల కలిగెనయ్యా
నంద యశోదలు చేసిన పుణ్యము విందు సంతసమున
పూర్వజన్మమున వీర లెవ్వరో పూర్తిగ చెపుమయ్యా ॥మౌనిచంద్ర॥

అని అడుగగా శ్రీశుకుడు పరీక్మహారాజుతో ఇలాగన్నాడు-

వసువులలోనా ద్రోణుండనియెడివాడు ముఖ్యడండీ
ఆతని దేవీ ధరాదేవియను నాఖ్యతోడ బరగె
ఆ దంపతులను బ్రహ్మదేవుడే యవని పుట్టుడనగా
బ్రహ్మదేవునికి వారలిద్దరూ ప్రణుతి చేసియనిరి. ॥రాజ॥

ఏమన్నారంటే ?

మాధవుసేవా భాగ్యమప్పుడూ మాకు లభించినచో
తిరిగి జన్మమును పొందుటలో మాకరమరలే దనిరి.
ఆశ్రితవత్సలుడగు చతుర్ముఖుడు అట్లైకాక అనియె
నంద యశోదలుగాగ ద్రోణధర లిందు పుట్టినారు. ॥రాజ॥

ఈ జన్మలో-

కమలగర్భు మాటలను వెన్నుడూ గౌరవించినాడు.
తల్లిదండ్రులుగ నందయశోదల తగ మన్నించాడు ॥రాజ॥

తరువాత కథ ఏమయ్యాంటే -

దిన దినానికీ కృష్ణుని అల్లరి పనులు పెరిగిపోయె
తల్లి యశోదకు ఓర్పునశించీ తల్లడిల్లుచుండె ॥రాజ॥

అలాంటి సమయంలో ఆ యశోదమ్మ యీ విధంగా ఆలోచించింది-

బాలురు లాలన చేసేకొద్దీ బండబారుతారు
దండింపనిచో వీడెన్నటికీ దారికి రాబోడు.

అనుకొని-

చేతిలోననొక బెత్తము పట్టి శ్రీ కృష్ణుని పిలువ
గల్లున గజ్జెలు మ్రోయ కృష్ణుడూ గంతులిడుచు వచ్చి

యశోదమ్మగారి చేతిలోని బెత్తాన్ని చూచి-

తల్లిచేత బట్టిన బెత్తాన్ని అల్లన చూచాడు
భయపడినట్లుగ అచట నటించి పరుగుతీసినాడు ||రాజ||

అప్పుడు యశోదమ్మ -

వీడిపోయి తన కొప్పులోనగల విరులు నేలజార
పయట జారగా చెమటలూర జవ్వాడు నడుముతోడ
మునుల మనస్సులు వెంబడించినను కనజాలని వారిని
ఆయాసముతో మూల్గుచు రొప్పుచు ఆమె వెంబడించె ||రాజ||

అప్పుడు శ్రీకృష్ణుడు -

స్తంభము చాటుకుపోయి అటు నిటూ తప్పు లాడుతాడు
అమ్మా ఇక నేనెపుడు చేయను అల్లరి పనులనుచు
రెండు చేతులతో చెంపలు వేసుక దండము పెడతాడు
దొంగయేడ్పుతో కన్నీరొలపుచు అంగలార్చుతాడు
దొరికినయట్లే దొరికి క్షణంలో పరుగిడిపోతాడు

కన్నీటను తన ముఖాని కంతట కొటుక పులుముకొని
దొంగచూపుతో తల్లివచ్చు దెస తొంగి చూచుతాడు
తనను పట్టుకొన ఆయాసముతో చనుదెంచుచున్న
తల్లి బాధలను జూచి కృష్ణుడూ, తనలో జాలిపడి
పట్టుబడదలచి తానే స్వయముగ పట్టుబడెను రాజా ॥రాజ॥

తరువాత యశోద -

చేతికి చిక్కిన సుతుని కొట్టుటకు చేతులాడలేక
కరుణ గలిగి ఆ చిలిపిక్రిష్ణుని కట్టివేయదలచె ॥రాజ॥

అప్పుడు ఆమె ఇలా గన్నది-

వీరు కృష్ణులా కారా యెన్నడు వెన్నగానరటగా
దొంగతనము లేమాత్ర మెరుగనీ దొరలు వీరలటగా
గోపికలంతా తమరిని గూర్చి గొప్పగ చెప్పారు
ప్రాణాల్ విసికిపోయెనురా నీ పాడుపనులచేత
దూకవద్దురా నీటిలోన యన దూకి తీరుతావా
ఆడవద్దురా మట్టిలోన యన అటులె యాడుతావా
పారే కాల్వకు అడ్డాల్గట్టీ నీరు నిలుపుతావా
బిడియము విడిచీ అందరివద్దా బిచ్చమెత్తుతావా
ఒడలిపైన బట్టలు లేకుండా ఊరు తిరుగుతావా
వద్దని చెప్పిన వాటినె చేస్తూ హద్దు మీరుతావా
పాపమనుచు నిన్నాళ్ళు ఓపికను పట్టినాను నేనూ
నక్కజిత్తులతొ మోసాలను ఇక నన్ను చేయులేవు
నిన్ను పట్టుకోలేరు ఎవ్వరని నిక్కుతుంటి వౌరా
నేను నిన్ను చిక్కించుకొ జాలని దానిగాను సుమ్మా

అంటూనే-

త్రాడుదెచ్చి గోపాలుని నడుమున కూడకుండగట్టి
రెండవ కొనతో రోటికి కట్టెను పుండరీకనయను
సిరికౌగిటిలో ఎంతమాత్రమూ చిక్కనట్టివాని
సనకాదుల మనసులలో నిలువక జారిపోవువాని
వేదాలకు నావల తేజముతో వెలుగునట్టి వాని
బ్రహ్మాండమునే తనదు బొజ్జలో భద్రపరచువాని
జ్ఞానులు మౌనులు యోగులు గూడా గాంచలేనివాని
బలమగు త్రాటిని చుట్టి గట్టిగా బంధించె యశోద ॥రాజ॥

తరువాత యశోదమ్మ ఇంటి పనులలో వంట పనులతో తిరుగుతున్నది. పూర్వం నారదుని శాపంచేత మద్దిచెట్ల రూపంలో ఉన్న నలకూబరుడూ, మణిగ్రీవుడనే ఇద్దరు యక్షులను చూచి శ్రీకృష్ణుడు రోటిని ఈడ్చుకుంటూ ఆ చెట్ల వద్దకు వెళ్ళాడు. అని చెప్పగా పరీక్షిత్తు శ్రీశుకునితో ఇలా గన్నాడు -

హేయి మాకు సద్గురువులూ - సై
ఆరాధ్యులు విద్వాంసులూ ”
మణిగ్రీవ నలకూబరుల్ ”
మద్దిచెట్లుగా మారగా ”
నారదుడేల శపించెనో ఆ కారణాన్ని వివరింపుడీ
॥భాగవతామృత॥

అపుడు శుకయోగి ఇలా వివరించాడు -

అలకాపురియని ఉత్తర దిక్కున అలరు నొక్కపురము
ఆ నగరానికి కుబేరుడనెడీ అధిపుడు గలడండీ
పరగ నా కుబేరునకు కొడుకులూ ఇరువురు ఉన్నారు
మణిగ్రీవ నలకూబరాఖ్యులన్ గణుతి కెక్కినారు ॥రాజ॥

వారు -

పార్వతీపతిని అన్నదమ్ములూ భక్తితోడ గొలువ
శంకరు డొసగిన వరములచేత నహంకరించినారు ॥రాజ॥

వారిద్దరూ -

మద్యపానమునుచేసి మత్తుతో మందాకిని యందు
లలనామణులంగూడి జలక్రీడలను సలుపుచుండ

అలాంటి సమయాన -

మూడు లోకముల తిరుగాడుచు సురమునియగు నారదుడు
సురనదిలో నాహ్నిక కృత్యాలను నెరవేర్పగ వచ్చె
వచ్చుచున్న నారదుని చూచి ఆ వనితలు పైకెక్కి
వస్త్రధారణము చేసి మౌనికి వందనమన్నారు

కాని -

కుబేరపుత్రులు వళ్లు తెలియక కొవ్వు కండ్లకెక్కి
వెకిలినవ్వులతొ తమ ప్రియురాండ్రను వెంబడించుచుండ

అపుడు నారదుడు తనలో అనుకున్నాడు -

ధనవంతుని కొడుకులమను రోగము తగిలెను వీరలకు
ధనమదాంధుల రోగాలకు కడు దారిద్ర్యమె మందు

ధనికు డితరులను తనకంటెను కడు తక్కువగా చూచు
బీదవాడు నమ్రతతో నందరి నాదరింప జూచు
చెలియలతో విహరించే వీనికి బలిసిపోయె కొవ్వు
అది తగ్గుటకై వీరు శాపమును అనుభవించవలయు ॥రాజ॥

అని నారదుడు తనలో నిశ్చయించుకొని -

మణిగ్రీవ నలకూబరులారా! మదించిపోయారా?
పిన్నా పెద్దా తెలియని దశలో నున్నారా మీరు
జగతిని మీరూ మద్దిచెట్లులై జన్మింతురుగాక
అనుభవింపు డీ శాపఫలంబని అన్నాడా మౌని ॥రాజ రాజ॥

అప్పుడు కుబేరుని కొడుకులు విలపిస్తూ స్వామీ! అజ్ఞానుల మగు మాకు శాపవిమోచనాన్ని అనుగ్రహింపమని పాదాల పైబడి ప్రార్థింపగా నారదులవారు శాంతించి వారితో నిలా గన్నాడు -

ద్వాపరయుగమున భూలోకములో గోపాలునిచేత
శాపమోక్షమూ మీకు గలుగునని తాపసి వెళ్ళాడు ॥రాజ॥

అందుకని ఆ మణిగ్రీవ నలకూబరులు ఈ పల్లెలో మద్ది చెట్లుగా పుట్టినారు -

వారిని శాపవిముక్తుల జేయగ వనజాక్షుడు తలచి
నడుముకు కట్టిన త్రాటితోడనే నడిచె చెట్లలోకి
బాలుని వెంబడి చెట్లమధ్యనూ రోలు దొర్లగానే
పటపటమంటూ రెండు మద్దులూ పడెను వింతగాను ॥రాజ॥

అపుడే -

శాపముక్తులై కొబేరులు తమ రూపాలను పొంది
తలలు వంచి చేతులు జోడించి నిలిచి పలికిరిటుల
దేవదేవ! హే జగన్నాయకా! పావనగుణజాలా !
శాపము తొలగెను ధన్యులమైతిమి నీ పదములు సోక
నీ కథలను విని పాటల బాడుచు నీ సేవల చేస్తూ
నీ పదములపై తలను వంచి మది నీయందే నిలిపి
అన్ని వేళలలొ నిన్ను భజించుట ఆనందము స్వామీ!
మాకు లభింపగ జేసినాడవా మహాదదృష్టమిప్పుడు

అని ప్రార్థించారు. కృష్ణుడు నవ్వి వారికి సెలవిచ్చాడు.
అప్పుడు —

పిడుగు చప్పుడని అనుమానించి పడిన చెట్లదరికి
తన జనములతో నందుడు వచ్చి తలచెను మదినిట్లు
ఈ పాదపములు కూలగ బాలుండెట్లు బ్రతికినాడో
పిడుగుపడినటుల కానరాదిచట పెనుగాలియు లేదు
కొట్టుటచే పడిపోయెనందమా, గొడ్డలి కనబడదు
పాపడీతడూ వీటినిబట్టి పడద్రోయగలేడూ
తరువు లేల కూలినవో వింతగ ధరణిమీద ననుచు
పలుపలు విధముల నందగోపులు తలపోసిరి రాజా ॥రాజ॥

అప్పుడు అచటనున్న బాలకులు ఇలా గన్నారు —

నందుని కొడుకీ రెండు వృక్షముల సందున దూరాడు
నడుమునకు కట్టిన రోలు అతనితో దడదడ దొర్లింది
మద్దులు రెండూ రోటి తాకిడికి మహిని కూలగానే
సురల వంటి ఇద్దరు వెలువడగా చూచినాము నేము

ఆ పిల్లల మాటలు అసత్యాలని కొందరు ఆ
కాని -

పడిన చెట్లదగ్గర కృష్ణుడు నిర్భయముగ నున్నాడు
నడుముకు రోటికి కట్టిన త్రాటిని నందుడు విప్పాడ

కృష్ణుణ్ణి దగ్గరకు తీసికొని ముద్దాడి ఇంటి
వెళ్లాడు. ఇలా ఎన్నో లీలలు చూపిస్తూ గో
ఆశ్చర్యంలో ఆనందంలో ముంచి తే
శ్రీకృష్ణుడు. ఒకనాడు నందుడు ఒక సమావే
చేసి —

పల్లెలోని పెద్దలను బంధువుల నెల్ల పిలిచినాడు
అచ్చట జరిగే దినగండాలను ముచ్చటించినాడు

పూతన వచ్చి విసము నిచ్చెనూ
వడిగా నొక సుడిగాలి వచ్చెనూ
శకటాసురుడూ చంపచూచెనూ
తరువులు వ్రేళ్ళతో ఒరిగి కూలెనూ

ఎప్పుడు ఏ రాక్షసుడు వచ్చునో ఏ ప్రమాదమగునో
కనుక ఇచ్చటనుండుట శ్రేయస్కరము గాదు మన
ఎచ్చటికైనా వలసపోదమూ ఈ గ్రామము వదలీ
బ్రతికియున్నచో శుభములనెన్నో బడయవచ్చుగాదా

ఆ మాటలను అందరు విని, ఆ గ్రామం వది
వనం వెళ్ళుదామని నిశ్చయించుకున్నారు.
వనంలో

పశువుల మేతకు పలసిన చక్కని పచ్చిక బీళ్ళుండు
విరివిగ ఫలముల బరువులతోడీ తరులు వంగియుండు
సువాసనలతో పూలతీగలా శోభిలునని తలచి
బంధువు లందరు గూడి అచటకూ ప్రయాణమైనారు ॥రాజ॥

కొందల మందక అందరూ -ఆల
మందల ముందగ పంపిరీ-ఆ, వి
రుందనె వారూ నడిచిరీ - మరి
కొందరు పిల్లలు పట్టిరీ-ఆ
నందముతోడను సాగిరీ-ఆ
బృందావనమును చేరగా ॥భాగవతామృత॥

తేరులూ ఆట నిల్పినారూ -వృద్ధ
నారులూ బాలురెక్కారూ - పాద
చారులై కొందరేగారు — యువక
వీరులూ తోడు నడిచారు - గొప్ప
భారాల కావళ్ళ సామాన్ల గంపలతొ
సన్నాయి కొమ్ములతో సాగిరీ యాదవులు
॥ఓ రామ రాఘవా శ్రీరామ జయరామ రావయ్య దశరథా రామా॥

రామకృష్ణులను ప్రత్యేకమగు రథ మెక్కించారు
బలకృష్ణులతో రోహిణీ యశోదలు పయనించారు
పెళ్ళివారు చుట్టాలతో తరలి వెళ్ళినట్లుగాను
పావనంబగు బృందావనముకు వారు చేరినారు
అర్ధచంద్రునీ ఆకారంతో ఆపినారు బండ్లూ
శాలలు పాకలు వేసుకొనుచు తమ కాలము గడిపారు ॥రాజ॥

ఈ ప్రాంతంలో -

గోపబాలురూ రామకృష్ణులూ కూడి వేడుకలతో
దూడలకాస్తూ ఎన్నో రీతుల క్రీడలు సలిపారు ॥॥రాజ॥

ఇలాగుండగా ఒక రోజున -

యమున వద్దునా ఆవుల మేసే సమయమందు రాజా
దూడ రూపమున రాక్షసు డొకడు దూరె మందలోన ॥రాజ॥

ఆవుదూడ రూపంలో వచ్చింది వత్సాసురుడనే రాక్షసుడు.
ఆతడు —

ఆలదూడలను నాకుచుండ గోపాలుడు చూచాడు
బలరాముని దరిజేరి నవ్వుతూ పలికె కృష్ణమూర్తి ॥రాజ॥

ఏమన్నాడంటే —

అన్నా లేగడిదూడ అల్లదే అందముగా నుండె
కనుమని దగ్గరికేగి తోకతో కాళ్ళను బిగబట్టి
దగ్గరలోగల వెలగచెట్టునకూ విగ్గరగా కొట్ట
రక్తము కక్కుచు తన్నుకొనుచు ఆ రాక్షసుడూ చచ్చె

॥రాజ॥

మరణించిన వత్సాసురు కాయము దరికిచేరి త్రుళ్ళి
గొంగడు లెగురవ్వేసి బాలురు చెంగున దూకారు
ప్రేమతోడ నా కృష్ణునకూ జయపెట్టినారు వారు
బాలకు లందరు సంతసమున చప్పట్లు కొట్టినారు రాజ॥

మరోనాడు శ్రీకృష్ణుడు తోటి బాలురతో -

పచ్చిక బాగా పెరిగిన బీడుకు పశువుల తోలుకొని
కడుపు నిండుగా ఆవుదూడలకు గడ్డిని మేపారు

బురద తేరిన తేటనీటి నొాక చెరువున త్రాగించీ
వారుగూడ జలపానముచేసీ బయలుదేరినారు ॥రాజ॥

అపుడు -

దారిలోన ఒక పెద్ద కొాంగను వారు చూచినారు
దృష్టిని చక్కగా నిలిపి ఆ బకము కృష్ణుని చూచిందీ
ఒక్కసారి రెక్కలు విసరిందీ ముక్కును తెరిచిందీ
రివ్వున గాలిలొ వచ్చి కృష్ణునీ మ్రింగివేసెనండీ
కొాంగ నోటబడి కృష్ణుడు దానీ గొాంతు నులుముచుండ
మింగలేక నా కొాంగ బాధపడి నింగివైపు క్రక్కె ॥రాజ॥

అప్పుడు -

భయపడి గడగడ వణకుచు గుండెలు దడ దడ మనుచుండ
గోపబాలు రది చూచి నిలువున కొయ్యబారినారు
మరల కృష్ణునీ పొడచుట కొరకై అరుగు దెంచుచుండ
బకము ముక్కునూ రెండుగ చీల్చిపార వేసె శౌరి ॥రాజ॥

తరువాత —

బకుని తమ్ముడూ అఘాసురుండను పర్వత సన్నిభుడు
అన్న మరణమును విన్నతోడనే ఆగ్రహించినాడు
అన్నగారికి శాశ్వతమ్మగూ ఆత్మశాంతి కొరకు
సమూలమ్ముగా గోపకులాన్నే చంపదలచినాడు ॥రాజ॥

ఆ కోరికను నెరవేర్చుకోవడానికై ఆ రాక్షసుడు -

పర్వతమంతటి ఎత్తుగలిగినా
ఆరుకోసుల బారు గలిగినా

మబ్బుల వంటీ పెదవులు గల్గిన
కొమ్ముల వంటీ కోరలు గల్గిన
కొండచిలువ రూపాన్ని ధరించి పరుండెనండి అచట
||రాజ||

ఆ చిలువ యొక్క -

గొంతు చీకటీ గుహలాగున్నది
కన్నులు నిప్పులు కక్కుచున్నవీ
వేడిశ్వాసను విడచుచున్నదీ
నాలుక చాచీ కదల్చుచున్నది
కోరల సందులు బిలాలవలె కడుఘోరముగానుండె
దారి కడ్డముగనుండ బాలుడు దాని చూచి నవ్వె ||రాజ||

ఆ పిల్లవాండ్రు ఇలాగనుకున్నారు -

బకుని చంపిన కృష్ణుడుండగా పాముని భయమేల
అందరము గోవులను తోలుకొని ముందుకు పోదాము
పిరికి పడకుడది మనను మింగినా భీతిలేదు మనకు
చిలువగూడ ఆ బకుని జంటకూ చేరుట నిజమోయి

అని తమలో తాము మాట్లాడుకుంటూ -

క్రూరవ్యాళము గొంతులోనికీ దూరినారు వారు
వారి వెంటనే కృష్ణుడు గూడా ప్రవేశించినాడు
గొంతువద్ద నిలుచుండి శరీరము నెంతయు పెంచాడు
ఊపిరియాడక క్రుక్కి మెలిపడుచు ఉరగము బుసగొట్టి

విలవిలలాడుచు అజాగరమ్మూ విడిచె ప్రాణములను
భయము లేకయే గోవులు బాలురు బయటకు వచ్చారు

తరువాత-

ఆ పెనుబాము మేని నుండి ఒక అద్భుతమగు వెలుగు
బయలుదేరి శ్రీకృష్ణుని లోన ప్రవేశించె రాజా ! ॥రాజ॥

ఆ యద్భుతమును జూచిన సురలూ
విరుల వర్షమును కురిపించారు
అప్సరసలు నాట్యముల చేసిరీ
గంధర్వులు గానమును చేసిరీ

మద్దెల వాద్యాలోయన ఉరుములు దద్దరిల్లి మ్రోగె
సిద్ధగణాలూ జయజయధ్వానాల్ చేసినారు రాజా
ఆ వాద్యాలను ఆ పాటలనూ ఆలకించి అజుడు
ఆ దృశ్యాలను చూచి చకితుడై ఆశ్చర్యమునందె ॥రాజ

శ్రీకృష్ణుడు ఆ గోవులనూ గోపబాలురనూ కొండచిలువ నోటినుండి రక్షించి వెళ్ళుతూ వుండగా ఒక చెరువు కాన్పించింది. అది ఎలాగుందంటే -

కలకదేరినా మధుజలాలతో
ఎర్రగపూసిన కలువ పూలతో
కిలకిలకూసే విహంగాలతో
వరుసగ కదిలే తరంగాలతో

పూల పరాగము తోడవచ్చు లేగాలి పరిమళముతో
శరీరాన్ని పులకించే చల్లని జలముల కణములతో

హాయినిచ్చు ఆ చెరువుగట్టుకూ అందరు చేరారు
చెట్లనీడలో నిలిచినట్టి తన చెలికాండ్రను చూచి
శ్రీకృష్ణుడు ఇలా గన్నాడు -

స్నేహితులారా ఎండకు ఒడలూ చెమటబట్టి పోయే
అలసియున్న మనకీప్రదేశమూ హాయిగ ఉంటుందీ
ఇక్కడ కూర్చొని భోజనాలనూ చక్కగ చేయుదమూ
పశువులు నీళ్ళను త్రాగి ఇచటనే పచ్చిక మేస్తాయి

అనగానే గోపబాలురు గంతులేస్తూ -

అందరు తమ తమ ఆవులా సై
చెరువులోకి దింపారయా "
నీటిని త్రాగించారయా "
ఈతలనే కొట్టారయా సై
పచ్చికబీళ్ళ లోపలా-తమ-పశువులనూ వదిలారయా

॥భాగవతా॥

కావళ్ళ కిందికీ దింపిరీ-వారు
చద్దిమూటలూ విప్పిరీ-వారు
కంచము లాకులు పరిచిరీ-వాటి
అంచుల పచ్చళ్ళు వేసిరీ-వారు

అన్నాలను వడ్డించుతూ - ఆ-యర్భకులెంతో మురిసిరీ

॥భాగవతామృతపానము భగవత్పదసోపానమూ॥

మీగడ పెరుగును కలుపుతూ సై
సరసపు మాటల నాడుతూ-ఆ
చద్దిముద్దలను మింగుతూ-తన
ఎదుటవారి నూరించుతూ-వారు
ఒకరి కంచమున చద్దినీ - ఇంకొకరు మెక్కుతున్నారయా -
॥భాగవ॥

మాగాయను చప్పరించుతూ సై
ఆవకాయ ముక్క చీకుతూ "
తేపకు లొటకలు వేయుచూ "
ప్రక్కవాని నుడికించుచూ "
తోటిబాలురకు చూపుతూ-తమ-నోట వేసుకుంటారయా
॥భాగవతామృతపానమూ - భగవత్పదసోపానమూ॥

తరువాత -

గోపబాలకులు కృష్ణుని మధ్యన కూర్చోన బెట్టారు
నవ్వుతా డొకడు స్నేహితు లందరి నవ్విస్తా డొకడు
॥రాజ॥

ఇలా వీరుండగా -

పచ్చికమేస్తూ పశువులు దూరపు బాటబట్టి నడిచె
పశువుల జాడలు తెలియక కృష్ణుడు బాలురతో ననియె
॥రాజ॥

స్నేహితులారా —

మన ఆవులు దూడలు ఇందెచ్చట కనిపించుటలేదు
దొంగపాటుగా పొంచి వానినీ మ్రింగెనేమొ పులులు

కావున -

మీరు ఇచటనే ఉండి చల్దులను ఆరగించుడయ్యా
పశువుల చూచి వచ్చెదనేనని బయలుదేరినాడు ॥రాజ॥

ఇచ్చటనే గద పచ్చిక మేసెను
ఇచ్చటనే త్రాగినవి నీటినీ
ఇచ్చటనేగద మందగొన్నవీ
ఇచ్చటనేగద విడిపోయినవీ

అనుచు కొలకులను తరులను గిరులను అరయుచు తిరిగాడు
వెదకి వెదకి పసరముల గానక వెనుకకు మళ్ళాడు ॥రాజ॥

తరువాత -

తిరిగి వచ్చి చూచేసరికే సహచరులు లేరు అచట
ఆవుల బాలుర కానని కారణ మాలోచించాడు ॥రాజ॥

ఏమని ఆలోచించాడంటే—

బహుశా యీ వంచనకు దిగినదా బ్రహ్మదేవుడగును
ఇపుడు మిత్రులను గోవుల వదలీ ఇంటి కేగలేను
అందరి కేమని నచ్చచెప్పుదును బృందావనమందు
అన్నిరూపముల నేను ధరించీ అచటి కేగవలెను ॥రాజ॥

అని తలచి శ్రీకృష్ణుడు వెంటనే -

గోపబాలకుల గోవుల దూడల రూపములను దాల్చి
వారి వారి ఇండ్లకు మామూలుగ వాసుదేవుదేగె
ఏ తీరున పిల్లలకు తల్లులు ప్రీతిగూర్చుతారో
ఆ తీరున బాలకులు తల్లులకు ప్రీతిగూర్చినారు ॥రాజ॥

ఇంతేగాక —

ఆవు లిండ్లకూ చేరి దూడలను అంభాయని పిలిచి
పంచిత్ల్లి దూడలను నాకుతూ పాల నొసగు చుండె ॥రాజ॥

ఈ విధంగా ఒక ఏడాది గడిచింది. ఒకనాడు బలరాముడు కృష్ణునితో అన్నాడు -

ఆవులు గోపాలకులు మహర్షుల అంశలనుచు వింటి
జగము సర్వమూ నీ యంశమనే సత్యమిపుడు గంటి
॥మురళీలోలా॥

అప్పుడు కృష్ణుడు ఇలా గన్నాడు —

అన్నా నీవూహించిన విషయం బంతయు నిజమేను
బ్రహ్మా చేసిన మోసాని కిదే ప్రతీకారమయ్యా

అని కృష్ణుడు చెప్పాడు -

సంవత్సర కాలము వరకిట్లే సాగిపోయెనండీ
పిమ్మట హిరణ్యగర్భుడు వచ్చీ విపినమందు చొచ్చీ
అచట తిరుగు గోవులను మేసెడీ యావుల చూచాడు
తను రహస్యముగ దాచినవన్నీ కనిపించుటచేత
ఇన్ని గోవులూ గోపాలకులూ ఎలా వచ్చినారో
ఆశ్చర్యముతో దీనికి కారణ మాలోచించాడు ॥రాజ॥

ఇలా ఆలోచించి -

చీకటి తొలగదె సూర్యకిరణముల తాకిడిచే ధరపై
అటులనె నారాయణుని శక్తి ముం దాగునె నా మాయ
మోహరహితుడై అన్ని లోకముల మోహపరచు హరిని
మోహింపించెద ననుకొని నేనే మోహము చెందాను

అని నిశ్చయించుకొని -

నీలమేఘముల మేలికాంతితో
హారకుండల కిరీట ఛవులతో
కనక కంకణ ప్రభలతోడనూ
కోటి సూర్యతేజముల వెలిగెడీ

గోపుల గోవుల నరవిందాక్షుని రూపముగా నెరిగి
నేలమీద గోపాలబాలు పాదాలపైన నొరిగి

ఇలా గన్నాడు బ్రహ్మదేవుడు -

మీ పదములు సేవించిన వారికి ఆపదలూ తొలగీ
ప్రాపించును సకలార్థములని మీ పాదాల్పట్టితినీ
శిష్టుల దుష్టుల రక్షణ శిక్షణ చేయువాడ వీవె
బ్రతుకు లొసగి ప్రాణులనన్నిటి కాపాడు తండ్రి వీవె
చుక్కల నాకాశమున పూర్తిగా లెక్కబెట్టవచ్చు
ధరణిమీదబడు మంచు బిందువుల తగ గణింపవచ్చు
సృష్టికి కారకుడను నేనే యను దృష్టిలోన పడితి
నానారూప ధరుండవు నీలో నలుసుపాటి గాను
నీ యనంత శక్తుల గణింపగా నెంతవాడ దేవా
ధర్మము తరిగి యధర్మము పెరిగే తరుణాలలో నీవు
సాధు రక్షణకు దుష్టశిక్షణకు జన్మలెత్తుతావు
నీదు మహిమ నేనిపుడు గంటినీ నీరజాక్ష కృష్ణా
సత్యరూపుడవు స్వయంజ్యోతివీ శాంతిమూర్తివయ్యా
భక్తరక్షణ ఆశ్రితవత్సల పరమేశా ఈశా
పరమ పురుషనను మన్నింపుమనీ ప్రార్థన చేశాడు ॥రాజ॥

తరువాత -

తను దాచిన గోపుల గోవుల ప్రత్యక్షము చేశాడు
కృష్ణ మాయచే కన్పడు వార లదృశ్యంబై నారు ॥రాజ॥

పిమ్మట -

చతురాననునీ శ్రీహరి నవ్వుతు సాగనంపినాడు
తన మిత్రులతో బృందావనముకు తరలిపోయినాడు ॥రాజ॥

ఇలా ఉండగా ఒకరోజు -

బలబల మని తెలవారుచుండ గోపాలుడు లేచాడు
బాలుర నావుల వేణువూదుచూ మేలుకొల్పినాడు ॥రాజ॥
చద్దిమూటలతొ పిల్లలు కృష్ణుని వద్దకు వచ్చారు
గోవుల పలుకులు విప్పి వాటికీ కుడితిపెట్టి వదిలి
ఆడుచు పాడుచు బాలురందరూ అడవి కేగినారు
ఆలమందలను చాలాదూరము తోలుకెళ్లినారు
పచ్చికబీళ్ళలొ మేతమేయుటకు పశువుల వదిలారు
పిల్లనగ్రోవిని ఊదుచు కృష్ణుడువెళ్ళె నడవిలోకి ॥రాజ॥

ఆ యడవి ఎలాగుందంటే -

ఎల్లకాలము పండ్లనొసగెడీ చల్లని వృక్షాలు
పూలవాసనల గుబాళించెడీ మేలిరకపు లతలూ
మకరందము త్రాగుటకు వచ్చెడీ మధుకర బృందాలు
జాతివైరమూ లేని పక్షులూ జంతు సమూహములు
కలిగియున్న ఆ వనమును చూచీ కమలలోచనుండు
బలరామునితో సరసాలాడుచు పలికినాడు రాజా ॥రాజ॥

ఏమన్నాడయ్యాంటే -

ఎదుటి లతలపై నీ కీర్తిని తుమ్మెదలు పాడుచుండె
నీ వస్త్రాలను చూచి మేఘుడని నెమలు లాడుచుండె
గోపికాంగనలవలె నిను జింకల గుంపు చూచుచుండె
మహితోక్తులవలె నీకై పికములు కుహూ కుహూ మనుచుండె

అంటూ -

సారసాక్షుడూ నదులన్ గిరులన్ సంచరించినాడు
కలహంసల గుంపులను గూడి క్రేంకారాల్ చేశాడు
వివిధ పక్షులా కూతలు కూస్తూ విపినమంత తిరిగి
గోవిందుడు చేరాడు మిత్రులను గోవుల మందలను ॥రా॥

అచటికి వచ్చి -

గౌతమి రావే-గంగా రావే
భారతి రావె-శుభాంగీ రావే
సురభి రావె-చింతామణి రావే
మహాలక్ష్మి మందాకిని యంటూ

పేరు పేరునా గోవుల నన్నిటి పిలిచినంతలోనె
రివ్వున గంతులు వేయుచు ఆవులు దువ్వుమనుచు చేరె

ఇంకా ఆ గొల్ల పిల్లవాండ్రు -

ఆట పాటలతో అలసిన వారికి ॥తంధానో తంధాన తంధాన
సేవలు చేస్తూ కొందరుండిరీ ”
చెమట పోవుటకు చిగురు కొమ్మలతో ”
విసురుతు కొందరు మసలు చుండిరీ ”

ఒకరి కాళ్ళ నింకొకరు పిసుకుతూ న్నా రొకచోట
॥తంధానతానా॥

ఒకరి తొడల పేరొకరు శిరము నిడి ॥తంధానో తంధాన తంధనా॥

నిదురపోవుతూ కొందరుండిరీ ”

చెట్ల నీడలకు చేరి హాయిగా ”

నడుము వాల్చుతూ కొందరుండిరీ ”

అన్యోన్యంగా బాలురు సేవల నందుకొనిరి రాజా ॥తంధానతానా॥

కొంత సమయం అలా గడిచింది. ఈ గోప బాలురలో శ్రీదాముడనే గొల్లపిల్లవాడు బలరామకృష్ణుల వద్దకు వచ్చి ఇలా గన్నాడు -

దూరముగ నల్లదిగో తాడుల తోపులు చూచారా

ఆకాశాన్ని తాటి చివరలూ అంటినటుల పెరిగె

పటపటమంటూ ధరపై తీయని పండ్లు రాలుచుండె

అటు వెళ్ళుటకే ఎంతవారయిన తటపట పడతారు ॥రాజ॥

ఎందుకయ్యాంటే -

ధేనుకాసురుండను రాక్షసుడీ కాననమున గలడు

ఖరాకారుడై మహాశూరుడై జ్ఞాతులతో గూడి

ఇచటికి వచ్చిన జనులను చంపుచు ఎంతో ముచ్చటగా

నరుల మాంసమును భక్షణచేస్తూ పరవశించుచుండు ॥రా

ఈ తాళవనంలో ఇంకా -

ఎన్నోరకముల ఫలాలిందులో నున్నవయ్య కృష్ణా

పండ్లరసాలను మన మందరమూ పానము చేద్దాము

కావున -

బలరామునితో గూడి నీవు ఈ వనమందున చొచ్చి
ఆ దనుజుని చంపినచో పండ్లను హాయిగ తినవచ్చు

అనగా విని నవ్వి బలరాముడు కృష్ణుడూ ముందుకి దూకినారు. వారి వెంట గోపబాలురునూ పరుగెత్తినారు -

బలరాముండా తాటిచెట్లనూ పట్టి ఊపినాడు
మత్తేభమువలె తాటిపండ్లనూ మహిపై రాల్చాడు
పళ్ళుపడిన చప్పుడు విని దనుజుని వళ్ళుమండిపోయె
ఆవేశముతో శత్రుని చంపుట కాత్రముతో వచ్చె
బలరామునిపై కెగిరి కాలితో బలముగ తన్నాడు
చుర చూస్తూ అసురుడు రాముని కరవ నోరు తెరచె ॥రాజ॥

అపుడు -

బలభద్రుడు కోపముతో గర్దభ పాదాలనుబట్టి
గిరగిర త్రిప్పి తాటిచెట్లకూ గిరాటు పెట్టాడు
ధేనుకాసురుడు లబో దిబోయని దేహం వదిలాడు
ఫెళఫెళమను చప్పుడుతో తాళము విరిగి నేలకూలె
ఒండొంటిని గుద్దుకొని తాటిచెట్లుమ్మడిగా కూలె
పెనుగాలికి పడినట్లు ధేనుకుని వనమే ధరనొరిగె ॥రాజ॥

తరువాత -

తమ నాయకుని మరణము చూచిన దైత్యులు రంకెలతో
బలకృష్ణుల చంపుటకు వచ్చి తమ ప్రాణాల్వదిలారు ॥రాజ॥
రాలిన పండ్లతో కూలిన చెట్లతో రాక్షస వనభూమి
నీలమేఘముల మాలల నిండిన నింగివోలె వెలిగె ॥రాజ॥

అపుడు సంతోషంతో -

తాటిపండ్లనూ గోపబాలురూ నోటినిండ నమిలి
గోవులతోటి ఇండ్లకేగిరీ గోపాలుని కృపతో ॥రాజ॥

తరువాత -

ఇంటికి వచ్చిన జంట కొడుకులకు
రోహిణీ యశోదలు తలలంటీ
సువాసనల ధూపాలను వేసీ
జుత్తు దువ్వి పూగుత్తులు ముడిచీ
రంగు రంగు దుస్తులతో వారిని సింగారించారు
ఆరు రసాలూ చేరిన అన్నము నారగింపజేసి
పరుపులు పరచీ రామకృష్ణులను పరుండబెట్టారు
ముద్దుముద్దుగా పాటల బాడుచు నిద్దుర బుచ్చారు ॥రాజ॥

ఇలా కొంతకాలము గడిచిన తరువాత —

బలరాము డొకనాడు బయలుదేరక ముందె
చెలికాండ్ర కృష్ణుడూ పిలిచాడయా
విందామయా మనము విందామయా
గోవిందు కథలనూ విందామయా
గోపాలకులు తాము గోవులను తోలుకొని
అడవిలో ఆవులను విడిచారయా ॥విందా॥
ఆవులూ మేసేటి అటవీ సమీపాన
పేరుగల కాళింది పారేనయా ”
కడు విసము గలిగిన మడుగు గల దందులో
కాళియను వ్యాళమట నుండేదయా ”

కాళీ భార్యల తోడ కాపురము చేయుచూ
బరితెగించీ బలిసి పోయిందయా ॥విందా॥
అది విడచు నిట్టూర్పు కామడుగు నీరంత
పొగలు సెగలతొ ఉడికిపోయేనయా ”
గగనాన ఎగిరెడీ ఖగము లాఘ్రాణించి
తూలుతూ చచ్చిపడు తుంటాయయా ”
ఏ జీవియైననూ ఆ జలము త్రాగితే
చచ్చిపోయేమాట సత్యంబయా ”
అది తెలిసి కృష్ణుడూ ఆ విసపు మడుగుకూ
ప్రక్కగల చెట్టుపై కెక్కాడయా ”
మడుగులో దూకుటకు నడుమ్మె బిగించాడు
జుట్టునూ గట్టిగా కట్టాడయా ”
మడుగులో దూకగా బుడగలూ లేచాయి
కల్లోలమై అలలు కదిలాయయా ”
కాళీయు డదిచూచి గట్టిగా బుసగొట్టి
కచ్చతో వేగముగ వచ్చాడయా ”
తన వాడి కోరలతొ మన బాలకృష్ణునీ
కసిదీర కాట్లేసి కరిచాడయా ”
గోపాలు దేహమును ఆ పాము చుట్టుకొని
గట్టిగా బిగియించి పట్టిందయా ”
అది చూచి గోపకులు అవులను వదిలేసి
చరచరా మడుగుకే ఉరికారయా ”
చుట్టూర అటచేరి గట్టుపై నిలుచుండి
పొట్ట లుబ్బేటట్లు ఏడ్చారయా ”

గజగజా వడకుతూ కన్నీరు కార్చుతూ
గుండెలను బాదుకొని కుమిలారయా ॥విందా॥

అపుడు -

ఉల్కాలే పడ్డాయి ఉర్వి కంపించింది
దుర్నిమిత్తా లెన్నో తోచాయయా ॥విందా॥

గొప్ప ఆపదలేవో ఇప్పుడే కలుగునని
పల్లె గొల్లలు భీతిపడ్డారయా ”

నంద యశోదలూ అందరిని కల్పుకొని
పరుగు పరుగున యమున కరిగారయా ”

కాళింది మడుగులో కాళియు బంధమున
పెనగులాడే కృష్ణు పిలిచారయా ”

చేయు కార్యము లేక మూయు రెప్పలు రాక
తోయజాక్షుని గాంచుతున్నారయా ”

అశ్రువులు గంగా స్రవంతివలె జారగా
కృష్ణునీ చూచి శోకించారయా ॥విందా॥

అప్పుడు యాదవులంతా ఇలా విలపించారు -

మా కృష్ణా నిను మాయదైవ మీ మాడ్కి చేయనేల
మమ్మా సర్పము కాటు వేయక నిన్ను పట్టనేల
కన్నా ! నిన్నాపాము చుట్టుకొన గాంచలేము తండ్రీ
వేణుగానమును మా కర్ణాలకు వినిపింపగలేవా
ఆనందముగా మా మనస్సులను అలరింపగ రావా
నీ దర్శనభాగ్యము లేకుండిన మాదు జన్మమేల
పూతన పాలలో విసము హరింపగ చేతనైన నీవు
కాళి కోరలలో విషము నార్పగ జాలమేమిటయ్యా

చిరునవ్వుల చిందింపుచు మమ్ముల మురిపించుము స్వామి
పులకరింప చేయుము మమ్మందరి పలకరించి చూచి ॥మురళీ॥

అని అందరూ దుఃఖిస్తూ ఉండగా —

గోపాలుడు సామాన్య నరునివలె కొంత తడవు గడిపి
ఒకేమారు తన తనువు పెంచుతూ ఉబ్బించాడండీ ॥రాజ॥

అపుడా సర్పము —

ముక్కు రంధ్రముల సెగలను పొగలను క్రక్కుచు పడగెత్తి
ఊపిరి నలుపక కటకట పడుతూ ఉండె విషపు పాము
ముప్పు వచ్చెనని తోకచుట్టలను విప్పుకొనుచునుండ
పడగమీద నరచేత చరిచెనూ గడుసరి కృష్ణుండూ ॥రాజ॥

ఆ పాము యొక్క —

రెండు దౌడలను చీల్చి విసము లేకుండ పిండినాడు
గండరగండడు దాని పడగపై తాండవమాడాడు ॥రాజ॥

పాట

ఆడినాడూ గోపాబాలుడూ - నాట్య
మాడినాడూ కృష్ణదేవుడూ
యమునా నదీతరంగముల ధ్వానమ్ములే
కమనీయమగు మృదంగాల నాదముచేయ ॥ఆడినాడూ॥
బృందావనమ్ములో విందు లందెడి యళుల
బృందగానము గాయకుల గానమై యొప్ప ”
కలహంస లొనరించు కిలకిలారవములే
క్రమము తప్పని తాళగతులు చూపెట్టగా ॥ఆడినాడు॥

గగన వీధిని నిల్చి గరుడ గంధర్వసుర
గణములే ప్రేక్షకుల కరణి వీక్షింపగా ॥ఆడినాడూ॥
పద్మరాగారుణ ప్రభల వెల్గొందెడీ
కాళీయు ఫణము రంగస్థలమ్ముగచేసి ”
పలు వాద్యములు కిన్నరులు చేయుచుండ సం
బరముతో దేవతలు విరుల కురిపింపగా ”
కనులనుండి విసముగ్రక్కి కాళీయుడూ
ఒక్కొక్క తలనుండి రక్తమాంసము లుమియ ”

అపుడు కాళీయుడు ఇలాగు అనుకున్నాడు -

ఔరా నా విషధూమము అమరులనైన బాధపరచు
ఈ బాలుడు భరియింపనోపెనే ఎంతో చిత్రముగా
బాలుడుగా డీతడు సాక్షాత్తుగ పరమపురుషుడేను
చక్రపాణియే ఇటుల వచ్చెనని శరణం అన్నాడు ॥రాజ॥

తరువాత - కాళీయుని భార్యలు శ్రీకృష్ణుని యిలా స్తుతించారు -

క్రూరాత్మల దండింపగ నీవీ ధారుణి పుట్టావు ॥మురళీ॥
కాళీయుని గర్వమును బాపుటొక కార్యమగునె కృష్ణా ”
ఎంతోకాలము తపము చేసి నిన్నెరుగగ చూచువారు ”
నీ పాదాలను తమ శిఖరాలపై నిలుపజాలరయ్యా ”
పూర్వజన్మమున మాపతి యెంతో పుణ్యము చేశాడు ”
అందువలననే అతని పడగపై చిందులు త్రొక్కితివి ”

నీ పాదరజం సోకినవారూ
బ్రహ్మపదాన్ని కోరబోరయా
ఇంద్ర పదవి నాశింపబోరయా
రాజ్యసుఖము కాంక్షింపబోరయా
తిరిగి జన్మమును పొంద గోర రే నరులైనను స్వామీ
॥మురళీ లోలా॥

నిర్వికారుడవు భూతమయుడవూ నిర్గుణుడవు దేవా ”
విద్యా విద్యల హేతుభూతుడవు విశ్వమయుడవయ్యా ”
కాలరూపుడవు విశ్వమెల్ల నీ లీల గాదె కృష్ణా ”
జ్యోతిర్మయ నీ పావాహతిచే మా పతి స్రుక్కాడు ”
మాపయి దయతో పతిని భిక్షగా మాకు పెట్టుమయ్యా ”
చిన్నవయసులో జరిగిన పెండ్లీ పెండ్లికాదు తండ్రీ ”
నీ కరములతో జరిపింపుమయా మా కల్యాణమును ”
సర్వలోకముల జనకుడవగు నీ సంతానము మేము ”
పితలు ప్రేమతో మన్నించెదరూ సుతుల నేరములను ”
నేటి నుండి మానాథు డెవ్వరిని కాటువేయబోడు ”
మీపయి ఒట్టునుబెట్టి వేడెదము కాపాడవె కృష్ణా ॥మురళీలోలా॥

ఈ విధంగా నాగకాంతలు ప్రార్థిస్తూంటే శ్రీకృష్ణుడు తన పాదములను కాళీయుని పడగలకు దూరంగా ఉంచాడు. అపుడా కాళీయుడు -

చదిసిన నలిగిన తలలను మొత్తము చక్క పరచుకొనుచు
ప్రాణేంద్రియా సుల యథాతథంగా బడసి యిట్టులనియె ॥రాజ

స్వామీ -

వంకర టింకర నడకలతోటీ వర్తించెడి మాకు ॥మురళీ॥
అహంకారమూ రోషం గర్వం అతిసహజము స్వామీ "
నోరు విప్పితే విషాగ్ని చిందీ దూరముగా పడును "
వారు వీరనక జీవకోటినీ ఘోరముగా చంపు "
పుట్టుకతోటీ వచ్చిన గుణము బుపోవు గిట్టువరకు "
నైజగుణాలను మానవేరయా నన్ను బోలువారు "
పాపజాతిలో పుట్టిన నాపై నీ పదములు మోపి "
పాదధూళి నా తలపై చల్లీ పవిత్ర పరిచావు "
వేదవేద్య నీ దయ గలిగినచో విడువుమయ్య నన్నా "
కాదంటే నను చంపుము నీదే కడపటి నిర్ణయము "

అని ప్రార్థింపగా శ్రీకృష్ణుడు కరుణతో నిండిన చూపుతో ఇలా గన్నాడు —

కాళీయా మానవులు గోపులీ కాననమున డస్సి
దాహశాంతికై ఈ మడుగునకూ తరచుగ వస్తారు
మడుగు నిప్పుడే వదలి చుట్టములు పడతులు పుత్రకులూ
ఉరగాలన్నీ గూడి మీరు సాగరము చేరవలయు
విను శాసించిన యీ కథనంతా మనమున చింతించీ
రేపు మాపు కీర్తించిన వారికి పాప భయము లేదు
నేను చరించిన యమునానదిలో స్నానమాడువారు
దీక్షబూని ఉపవాసముండి ప్రార్థించుచుండువారు
తర్పణాలు దేవతల కిందులో నర్పించెడివారు
అన్ని పాపములనుండి విడువబడి నన్ను చేరుతారు

॥వినరా భాగ॥

ఇంకను పూర్వం -

గరుత్మంతుడూ కబళిస్తాడను వెరపున మీరంతా
రమణక ద్వీపం విడిచి వచ్చి ఈ యమునలో దాగారు
॥వినరా॥

ఇటు తరువాత —

ఆ త్రుడ నీ తలపయి, నా పదముల గు ర్తులుండు గనుక
పక్షిరాజు ఇకమీద మిమ్ములనుపట్టి చంపబోడు
అని ఇట్టుల గోపాలకృష్ణుడూ ఆనతిచ్చినంత
ఉరగరాజు తన వారితోడ సాగరము చేరినాడు ॥రాజ॥

అప్పుడు పరీక్షిత్తు శుకయోగీంద్రుని అడిగాడు -

విషపు పాములుండేటి ద్వీపమును విడిచి చుట్టములతో
కాళీయుండీ మడుగు చొచ్చుటకు కారణమును చెపుడీ
॥మౌనిచంద్ర॥

అపుడు శ్రీ శుకుల వారు ఇలా చెప్పారు పూర్వకాలంలో -

పాములతో భయపడిన మానవులు పాదపములవద్ద
పుట్టలలో ఆహార పదార్థాల్ పెట్టుచుండువారు
అందలి భాగము పాములు గరుడున కర్పించుటవలన
గరుడభీతినీ వదలి కాలమును గడుపుచుండె ఫణులు ॥రాజ॥

ఇలా ఉంటూండగా ఈ కాళీయుడు మదాంధుడై గరుత్మంతుడు తినవలసిన పదార్థాలను తానే తినేవాడు —

కాళీయుడు తన భక్ష్యభాగమును కాజేశాడంటూ
వినిన గరుడుడూ ఆవేశంతో విరుచుకపడ్డాడు ॥రాజ రాజ॥

ఎలా వచ్చాడంటే —

ప్రళయకాల ఝంఝూనిలమ్మువలె పక్షములను విప్పి
గగనము నుండీ రివ్వున వాలే గరుత్మంతుఁ జూచి
పన్నగేంద్రుడు రోషంతోటీ పడగలు విప్పాడు
విషాగ్ని కణములు కన్నులనుండీ వెడలి మండుచుండ
ఎత్తుగ లేచీ బుసలు కొట్టుతూ ఎంతో గాటముగా
గరుత్మంతునీ మీదికి దూకీ కాటు వేసినాడు ॥రాజ రాజ॥

వెంటనే -

కాటువేసిన కాళీయుణ్ణీ గరుడుడు కోపముతో
విలవిల లాడేటటుల రెక్కతో విసిరికొట్టినాడు ॥రాజ రాజ॥

ఆ దెబ్బకు -

పడగలు నలిగీ కోరలు విరిగీ ప్రాణమన్నుబట్టి
గడగడ వడకుచు కాళి యీ యమున మడుగున దూరాడు ॥రాజరాజ॥

వంతవాడు :- కాళీయుడు ప్రత్యేకంగా యీ మడుగుతోనే దూరడానికి కారణం ?

కథకుడు :— చెప్పుతాను విను. పూర్వం —

సౌభరియను ముని ఈ మడుగునకూ సమీపమ్ము లోన
దివారాత్రములు తపస్సు చేస్తూ దీక్షబూని యుండె ॥రాజ రాజ॥

ఇలా ఉండగా —

ఒక్కనాడు ఆకలితో గరుడుడు ఇక్కడి కేతెంచి
మడుగునగల జలచరములపట్టీ పొడిచి తినుచునుండ

మిగిలిన చేపలు తోటివాటికై వగచుచుంట చూచి
ముని శోకిస్తూ కోపంతోటీ అనినా డిట్టులను ॥రాజరాజ॥

ఏమన్నాడంటే ఆ మహర్షి —

మీనములను ఈ మడుగున గరుడుడు మ్రింగజూచెనేని
చచ్చుగాకయని ఉగ్రశాపమును ఇచ్చెను మునివరుడు
కాళీయున కొక్కనికి మాత్రమీకథ తెలియును గాన
మడుగుజేరి నిర్భయముగ కాలము గడుపుచుండె రాజా! ॥రాజరాజ॥

ఈ కారణమున కాళీయుడీ మడుగులో కాపురం పెట్టాడు. గోవులనూ మనుష్యులనూ రక్షించడానికి కృష్ణుడతనిని బయటికి వెళ్ళగొట్టాడు, తరువాత కథ ఏమిటంటే-

మడుగునుండి క్షేమంగా వచ్చిన మాధవునీ చూచి
ఆనందంతో గోపగోపికలు అతని చుట్టినారు
పోయిన ప్రాణం తిరిగివచ్చి నటులే యశోద తలచె
బాలకృష్ణునీ కౌగలించి ఆప్యాయతతో దువ్వి
ముద్దులాడుతూ తలను నిముదుతూ మురిసిపోయెనండీ
ఆ రాత్రిని అచ్చటనే గడపగ అందరు తలిచారు ॥రాజ॥

అపుడు యాదవులంతా -

కాలక్షేపము చేసిరి వారు కాళిందీదరిన
సరసాలాడుచు గాఢనిద్రలో పరవశించినారు ॥రాజ॥

యింతలో -

అడవిలోన దావాగ్ని పుట్టినది
అన్ని దిక్కులకు అంటుకున్నదీ

చక్రములాగా చుట్టు తిరిగినది
మంటలు భుగభుగ మింటి కెగిసినవి
కాలిన చెట్లూ వరుసల కొద్దీ కూలుచుండెనండీ
ఆ పాదపములు కాలునవ్వుడికి గోపాలురు లేచీ
కలవరపడుతూ భయకంపితులై విలపించారండీ
కృష్ణుని కాపాడమని వేడుతూ కేకలు వేశారు ॥రాజ॥

అపుడు -

చిరునవ్వును చిందిస్తూ కృష్ణుండరిగె మంటలో!
నోరుతెరచి దావానలాన్ని కడుపార మ్రింగినాడు ॥రాజ॥

అది చూచి —

గోపులు గోపీజనము గుంపుగా గోవిందుని చేరి
పరమానందము తోటి వారు చప్పట్లు కొట్టినారు ॥రాజ॥

ఇంతలో -

శీతాకాలము వెనుకబడ్డదీ
చలి చలిగాలులు సెలవు గొన్నవీ
పగటి ప్రొద్దులూ బలిసిపోయినవి
రాత్రికాలమూ తరిగిపోయినది
చెరువులలో నీరింకి ఎండుతూ పనియలుబడ్డాయి ॥రాజ॥

క్రమక్రమంగా తరువాత -

చేటల నిప్పులు చెరగినట్లుగా
కొరపులు గిరగిర త్రిప్పినట్లుగా
వడగాడుపులూ మంటలు విసిరెను
ఎండనూవులా జిగజిగ మెరసెను

ప్రళయరుద్రుని తీవ్రరూపముగ ప్రకాశించెనినుడు
॥గోపాలబాలా॥

కాని -

బృందావనమే రామకృష్ణులకు మందిరమగుకతన
వేసవికాలపు లక్షణాలు కాన్పించలేదు అచట
సెలయేరుల కెరటాల జల్లులతో మలయ వాయువులతో
పూలవాసనల తేలియాడెడీ భృంగమాలికలతో
పికముల పాటలు నెమలుల ఆటలు శుకముల పలుకులతో
బృందావనమూ సందడించె నానంద కందమగుచు ॥రాజ॥

ఇట్లుండగా ఒకరోజున —

విహారార్థమై యమున ఒడ్డుకూ వెళ్ళిరి యాదవులూ
బలరాముడు శ్రీకృష్ణుడు తమ గోవులను తోలుకొనుచు
ఆ వనమందున వేణువూదుచూ ఆడుచు పాడుచును
కాలిగజ్జియలు గలగల మ్రోయగ గంతులు వేశారు ॥రాజ॥

ఆ సమయంలో, ప్రలంబాసురుడనే ఒక రాక్షసుడు గోపాలక వేషంతో వారితో గూడి ఆడుకుంటూ ఉన్నాడు.

గోవిందుడది చూచి బాలకుల గుంపుగ కూర్చాడు
రెండు వర్గములుగా విభజించెను చెండులాటలాడ
చక్రి రాక్షసుని గాంచి అన్నకూ సైగచేసినాడు
బంతులాట నా బృందావనమున ప్రారంభించారు
ఆటకు ముందుగ నిర్ణయించుకున్నట్లుగానె వారు
ఓడిన వారల వీపుపైన నింకొకరు ఎక్కినారు
ప్రలంబాసురుని వీపుమీదటా బలరాముడు ఎక్కి
పర్వతమ్ముతో సమానముగ తన బరువును పెంచాడు ॥రాజ॥

ఆ ప్రలంబాసురుడు బలరాముణ్ణి ఆకాశానికి ఎత్తుకో పోతూండగా ఆ సంగతి తెలిసికొని బలరాముడు అతణ్ణి తన పిడికిలితో ఒక పోటు పొడిచాడు -

ఆ దెబ్బకు నా ప్రలంబాసురుడు ఆకాశము నుండి
పడిపోతూ గోపాలక రూపం వదలివేసినాడు ||రాజ||

ఇంద్రుని వజ్రాయుధపు దెబ్బకు పడిపోయిన పర్వతం వలె బలరాముని పోటుకు ఆ రాక్షసుడు రక్తంకక్కి చచ్చి పోయాడు -

పడిన ప్రలంబాసురుని చావుగని బ్రతికితి మనుకొనుచు
కుసుమ వర్షమును దేవతలంతా కురిపించారండీ ||రాజ||

ఆ గోపాలకులు ఆటలాడుకుంటూండగా గోవులు హాయిగా పచ్చిక మేస్తున్నాయి ఆ సమయాన -

ఆ వనమున దావానల మేర్పడి
చుట్టుపట్టులా ముట్టి మండగా
దానికి తోడుగ వాయువు చేరగ
మంటలు భగభగ మింటికెగసెనూ

ఆవులు భయపడి మోరలెత్తుచూ అంభాయని యరచె
అగ్నికణాలను చిమ్మిపెచ్చరిలు ఆ చిచ్చును చూచి
గొల్లపిల్లలూ ధైర్యం చెదిరీ గుండెలు బాదుకొని
రామకృష్ణులను ప్రార్థించారు రక్షించుట కొరకు ||రాజ||

అప్పుడు —

పల్లవుల ప్రార్థనలకు కృష్ణుడు ప్రసన్నుడై పలికె
మీ మీ కన్నుల నొకపరి మూయుడు మ్రింగెద నీమంట
॥వినరా॥

అనగానే —

గోపాలురు తమ కన్నులు మూయగ గోవిందుండపుడు
దావాగ్నిని క్షణకాలములోననె త్రాగి మింగినాడు ॥రాజ॥

గోపాలకులు శ్రీకృష్ణుని అమోఘశక్తికి ఆశ్చర్యపడుతూ, సాయంత్రానికి సురక్షితంగా తమ తమ నివాసాలకు చేరుకున్నారు.

తూరుపు గాలులు బయలుదేరి ఎంతో బలముగ వీచె
ఇంద్రచాపమూ పడమటి దిక్కున నేర్పడె చిత్రముగా
దక్షిణ దిక్కుకు మబ్బుల వరుసలు తరలిపోవుచుండె
ఉత్తరదిశలో తళతళ మెరయుచు ఉరిమె మేఘమాల
పుచ్చుకున్న నీరమును మేఘుడూ ఇచ్చుచుండె తిరిగి
కారుచిచ్చులకు పూర్వపు బలము గర్వమణగిపోయె
వర్షాకాలము ముదము గూర్చెనూ కర్షక జనముసకు
ధరనుమున్ని కర్షకులు మంచి వి త్తనములు వేశారు ॥రాజ॥

శ్రీకృష్ణుడు తన తోటి పిల్లలతో గోవులను మేపుకుంటూ ఆ వర్షాకాలాన్ని సుఖంగా గడుపు కుంటున్నారు.

తరువాత —

ఉరుములు మెరుపులు తరిగిపోయెనూ బురద లింకిపోయె
వెనుకల కేకలుతగ్గి వాహినులు నిలిచి పారుచుండె

విజయ యాత్రలను చేయ రాజులు వెడలిరి బలములతో
స్వాగతమంటూ పూజాఘంటలు మ్రోగె దేవళముల
రతిపతి యువతీ యువకుల కోర్కెల మితిదప్పగచేసె
కన్నుల పంటగ రెల్లుపూతవలె వెన్నెల కమ్ముకొనె
శరత్కాల సౌందర్యమందరను పరవశింపచేసె ॥రాజ॥

అప్పుడు శ్రీకృష్ణుడు -

నెమలిపింఛ కాంతులు నలుదిక్కుల నీలిరంగు పులుమ
తులసీమాలల గంధము నాసికములకు విందు సేయ
పురుషోత్తముడగు కృష్ణుడు కరమున మురళి పట్టినాడు
గానము చేయుట కారంభించెను వీనుల విందుగను
ఆ గానము మల్లెల వాసనతో సాగి సాగిపోయి
బృందావనమున గోపకాంతల డెందాలను దోచె ॥రాజ॥

అపుడు తమ యిండ్లలో నిలువలేక గోపికలందరూ కృష్ణుని సమీపించి -

బాలకృష్ణునిమీద మనసునూ బాగుగ నిలిపారు
ఆనందముతో తన్మయులై మాట్లాడుకొనిరి తమలో ॥రాజ॥

ఆ గోపికలు ఏమని మాట్లాడుకున్నారంటే -

చెలియా మనమీ బలరాముణ్ణీ శ్రీకృష్ణుని చూడ
పూర్వజన్మమున ఎంతటి పూజలు పుణ్యము చేశామో
వేణుగానమును వినుటచేత మన వీనులు ఫలమందె
కమలాక్షుని గాంచుట చేతను మన కనుల పండువాయె

॥విన్నరా॥

మనకేగాక -

ప్రకృతి కృష్ణుని వేణుగానమున పరవశించిపోయె
మధుర మధుర నాదముల బల్కి మన మనసుల నాకట్టె
విమానాలలో వెళ్ళే సురలూ వినుచున్నారీ నాదం
పాలు త్రాగుటను మాని దూడ లీపాటల వినుచుండె
॥వినరా॥

ఇలా గోపికలంతా గోపాలుని వేణుగానం వింటూ ఆయన లీలావిలాసాలు దర్శిస్తూ మిగతా లోకాన్ని మరిచిపోయారు, ఇలాగుండగా -

కాలచక్రమూ కదలి జరిగినది
ప్రకృతి కావ్యమున కమ్మ తిరిగినది
క్రమముగ సూర్యుని వేడి తరిగినది
రాత్రికాలమూ పెచ్చు పెరిగినది ॥రాజ॥

హేమంతారంభము గృహిణులకూ ఎంతో సుఖమాయె
పగటి అలుకతో బయటి కేగిన భర్త ప్రొద్దుగూక
చలికి గడగడా వణకుచు భార్యను కలియజేరుచుండె
పడమటికొండకు పరుగులు పెడుతూ భానుడేగుచుండె ॥రాజ॥

మార్గశిరమాసం ప్రవేశించిన తరువాత మొదటిరోజున -

గోపికలూ కాళిందీనదికి గుంపుగ వెళ్ళారు
తెల్లవారుటకు ముందే స్నానము నెల్లరు చేశారు
కాళిందీ నదియొడ్డున ఇసుకన గౌరిని నిలిపారు
పూవులతో ఆ కాత్యాయనినీ పూజించారండీ ॥రాజ॥

ఆ గోపబాలికలు ఉమాదేవికి మ్రొక్కి -

మా కందరకూ కృష్ణుని పతిగా చేకూర్చుమటంచు
పదే పదే గౌరిని ప్రార్థించిరి భక్తితోడ వారు ॥రాజ॥

ఈ విధంగా ఒక్కనెల దీక్షతో గడిపి చివరిరోజున -

ఆ నదియొడ్డున జనసంచారము లేనిచోటు చూచి
అచట చీరలను విడిచి స్నానముల నాచరించుచుండ ॥రాజ॥

అపుడు శ్రీకృష్ణుడు -

తోటి బాలురను గుబురు పొదలలో చాటుగ దాచాడు
పిల్లి యడుగులను వేయుచు నచటికి మెల్లగ చేరాడు
గట్టున కన్యలు విడిచిన చీరెలచుట్టి చంకబెట్టి
దగ్గరగల ఒక చెట్టుమీదికీ దిగ్గున యెక్కాడు
చెట్టుమీదికీ చీరలు మొత్తం చేరవేసినాడు
కొమ్మమీద చిరునవ్వులు నవ్వుతు కూర్చున్నాడండీ ॥రాజ॥

కొంతసేపటికి స్నానాలు ముగించి వెనుకకు తిరిగి చూచే వరకు -

చెట్టుకొమ్మలకు గోపకాంతల చీరలు తగిలించి
చిన్నికృష్ణుడున్నాడని చూచి సిగ్గున తలవంచి ॥రాజ॥

ఆ గోపికలు ఇలాగన్నారు -

మా వస్త్రాలను ఎత్తుకపోవుట మర్యాదా ? కృష్ణా !
మా కవమానము కలిగించక మము మన్నించుము కృష్ణా !
వావి వరుసలూ వదలి ఇలాగా వర్తింపగ తగునా?
అందరి మనసుల నింతకుముందే హరించితివిగాదా
చీరలు గూడా హరించి మమ్ముల చిక్కులు పెడతావా
చీర తీయకుండినచో రాజుకు చెప్పుతాము మేము
॥మురళీలోలా॥

అని గోపికలు అంటూండగా కృష్ణుడు నవ్వి -

దాచవిడ్డలతో ఆడువారు మాట్లాడుట ఇటులేనా?
వలువలు కావాలంటే మీరూ వరుసగ నిటకొచ్చి
చెట్టుదగ్గరా నిలబడి అడిగిన చీరల నిస్తాను
అనగా విని ఆ గోపికలంతా అడుగు ముందుకేసి
కుత్తుకబంటి నీటిలో నిలిచి కురులు జారవిడిచి
సిగ్గుతో నొడలు చేతులగప్పి శ్రీకృష్ణుని చూచి ॥మురళీలోలా॥

ఇలా గన్నారు -

లోకంలోగల మర్మాలన్నీ నీకు దెలియునయ్యా
ధర్మపరుడవని యెల్లరు నిన్నూ తగ వర్ణిస్తారు
మా వస్త్రాలను ఎత్తుకపోవుట మంచిది కాదయ్యా
మగువలు స్నానాల్ చేసే చోటికి మగవా రొస్తారా ?
ఎచ్చటనైనా ఇట్టి యాగడా లెందు చూడలేదూ
మేమందరమూ నీ యనుజ్ఞతో మెలగుతు ఉంటాము
ఎచటికి రమ్మని యంటే అచటికి వెంటనె వస్తాము
ఎందు దూకమని సెలవిస్తే మేమందె దూకుతాము
దేనిచేయుమని ఆజ్ఞాపిస్తే దానిని చేస్తాము
మా మాటలనూ నమ్మి వలువలను మాకిమ్మా కృష్ణా !

॥మురళీలోలా॥

అని గోపికలు వేడుకున్నారు. అప్పుడు కృష్ణుడు -

భర్తగా నెవనికోరి ఈ వ్రతము ప్రారంభించారో
ఎవరిని మీరూ ప్రేమించారో ఎరిగించుడి నాకు

సిగ్గుపడక మీ మనసులోనిదీ చెప్పినచో నేను
మీ వస్త్రిలను మీ కిచ్చెదను మీరు కోరినట్లు ॥వినరా॥

అలా కృష్ణుడు నవ్వుతూ మాట్లాడుతుంటే గోపికలు —

రెండు చేతులన్ మర్మాల్ కనబడకుండ కప్పికొనుచు
చెట్టుక్రిందకూ గోపిక లందరు చేరిరి నగ్నముగా ॥రాజ॥
రెప్పవాల్పక కృష్ణుని చూచె అప్పడతులనెల్ల
గోపాలుడు క్రీగంట చూచుచూ ఈ పగిదిని పలికె ॥రాజ॥

ఏమన్నాడంటే -

ఈ భువనంలో నాకు తెలియనివి ఏవిలేవు నిజము
నన్ను మనసులో నిల్పివేసిన పున్నెము ఫలమిచ్చు
సర్వమంగళ అనుగ్రహముచే సర్వము శుభమగును
అనుచు కృష్ణుడూ వారి చీరలను అన్నిటి నిచ్చాడు ॥రాజ॥

అచటినుండి నెమ్మదిగా బృందావనం దాటి పశువులను తోలుకుంటూ ఎండ తగులకుండా నడుస్తూ గోపాలురు యమునలో దిగి చల్లని నీరు త్రాగి ఆవులను నీరు త్రావించి మేతకు వదిలినారు. కృష్ణునితో మిగతా బాలురు తమకు ఆకలి యగుచున్నదని చెప్పగా బలరాముడన్నాడు -

వనమధ్యములో విప్రులు యాగమ్మును చేస్తున్నారు
అచటికేగి మా పేర్లు చెప్పితే అన్నము పెడతారు

అనగానే —

వారు వెడలి యజ్వులగు విప్రులకు వందనములు చేసి

బలభద్రుడు కృష్ణుడును మమ్ములను పంపినారు స్వామీ
॥రాజ॥

ఎందుకనగా —

ఆవులు మేపుతు గోపాలకులూ అలసిపోయినారు
అన్నము పెట్టుడి శ్రాంతులకని మిమ్మడుగ బంచినారు ॥రాజ॥

రామకృష్ణుల మాటలను ఆ బ్రాహ్మణులు లెక్కచేయనందున గోపాలకులు తిరిగి వచ్చి చెప్పగా —

అది విని కృష్ణుడు నవ్వి వారితో ననెను మిత్రులారా
బ్రాహ్మణపత్నుల నిటులె యడుగుడని పంపె మరలనటకు
॥రాజ॥

అప్పుడు గోపాలకులు —

తిరిగి కృష్ణుని యానతితో వారరిగినారు అటకు
విప్రకాంతలకు కృష్ణుని మాటలు వివరించారండీ
గోపాలుని ఆకలి బాధను విని ఆ పడతులు లేచి
తాము వండిన పదార్థాల నత్తరి చేబుచ్చుకొని
మగలు వద్దనీ అడ్డుకున్ననూ మగువలు వినకుండా
పరుగు పరుగునా కృష్ణుని వద్దకు అరిగినారు వారు
యమునానది ఒడ్డున చెట్ల సమీపమునన్నవాని
మహిత పర్ణముల పల్లవ సుమదామముల నొప్పువాని
పసిడి వన్నెగల పటమును గట్టి పరగుచున్నవాని
కని రవనీసురకాంతలు కన్నుల కరవు తీరునట్లు ॥రాజ॥

శ్రీకృష్ణుడు చిరునవ్వుతో వారి యోగక్షేమాలు విచారించి మీ మీ జన్మలు చరితార్థమైనాయి — మీరు వెళ్ళి యజ్ఞం పూర్తి చేయించండి. అనగా ఆ గృహిణులు కృష్ణా!

మా వారందరు వెళ్ళవద్దనిన మానకుండ మేము
నీ కోసము వచ్చితిమి వెళ్ళమన నీకు తగునటయ్యా !
తిరిగి మేము వెళ్ళిన మా భర్తలు తిట్టి పంపుతారు
నీ సేవల మా కొసగి ఇచటనే నిలువనీయుమయ్యా

॥మురళీలోలా॥

అపుడు శ్రీకష్ణుడు ఆ బ్రాహ్మణ స్త్రీలతో యిలా గన్నాడు -

ఇచ్చటి కేతెంచిన మిము వారూ ఏమియనరుపుమ్మా
అసురులు గూడా యిది విని యెంతో ఆనందిస్తారు
ఐహికవాంఛలతోడ గొల్తురు అజ్ఞానులు నన్ను
మనసుల నాపయినిల్పి మరలూ మరుగ చేసినారు ॥రాజ॥

కావున —

ఆనందంబౌ శాశ్వత మోక్షము నందింతును మీకు
అనుచు వారు తెచ్చిన భక్ష్యములు నారగించినాడు ॥రాజ॥

తృప్తిగా బాలురు గూడా భుజించారు. వారికి సెలవిచ్చాడు కృష్ణుడు ఆ స్త్రీలు -

తిరిగి వచ్చి భర్తలతో చెప్పిరి జరిగిన విధమంతా
విన్నతోడనే బ్రాహ్మణులంతా విస్తుపోయినారు

వారేమన్నారంటే -

సకలలోక హృదయాల వసించే జనార్దనుని గాంచి
మీరు తిరించితి రకటా ఎంతో మేలుగలిగె మీకు
జపములు తపములు హోమాలెన్నో సలిపినాము మేము

అన్నీ తెలిసిన మేమే చీకటి యెడవిన పడ్డాము
కాంతలపాటి బుద్ధిలేకనే గాంచమైతిమతని
దేశకాలములు మంత్రతంత్రములు దేవతలా హరియే
ఆ మాధవునీ దర్శనమ్ము మా కబ్బకపోయిందీ
కంసభూపతికి భయపడి కృష్ణుని గాంచక పోయాము

॥మురళీలోలా॥

అని ఆ విప్రులు తమ తమ మనసులలో శ్రీకృష్ణుని స్మరించి ప్రార్థించారు. యిలా రోజులు గడుస్తున్నాయి. ఒకరోజు నందుడు తన వారిని వెంటబెట్టుకొని కృష్ణుని వద్దకు వచ్చి నాకు ఇంద్రయాగం చేయాలని ఉన్నది అన్నాడు, అపుడు కృష్ణుడు ఏమన్నాడంటే -

ఈ యాగానికి అధిపతి యెవ్వడు? ఏమి దీనిఫలము
శాస్త్రీయంబా? ఆగమోక్తమా? జనాచారమగునా ?

అని అడిగిన కృష్ణునితో నందుడిలా గన్నాడు -

ప్రజలు క్షేమముగ బ్రతకాలంటే పంటలు పండాలి
పంటలు పండాలంటే అదనున వానలు కురవాలి
మేఘాలకు విభుడైన ఇంద్రుడు మెచ్చుకొనుట కొరకు
ఇంద్రయాగమును చేయుచుందురీ యిలపై నృపులంతా

॥మురళీలోలా॥

కాబట్టి -

మఖము నొనర్చిన సహస్రాక్షుడు మదిలో ముదమందు
వజ్రి సంతసము నందిన చక్కని వానలు పడతాయి
వానకురిస్తే పచ్చిక అంతట బాగ లభిస్తుందీ

పచ్చిమేత మేసినచో ఆవులు బాగుగ పాలిచ్చు
పాడిపంటలూ నిండుగ ఉంటే ప్రజలకు సుఖమబ్బు
పురుహూతుడు కోపించిన పుడమిని కరవు తాండవించు
॥మురళీలోలా॥

అనగా కృష్ణుడు నందునితో ఇలాగన్నాడు- నాన్నా!

పుట్టుక చావుల మూలకారణము పూర్వకర్మమగును
కర్మయె సుఖదుఃఖాలను పొందగ కారణమై యొప్పు
కర్మముచేతనె వృద్ధిక్షయములు కలుగుచుండునయ్యా
కర్మచేత ఈశ్వరుడు ఫలమునూ కలిగించును తండ్రీ
ఇంద్రయాగమును చేస్తే మనకూ ఏమి ఫలములేదు
కొండల మధ్యన అడవులలోన ఉండు యాదవులకు
ఇంద్రుని వలనను భయపడవలసిన దేమిలేదు తండ్రీ ॥వినరా॥

అంతగా ఏదో ఒక క్రతువు చేయాలనుకుంటే-

పర్వతాలకూ పూజలుచేస్తే పచ్చిక నిస్తాయి
ద్విజులకు మ్రొక్కిన క్షేమం కోరుతు దీవన లిస్తారు ॥వినరా॥

కాబట్టి -

ఇంద్రయాగముకు తెచ్చిన వస్తువు లెల్లనిచట పెట్టి
కొండకునూ విప్రులకు అర్చనలు మెండుగ చేయండీ
వండించండీ పాయసాలనూ పిండి వంటకములు
అన్ని వర్ణముల వారికి తృప్తిగ అన్నము పెట్టండీ
బండుగ అందరు మెచ్చునట్లుగా విందులు చేయండీ
ఆనందంతో గోవుల ద్విజులకు దానం చేయండీ

పశువుల డొక్కలు నిండదండిగా పచ్చిక మేపండీ
జన్మలకు చరితార్ధమిదేనని శౌరి పలికినాడు ॥రాజ॥

కృష్ణుని మాటలు వినగానే వారందరూ రుచికరములైన పిండివంటలు సిద్ధంచేసి వేదవేత్తలగు బ్రాహ్మణులకు భూరి దక్షిణలతో గోదానాలు చేసి హాయిగా అందరూ వండిన పదార్థాలు ఆరగించారు -

గిరిరూపము శ్రీహరి ధరించె నత్తరి విచిత్రముగను
నందాదులు బందుగుల తోడుతా అందరటకు వచ్చి
పర్వతానికీ నమస్కరించీ ప్రదక్షిణము చేసి
నగముకు అర్చనచేసి పదార్థాల్ నైవేద్యము పెట్టి
స్వయముగ గిరియే తినుట చూచి కడు సంతోషించారు
గోవిందుడు ఆ కొండను గూర్చి గొప్పలు చెప్పాడు ॥రాజ॥

తరువాత —

ఎడ్లబండ్లపై స్త్రీలూ పురుషులు ఎక్కి వేగముగనూ
తమ తమ యిండ్లకు క్షేమంగాను తరలి వెళ్ళినారు ॥రాజ॥

ఇదంతా గమనించి ఇంద్రుడు ఏమనుకున్నాడంటే-

నన్ను కాదనీ గిరి నర్చించిరి నందుని అనుచరులు
సంసారోదధిదాట కర్మలే సరియనుకున్నారు
ప్రతివత్సరమూ చేసే యాగ వ్రతము మానినారు
కృష్ణుని మాటలునమ్మి వీరలీ గిరికి మ్రొక్కినారు
కనులుగానక యోచనలేక గర్వించిరి వీరు
దీని ఫలితమును వీరికిప్పుడే తెలియపరతుననుచు ॥రాజ॥

తనలో నిశ్చయించుకొని ఇంద్రుడు నవమేఘాలను వెంటనే పిలిచి —

మేఘములారా గోకులానికీ మీరలేగవలయు
ఉరుము లురుముతూ పిడుగుల కురియుచు మెరపులు మెరయుచును
గుండ్లవంటి వడగండ్ల నచ్చట గుట్టలు పడరాల్చి
కుండపోతగా గాలివానలు కురియుడి యేకముగా ॥వినరా॥

అని నవమేఘాలను ఆదేశించి హుంకరించాడు. వెంటనే -

నిర్మలమైనా నింగి యంతటా
కారుమేఘములు కమ్ముకున్నవీ
తళతళమంటూ మెరపులు మెరసెను
గుడగుడ ఫెళఫెళ ఉరుము లురిమెను
వాన చినుకులను మించి రాళ్ళతో వర్షం మొదలాయే
॥తంధానతానా॥
మెరుపుకు బెదరెను లేగడి దూడలు
పిడుగులపాటుకు చెదరె వృషభములు
గజగజలాడిరి గోపబాలకులు
వడవడ వణకిరి గొల్లభామలూ
హాహాకారాల్ రంకెలు ఏడ్పులు అంభారవములునూ
దిక్కులంతటా గోడుగోడున పిక్కటిల్లెనయ్యా. ॥రాజ॥

అపుడు -

గత్యంతరమునులేక గోపకులు కన్నయ్యనుజేరి
తలలువంచి నిలుచుండ కృష్ణు డాదరముచూపి యనెను ॥ రాజ॥

ఏమన్నాడయ్యాంటే -

ఇవి దేవేంద్రుని అగడమంటూ ఎరుగవలెను మీరు

ఆ దేవేంద్రుని గర్వము క్షణమున అడచివేయగలను
మీరు నిర్భయముగా నుండండీ మేలుచేతు మీకు
అని శ్రీకృష్ణుడు గోపాలకులను అనునయించినాడు
ఇలా మాట్లాడుతూనే -
ఏనుగు తన తుండముతో కమలము నెత్తినట్లుగానే
గోవర్ధనగిరి కేలనెత్తెనూ గోవిందుడు రాజా ॥రాజ॥
పర్వతాన్ని ఎత్తుతూ —
బాలుడీతడు కొండదొడ్డదీ కేలనాపగలడా?
శక్తిచాలునా? అర్భకునకనే శంకవీడుడయ్యా
బ్రహ్మాండము తలక్రిందులైనను భయములేదు మీకు
గోవులతోడను దూడలతోడను కుర్రలతో గూడి
బంధుగులారా మిత్రులార గిరిక్రిందికి రండయ్యా
అనగా నందరు పరుగులతోటీ అచటికి చేరారు ॥రాజ॥
అపుడు -
గొడుగువోలె హరికేల నిలిచెను గోవర్ధన నగము
తెరిపిలేక వర్షము వర్షిస్తూ, దినములేడు గడిచె
గోవులు గోపులు గోపికలెల్లరు కొండక్రింద నిలిచి
ఉపద్రవంబేమాత్రము లేకయ ఉండిరి క్షేమముగా ॥రాజ॥
తరువాత -
విసికిపోయి సురరాజు నాకముకు వెళ్ళిపోయినాడు
మబ్బులు మొత్తము చెదిరిపోయి నిర్మలము గగనమాయె
॥రాజ॥
నవ్వుతు కృష్ణుడు వారినందరిని నడిపె నిండ్లుచేర
ఉర్వీధరమును యథాస్థానమున నుంచెను కేశవుడూ ॥రాజ॥

ఒకనాడు బృందావనములోని పెద్దలందరు నందుని వద్దకు చేరి ఇలాగన్నారు.

అన్నా! కృష్ణుడు కన్ను తెరవనీ చిన్నతనమునందె
పాలు త్రాగుతూ పూతన రాక్షసి ప్రాణాల్పీల్చాడు
శకటాసురుని మూడోనెలలో చంపివేసినాడు
తృణావర్తు నేడాదిలోగనే త్రుంచి వైచినాడు.
గొప్ప మద్దులను రెండోయేటనె కూల్చివేసినాడు.
బకధేనుక గార్ధభరాక్షసులను పంపెను యమపురికి
ప్రలంబాసురుని చంపించాడు బలరామునిచేత
వింగికెగయు దావాగ్నిని తానే మ్రింగినాడు కాదా
మదమెక్కిన కాళీయుని యమునలో మర్దించెను గాదా
ఏడోయేటనె గోవర్ధనగిరి నెత్తినాడుకాదా
చిన్నయీడులో నెవరుచూపిరీ యిన్ని అద్భుతములు
చూడగనీతడు మానవ మాత్రుడు కాడనిపిస్తుందీ ॥వినరా॥

అని యన్నారు. అపుడు నందుడు నవ్వుతూ-

మీ యూహలు ముమ్మాటికి నిజమే మిత్రవర్యులారా!
గర్గపురోహితు డనినయట్లు శ్రీకాంతుని యంశమున
అవతరించె శ్రీకృష్ణుడు దుష్టుల నంతము చేయుటకు
మనతో నతడు కలిసితిరుగుట మనతొలిఫలమయ్యా ॥వినరా॥

అనగా గోపాలు లందరూ శ్రీకృష్ణుని మనసాధ్యానించారు

దేవేంద్రుడు చేసిన తన తప్పులను తెలిసికొనుచువచ్చి
పరి పరి విధముల నా గోవిందుని ప్రార్థించాడండీ ॥రాజ॥

ఎలా ప్రార్థించాడంటే-

వాసుదేవ శ్రీకృష్ణ పరాత్పర వరదాయక శౌరీ
నిష్కళంక సర్వేశ స్వతంత్రా నీకువందనమ్మా
నీ సామర్థ్యం తెలియక తప్పును చేసితి పరమాత్మా
నీ దాసుడ మన్నింపుము దయతో నిఖిలలోకబంధో! ॥మురళీ॥

అంటూ ప్రార్థింపగా శ్రీకృష్ణుడు నవ్వి-

కన్నుమిన్నుగానని సుఖములతో గర్వింపగతగునా
భోగభాగ్యముల నెవడొసంగెనో బాగుగ యెరిగితివా?
నీకు జ్ఞానమును తెప్పింపగనే నీ పనిచేశాను
అహంకారమును వీడి కృత్యముల నాచరింపుమయ్యా!

అని ఇంద్రునికి హితోపదేశం చేస్తుండగా కామధేనువు భక్తకామధేనువగు శ్రీకృష్ణుని ఇలా స్తుతించింది-

విశ్వభావనా! యోగివంద్య! ఓవిశ్వేశా! ఈశా!
శాశ్వత సుఖములనందగంటి మీశౌరీ! తమ దయచే ॥మురళీ॥

అప్పుడు దేవేంద్రాదులు-

తుంబుర నారద సిద్ధచారణులు స్తుతు లొనర్చుచుండ
అప్సరసలు పుష్పాలు చల్లుతూ ఆడుచుండగాను
పాడియావులూ కుండపొదుగులఁ పాలు గురియుచుండ
అచ్యుతు నచ్చటి గోప, గోతతికి నధిపతిగా జేసి
ఆవుపాలలో గంగనీటితోనభిషేకించారు
ఆ పిమ్మట స్వర్గానికి దేవత లరిగినారు రాజా ॥రాజ॥

తరువాత కొన్నాళ్ళకు ఏకాదశి ఉపవాసం చేసి-

నందుడు ద్వాదశినాడు యమునలో స్నానమాడుచుండ
దనుజుడొకడు గొనిపోయెనాతనిని తనయు లెరుగకుండ ॥రాజ॥

ఆ విషయం తెలిసిన వెంటనే-

వరుణభృత్యుడా దనుజుడటంచు యెరిగి వెంబడించి
వాసుదేవుడూ వాయువేగమున వరుణనగరికేగె ॥రాజ॥

అప్పుడు—

వచ్చిన కృష్ణుని వరుణుడు చూచీ చెచ్చెర పూజించి
దోసిలొగ్గి సాష్టాంగ సమస్కృతి చేసి ఇట్టులనియె ॥రాజ॥
దేవా! తమ జనకుండని యెరుగక తెచ్చెను నా భటుడు
శరణాగతరక్షకులని తమరు బిరుదు పొందినారు
నను మన్నించీ తండ్రిగారినీ గొనిపొండనివాడు
వరుణుని వీడ్కొని జనకుని తోడ్కొని హరి బృందకు చేరె ॥రాజ॥

తరువాత నందుడు తనను శ్రీకృష్ణుడు వరుణనగరం నుండి విడిపించుకొని వచ్చిన వృత్తాంతాన్ని బంధుమిత్రులకు చెప్పగా అందరూ శ్రీకృష్ణుడు ఈశ్వరుడేనని తలచి, ఎన్నో విధాల ప్రస్తుతించారు-పూజించారు -

ఇంతలో :-

శారదరాత్రులు మనోహరంగా సాగివచ్చెనండీ
మబ్బు దూది పింజలవలె తెల్లగ మారిపుక్కలాయె
కలువపూవువలె వెలిగె చంద్రుడూ గగన సరసియందు
చంద్ర చంద్రికల ప్రకాశించెనా శరత్కాలనిశలు
తూరుపు పడతి ముఖాన కుంకుమగ తోచె నిశాకరుడు
ఈ సమయంలో యమున ఒడ్డునా ఇసుక తిన్నెపైన

కూరుచుండి హరి వేణుగానమును అరంభించాడు
గాలితోడుతా పాట గోకులము కలియనలముకొనియె ॥రాజ॥
ఆగానమును విన్నగోపికలు తమ తమ చేష్టలు మాని
గోపుల వద్దకు చేరినవారు
పాలకు దూడల వదిలినవారు
పాలను కడవలొ పితికేవారు
పితికిన పాలను కాచేవారు
పాలను శిశువుల కొసగకుండనే బయలుదేరినారు ॥తంథాన తానా॥
విడిచిన కురులను ముడువని వారు
విప్పిన పైటను కప్పని వారు
తొడవులచేకొని తొడగనివారు
విరులను జడలో తరుమనివారు
వలదని మగలూ మామలు మరుదులు వారించిన వినక
॥తంధానతానా॥
బిడ్డలు కొడుకులు తమ్ములన్నలూ అడ్డుపడిన కనక
చక చక పరుగులతో శ్రీకృష్ణుని సరసకు చేరారు
రాగంతో నభిమానం విడిచీ కౌగలించినారు
త్రిగుణాత్మకమగు దేహ బంధమును త్రెంపి వేసినారు ॥రాజ॥
అని శుకయోగీంద్రుడు చెప్పగా పరీక్షిత్తు తిరిగి ప్రశ్నించాడు,
భావింపరు గోపికలు కృష్ణునీ పరబ్రహ్మమనుచు
ఎరిగింపుడు గుణమయదేహాలను ఎట్లు వదిలినారో ॥మౌనిచంద్ర॥

అని అడుగగా శుకుడు ఇలా చెప్పారు

వగతోనైనను వగతోనైనను బాంధవముననైన
ప్రీతినైననూ భక్తినైన కడుభీతినైనగాని
పారతంత్ర్యమున హరిని దలచుచో వారిని కరుణించి
శ్రీహరి వేరుదలంపక తనలో చేర్చుకొనును రాజా ॥రాజ॥

తరువాత బృందావనంనుండి వచ్చిన వారినిచూచి నవ్వుతూ శ్రీకృష్ణుడు-

ఏమి ప్రమాదం ముంచుకొచ్చెనని ఇచటికి వచ్చారు
ఆవులకును లేగలకును మీకును ఆపదలేదుగదా!
క్రూర మృగాలూ సంచరించు యీ దారిన రాదగునా
బాలు బాలునో గోపికలారా చనుడీ గృహములకూ
మీ తలిదండ్రులు భర్త అనుజులూ మిమ్ము కానలేక
పిల్లలతో గగ్గోలు పడుతు మిమ్మెల్ల వెదకుతారు
జారవాంఛతో సత్కులాంగనలు సాగిరాగ తగునా
లోకులు మిమ్ముల చూచి ఛీయనరె రోత పుట్టునట్లు
ధరణీశుం డిది యెరిగిన మిమ్ముల దండింపగవచ్చు
తల్లిదండ్రు లిది యెరిగిన జగమున తలల నెత్తగలరా
ఆత్మజు లెరిగిన మిమ్ముల నసలే యాదరింపబోరు
బంధువు లెరిగిన కులము నుండి మిము బహిష్కరిస్తారు
ఇతరులెరిగితే మిమ్ముల చూతురు ఎంతో చులకనగా
మామగారెరిగియున్న కాపురము మంట కలుపుతాడు
నన్నుగోరి యిచ్చటకు వచ్చుట నాకు తెలుసుగాని
ఎట్టివారయిన భర్తను విడచుట ఇంతికి దగదమ్మా

నను ధ్యానించే వారికిత్తునూ నా యనుగ్రహమును
ఎంతమాత్రము బాగు సేయక ఇండ్లకు వెళ్ళండీ ॥వినరా॥
అని మందలించాడు కృష్ణుడు—అపుడు -

గద్గదకంఠముతోడ గోపికలు కనుల నీరునింపి
గోవిందా! నీమాటవిన్న మాగుండె లవిసిపోయె
నమ్మకున్న నిను క్రూరుడనగ మా నాలుక రాదయ్యా
సర్వము నీవేయని వచ్చిన మము సాధింపగతగునా
మా పాదాలూ కదలనేరవు నీ పాదాల్ విడిచీ
మా చేతులనూ నీవు తాకనిది మా చేతలు సున్న
నీవాగమృతము మరగిన వీనులు ఇతరసుడుల వినవూ
నీ సౌందర్యము చూచిన కన్నులు నిలువవేది చూడ
నీ లీలలు వర్ణించు నాలుకలు నేరవేది పలుక
సిరి సేవింపగ నోచిన నీ పదసేవ చేయకుండ
విడిచి వెళ్ళుటకు మాకాళ్ళాడవు విశ్వమోహనాంగా
కమల గంధమును మరిగిన తేటి కదలగోరనట్లు
నీయందే మాయందరి మనసులు నిలిచియుండె కృష్ణా!
అత్తమామలను బిడ్డల పతులను అందరినీ విడిచీ
ఇతరము లెరుగక నీవే గతియని ఇచటికి వచ్చితిమి
మము మన్నింపుము నిన్ను వేడెదము మహానుభావ కృష్ణా!
కుండల మండిత గండస్థలము
ముంగురు లెగిరెడి ఫాలభాగము
మందహాస వదనారవిందము
సుధను మించు నీ యధర పల్లవము

ఆలోకిస్తూ కాలము గడిపే అదృష్టాన్ని గోరి ॥గోపాలబాలా॥
వచ్చినట్టి మా హృదయ తాపమును వారింపుము స్వామీ
॥గోపాలబాలా॥

అని అనేక విధాల ప్రార్థించారు. వారిని తృప్తిపరుస్తూనే అదృశ్యుడైనాడు కృష్ణుడు -

తెల్లబోయినా రచ్చటనున్న గొల్లభామలెల్ల
చింతించుచు ఆ చుట్టుపట్లగల చెట్లలో వెదికారు
దీనవదనలై తిరిగినారచటి తీగ పొదలలోన
గోపాలుని జాడల తెల్పుమనీ కోరినారు లతల ॥రాజ॥

ఏమని అడిగారంటే -

నల్లని దేహమువాడు పద్మనయనమ్ములు గలవాడు
ఎల్లరిపై తన కృపారసాన్ని చల్లు గుణమువాడు
శిరముపైన నొక నెమలి పింఛమును ధరియించెడివాడు
చిరునగవులతో నెల్లప్పుడు రాజిల్లు మోమువాడు
వడతుల మానధనాన్ని దోచుకొని పారిపోయినాడు
మల్లియలారా! మీ నికుంజముల మాటున దాగాడా ॥రాజ॥

అని చెట్లనూ తీగెలనూ పుట్టలనూ పువ్వులనూ అడుగుతూ వనమంతా కలియ తిరిగారు. చివరకు యమున వడ్డున గల ఇసుక తిన్నెలను చేరారు. శ్రీకృష్ణుని తమ మనసులో ఇలా తలచుకున్నారు. కృష్ణా !

చరణ భక్తులై మనలువారి సంసారభయము మాన్పి
॥గోపాలబాలా॥
ముక్తినొసగెడి నీవు మమ్ములను మోసము చేసెదవా ”
కృష్ణా! నీవూ ఎదిగినటులె మా తృష్ణలు పెంచావు ”
దొంగ చూపులతో మా గుండెలనూ దోచుకుంటివయ్యా ”
మనసులు మాటలు చేతలుంచితిమి మాధవ నీపైన ”
ఇచ్చటనే మీ సేవ చేతుమూ ఇండ్లకేగబోము ॥చిత్తగించుమా॥
అడవికి గోవుల మేపగ నీవూ అరుగునప్పుడెల్ల ”
కమల సమములగు నీ పాదాలూ క్రందిపోవుననుచు ”
కమల నయన మా మనములు ఎంతో కలత చెందుచుండు
॥చిత్తగించుమా॥
సాయంకాలము నీవు వచ్చేడీ సమయమందు మేము ”
గోవుల గిట్టలచిమ్ము దుమ్ముతో కురులు మాసియుండ ”
మురళీనాదము చేయుచు వచ్చే మోము చూడగోరి ”
నిరీక్షింతుమూ అనుదినమ్ము ఓ నీరజాక్ష కృష్ణా ”
నిన్ను చూడనిదె నిలువలేము ఒకనిమిషమాత్రమైన ”
పగలు రాత్రులూ నీ సుందరముఖపద్మము గనకుండా ”
రెప్ప లడ్డముగపెట్టె విధాత తప్పుత్రోవబట్టి ”
వలదని బంధువు లందరు మమ్ముల వారించిన వినక ”
నీ మృదుగానము వీనులసోకగ నిలువకవచ్చాము ”
బ్రహ్మాదుల ప్రార్థనచే లోకము రక్షణ చేయుటకు ”
అవతరించినా నారాయణుడవు ఆర్తరక్షకుడవు ”
కాళీయుని మర్దించి గోవులను కాపాడితివయ్యా ”

అజగరాసురుని సంహరించి మమ్మాదుకుంటివయ్యా ,,
దావాగ్నిని చల్లార్చి ప్రాణముల దక్కించితివయ్యా ,,
రాళ్ళవాన తగ్గించి అందరిని రక్షించావయ్యా ,,
భక్తజనుల తాపాలను బాధల పరిమార్చెడి నీవు ,,
మా గుండెలలో నిండిన తాపము మాన్పలేవ కృష్ణా ,,
నీ చిరునవ్వులు నీ సరసాలూ నీ గానరసాలూ ,,
మా మనసులలో కదలిక నిలిచెను సామగానలోల ,,
క్రూరరాక్షసుల యమపురికంపే వీరుడవగు నీవూ ,,
పంచబాణుని వలనుండీ తప్పించలేవమమ్మూ ॥మురళీ॥

అని దీనంగా ప్రార్థించుతుంటే గోపాలుడు సాక్షాత్కరించాడు. అపుడు గోపికలు -

పోయిన ప్రాణాల్ తిరిగి వచ్చినటు లాయననూ చేరి
వికసిత ముఖపద్మాలతో కృష్ణుని వీక్షించారండీ ॥రాజ॥
విందామయా మనసు విందామయా
గోవిందు కథలనూ విందామయా
పొలతి యొక్కతె వ్రేలు పొందుగా గ్రహియించె
అబల యొక్కతి భక్తి సంజలించె ॥విందామయా॥
ఒక తరుణి తన యురము నుంచె పాదాలపై
ఒక కాంత హరికరము నూదిపట్టె ,,
పడతి యొక్కతి కృష్ణుపాదముల తన రొమ్ము
అద్దుకొని యానంద మనుభవించె ,,
భామయొక్కతె భ్రుకుటి బంధమ్ము గావించె
వాడి చూపుల నొకతె వరుని చూచె ,,

హరి ముఖమ్మును చూచి తరుణి యొక్కతి రెప్ప
అను వాల్చకుండనే కనులు నిలిపె ”
ఒక యబల మాధవుని ఉజ్వల రూపమును
గుండెలో బిగపట్టి కూరుచుండె ”
నాతి యొక్కతి ఎందు బోతివని కసురుకొని
తోరంపు టలుకతో కూరుచుండె ”
నను వదిలి యెచటికో చనగ నీ పాదాలు
ఎటు లాడెనని ఒకతి ఏడ్చుచుండె ”
ఎందుకో నను నిన్ను నిందాక నెడబాపె
పాపకర్మంబని పలికె నొకతె ”

ఈ విధంగా —

గోపాలుని ఆకారము చూచి గోపకాంతలెల్ల
తమలో వేపిన విరహానికి నుపశమనము పొందారు

అప్పుడు శ్రీకృష్ణుడు —

పిండి యారబోసినటు లుండెడి పండువెన్నెలందు
పూల వాసనల గుబాళించుతూ గాలి వీచుచుండి
కాళిందీనది తరంగాలు స్వాగతము పలుకుచుండ
ఝుమ్మనిచేసే భ్రమరగానము కమ్మగవినిపింప
అమలినాలగూ ఇసుక తిప్పలకు అత్యుత్సాహముతో
హాయిగ కాంతాజనములతోటి అచ్యుతుండుసాగె ॥రాజ॥

అచ్చట గోపికలు—

జ్ఞాన మార్గమున పరమేశ్వరునీ గాంచి తృప్తి పడుచు
ప్రాపంచిక వేదనలు విడిచి ఆ పరమపురుషుకొరకు ॥రాజ॥

ప్రేమతోడ మెత్తని చీరలనూ పీటవలెను వేసి
పాదము లొత్తుచు లోగడ గల తమ బాధల మరిచారు ॥రాజ॥
ఎన్నోవిధముల నటింప నేర్చిన వెన్నుడు చిత్రముగా
ఆ సమయంలో పథకము వేసెను రాసక్రీడలకు ॥రాజ॥

ఏమిచేశాడంటే -

గుండ్రముగా తిరుగుటకు వీలుగా గోపికలను నిల్పి
ఒకరి భుజము నింకొకరు పట్టుకొని యుండునట్లు చేసె ॥రాజ॥

తామరరేకులవలె తన చుట్టూ భామలు నిలుచుండ
నడుమనుండు కర్ణికనువోలె కృష్ణుడు నిలుచున్నాడు ॥రాజ॥
వీణ లందుకొని స్త్రీలు పాటలను వినిపించుచునుండ
మధ్యలోన వేణువు మ్రోగించుచు మాధవుడున్నాడు
అంగనకావల తాను తనకు నొక యంగన ఆ వలను
ఇరువురి మధ్యన ఒక్కొక్కడుగా హరి విలసిల్లాడు ॥రాజ॥
ఏడు వర్ణముల శోభ నొప్పెడి ఇంద్రధనువు వోలె
నెమలి ఫించపూ కాంతు లంతటా నిండి తేజరిల్ల
నడుము బిగించిన బంగరుచేలము కడు సొగసునుగూర్ప
ఫాలము కస్తూరీతిలకముచే భాసిల్లుచునుండ
ఇంద్రనీలకాంతుల తన దేహం బెంతగానొ మెరయ
హరిణాక్షులతో రాసక్రీడల నాడినాడు రాజా ॥రాజ॥

అపుడు గోపికలు గూడా -

కాలిగజ్జెలూ కరకంకణములు గల్లుగల్లుమనగా
కురులు చెదరగా చెవుల కుండనాల్ మెరయుచుండగాను
హారాల్ చిక్కులుబడ, మేఖలములు జారిపోవుచుండ
జారిన పైటలు తిరిగి చక్కగా సవరింపగలేక
హాసాలతో తమ మృదుకరముల విన్యాసా లొప్పగను
కన్నులు త్రిప్పుచు తనువు కదల్చుచు అన్ని భంగిమలలో
అభినయించిరీ మురళీనాదము కనుగుణమ్ముగాను
హరి శరీరమును తాకి గోపికలు పరవశించి మించి
మేఘముతోటీ మెరపుతీగవలె మెరసినారు వారు
తన ప్రతిబింబము నద్దము లోపల కను బాలునివోలె
అందరికీ అందరుగానే గోవిందుడు కనిపిస్తూ
రాసకేళినీ జరిపినాడు ఆరామలతో గూడి ॥రాజ॥

హరిణాక్షులతో జగన్నాథుడూ ఆడుచుండగాను
సురలాకాశమునుండి రాసమును చూచిరి చోద్యముగా
రాసము సర్వజగన్నుతమైన ఉల్లాసము కలిగించె
అంతట్తో రాసక్రీడలను యనంతుడు చాలించె ॥రాజ॥

తరువాత -

స్వేదజలముతో తనువులు తడిసిన యాదహాంగనలతో
జలక్రీడలను సలుపగ యమునా జలములందు చొచ్చి
ఆటలాడిరీ మునుగుచు తేలుచు నీటిలోన వారు
జలకములాడీ బయటికి వచ్చిరి చెలులు శౌరితోడ ॥రాజ॥

అపుడు పరీక్షన్మహారాజు, శుకమహర్షిని ఇలా గడిగాడు -

ధర్మరక్షణము చేయుట కొరకీ ధరను పుట్టినట్టీ
ధర్మమూర్తియగు హరి సహజంబగు ధర్మపథము వదలి
రాసము పరకాంతలతో సలుపుట దోసమేలకాదో
మునివర్యా! మీ వలన దానినే వినకోరిక గలిగె ॥మౌనిచంద్ర॥

అని యడుగగా శ్రీశుకుడు ఇలాగన్నాడు —

అన్నింటిని భక్షించే అగ్నికి అంటునె దోషంబు
అటులనె తేజస్వులకు దోసములు అంటవయ్యా రాజా ॥రాజ॥
పరమేశ్వరుడే విషమును మ్రింగీ బ్రతికినాడుగానీ
ఇతరు డెవడయిన విషమును మ్రింగీ బ్రతుకగలడె రాజా
గోవులలోనూ గోపజనులలో గోపికలందుననూ
సకల జంతు సంతతుల లోపల సంచరించునట్టీ
ఆ మహాత్మునకు సర్వమయునకు హరికి అచ్యుతునకు
పరకాంతలనే భావముండునే హరిలీలలు గాక ॥రాజ॥

అని శ్రీశుకులవారు చెప్పినారు. తరువాత ఏం జరిగిందంటే ?

తెలతెలవారేవరకే ఇండ్లకు చెలులు చేరినారు
అటుల వచ్చినను కాంతల గోపకులాగ్రహింపలేదు ॥రాజ॥

ఒకరోజు నందుడూ మిగతా యాదవులు కలిసి అంబికా వనంలో జరిగే జాతరకు, రథాలూ, బండ్లూ కట్టుకొని ఎక్కి వెళ్ళారు. ఎలాగంటే ?

పాట

జాతరకూ వెళ్ళినారు గోపులూ-అచ్చట
జరిగినట్టి విశేషాలు సావధానముగ తెల్పెద ॥జాతరకూ॥
సరస్వతీ నదిలోపల స్నానాలూ చేశారు
బ్రాహ్మణులకు గోవులనూ భక్తితోడ ఇచ్చారు
అన్నవస్త్ర దానాలను ఎన్నెన్నో చేశారు
నీరు మాత్రమే త్రాగి నిష్ఠతోటి ఉన్నారు ॥జాతరకూ॥
విధుమౌళిని దర్శించీ వ్యథలన్నీ మరిచారు
హరహరయని ఆవుపాల నభిషేకం చేశారు
పురహర్తకు తుమ్మిపూల పూజలనే చేశారు
వళ్ళు మరచి అచట నడుము వాల్చి నిద్రపోయినారు ॥జాతరకూ॥

అప్పుడు —

పామొక్కటి చరచరయని ప్రాకుతూ వచ్చింది
పడగనెత్తి అటూ ఇటూ పారజూచి దరిచేరీ
నిదురబోవు నందుని ఆ యదనులోన మింగదలచి
సమీపింప కృష్ణాయను శబ్దముతో నందుడరచె ॥జాతరకూ॥
ఆ సవ్వడివిని గోపకు లందరు మేల్కాన్నారు
పామును చంపుట కొరకై ప్రయత్నాలు చేశారు
సర్పము నందుని మ్రింగగ సాగుచుండ హరి కనుగొని
పాదముతో తన్నినంత పామురూపు మారిందీ ॥జాతరకూ॥

అప్పుడే ఆ పాము సర్పరూపం వదిలి -

బంగారపు దేహముతో పలురకాల నగలతోడ
గంధర్వుడుగా మారి కానుపించె నందరకూ

వాసుదేవు పాదములకు వందన మాతడు చేయగ
అడిగినాడు శ్రీకృష్ణుడు అతనిని నీవెవ్వడవని ॥జాతరకూ॥

అపుడా గంధర్వుడు శ్రీకృష్ణునితో ఇలా గన్నాడు.

సావధానముగ వినుడీదేవా నే గంధర్వుడ
ఒక్కనాడు విమానమున దిక్కులకూ తిరుగాడుతు
వనములోన అంగీరస వంశీయుల మునివర్యుల
కురూపులగు వారిజూచి పరిహసించి నవ్వినాను ॥జాతరకూ॥

అంతట నా జడదారులు శాంతమును కోలుపోయి
ఔరా ఓ సుదర్శనా నీ రూపము చూచుకొనీ
కొంచెపు బుద్ధివి కావున మంచిచెడ్డ లెరుగకుండ
మమ్ము చూచి నవ్వేదవా కమ్మునీవు ఉరగముగా ॥జాతరకూ॥

అని ఆ మునులు నన్ను శపింపగా నేను ఆ శాపాన్ని వారింపమని వారి పాదాల పైబడి ప్రార్థించాను. అపుడు వారు శాంతించి ఇలా గన్నారు -

యాదవులల్లో నారాయణుడు కృష్ణుడై జనించు
ఆ పురుషోత్తముడు వనవిహారానికి వచ్చినపుడు
నీకు అతని పాదాలు సోకినంత మాత్రాననె
ఖల జన్మము వదిలి నీవు గంధర్వుడ వౌదువనిరి ॥జాతరకూ॥

వనజనయన నేడు నన్ను వదిలెను ఉరగాకారము
నీ పాదములను దాకిన నిర్మూలము దోసమాయె
నినుదలచిన మాత్రముననె నిలువవంట పాతకాలు
శలవు నాకొసంగుడంచు ఛనినాడా గంధర్వుడు ॥జాతరకూ॥

పాట

జాతరకూ వెళ్ళినారు గోపులూ-అచ్చట
జరిగినట్టి విశేషాలు సావధానముగ తెల్పెద ॥జాతరకూ॥
సరస్వతీ నదిలోపల స్నానాలూ చేశారు
బ్రాహ్మణులకు గోవులనూ భక్తితోడ ఇచ్చారు
అన్నవస్త్ర దానాలను ఎన్నెన్నో చేశారు
నీరు మాత్రమే త్రాగి నిష్ఠతోటి ఉన్నారు ॥జాతరకూ॥
విధుమౌళిని దర్శించీ వ్యథలన్నీ మరిచారు
హరహరయని ఆవుపాల నభిషేకం చేశారు
పురహర్తకు తుమ్మిపూల పూజలనే చేశారు
వళ్ళు మరచి అచట నడుము వాల్చి నిద్రపోయినారు ॥జాతరకూ॥

అప్పుడు —

పామొక్కటి చరచరయని ప్రాకుతూ వచ్చింది
పడగనెత్తి అటూ ఇటూ పారజూచి దరిచేరీ
నిదురబోవు నందుని ఆ యదనులోన మింగదలచి
సమీపింప కృష్ణాయను శబ్దముతో నందుడరచె ॥జాతరకూ॥
ఆ సవ్వడివిని గోపకు లందరు మేల్కాన్నారు
పామును చంపుట కొరకై ప్రయత్నాలు చేశారు
సర్పము నందుని మ్రింగగ సాగుచుండ హరి కనుగొని
పాదముతో తన్నినంత పామురూపు మారిందీ ॥జాతరకూ॥

అప్పుడే ఆ పాము సర్పరూపం వదిలి -

బంగారపు దేహముతో పటురకాల నగలతోడ
గంధర్వుడుగా మారి కానుపించె నందరకూ

వాసుదేవు పాదములకు వందన మాతడు చేయగ
అడిగినాడు శ్రీకృష్ణుడు ఆతనిని నీవెవ్వడవని ॥జాతరకూ॥

అపుడా గంధర్వుడు శ్రీకృష్ణునితో ఇలా గన్నాడు.

సావధానముగ వినుడీదేవా నే గంధర్వుడ
ఒక్కనాడు విమానమున దిక్కులకూ తిరుగాడుతు
వనములోన అంగీరస వంశీయుల మునివర్యుల
కురూపులగు వారిజూచి పరిహాసించి నవ్వినాను ॥జాతరకూ॥

అంతట నా జడదారులు శాంతమును కోలుపోయి
ఔరా ఓ సుదర్శనా నీ రూపము చూచుకొనీ
కొంచెపు బుద్ధివి కావున మంచిచెడ్డ లెరుగకుండ
మమ్ము చూచి నవ్వేదవా కమ్మునీవు ఉరగముగా ॥జాతరకూ॥

అని ఆ మునులు నన్ను శపింపగా నేను ఆ శాపాన్ని వారింపమని వారి పాదాల పైబడి ప్రార్థించాను. అపుడు వారు శాంతించి ఇలా గన్నారు -

యాదవులల్లో నారాయణుడు కృష్ణుడై జనించు
ఆ పురుషోత్తముడు వనవిహారానికి వచ్చినపుడు
నీకు ఆతని పాదాలు సోకినంత మాత్రానవె
ఖల జన్మము వదిలి నీవు గంధర్వుడ వౌదువనిరి ॥జాతరకూ॥

వనజనయన నేడు నన్ను వదిలెను ఉరగాకారము
నీ పాదములను దాకిన నిర్మాలము దోసమాయె
నినుదలచిన మాత్రముననె నిలువవంట పాతకాలు
శలవు నాకొసంగుడంచు ఛనినాడా గంధర్వుడు ॥జాతరకూ॥

అని గోపాలకృష్ణునికి నమస్కరించి ఆ సుదర్శనుడు తన నివాసానికి వెళ్లాడు. కొంతకాలము గడచిన పిమ్మట -

వెన్నెలరేయిని మామిడితోపున కన్నుల పండువుగా
తుమ్మెదలూ ఝుంకారాల్ చేయగ కమ్మగాను వినుచూ
బలరామునితో కలిసి కృష్ణుడూ వనమున కేగాడు
అచ్చట కృష్ణుడు మురళీగానము నారంభించాడు ॥రాజ॥

అపుడు -

చల్లగాలిలో మెల్లమెల్లగా సాగిందాపాట
మత్తెక్కించెను గోపసతులకా మధురమైన పాట
ఆనందముతో తన్మయత్వమున అలరు నట్టివేళ
కుబేరభటుడూ శంఖచూడుడను గుహ్యకుండొకండు
ఆ కాంతలనూ ఎంతో దూరము చేకొనిపోయాడు
అపుడా మగువలు భయపడి చేసిరి ఆర్తనాదములను
ఆ శోకధ్వని చెవులబడగనే అన్నదమ్ములచటి
పెద్ద పెద్ద వృక్షాలను రెంటిని పీకి చేతబట్టి
పరుగులతోటి వెళ్ళగ, యక్షుడు పారిపోయినాడు
పురుషోత్తముడా గోపకాంతలను వెరువకుడని చెప్పి
బలరాముణ్ణీ వారి రక్షణకు నిలిపి స్వయముగాను
కొద్దిలో నతనిపట్టి బలముగా గుద్ది చంపినాడు
వాని శిరముపైగల రత్నము చేకొని తెచ్చినాడు
బలరామున కదియిచ్చి ముదమునూ కలిగించెను రాజా

॥రాజ॥

తరువాత కొంతకాలానికి ఒక రోజున వృషభాసురుడనే రాక్షసుడు —

మేఘమండలము తాకేటంతటి మేటిమూపురముతో
పర్వతాల పెకలింపజాలిన భారీ కొమ్ములతో
దుమ్ము గగనమును గ్రమ్మునట్లుగా చిమ్మే గిట్టలతో
కర్ణేంద్రియముల సోక గర్భిణుల కలచే రంకెలతో
బలిసి సన్నగా తెల్లని హిమవత్పర్వత దేహముతో
వృషభాసురుడనువాడు గోపకుల వీటికి వచ్చాడు

ఆ రాక్షసుడు వస్తూనే -

గిట్టలతో నేలగీకుతూ సై
దిట్టముగా తోకత్రిప్పుతూ "
కన్నులలో నిప్పుగ్రక్కుతూ "
కొమ్ములతో నేలకుమ్ముతూ "

గోపాలురపై దూకెరా- దాని-కోపానికి హద్దులేదురా ॥భళా॥

ఆ విధంగా వృషభాసురుడు మందవైపు దూసుక వస్తూండగా :-

పరుగులుతీస్తూ గోవుల మందలు పారిపోవుచుండె
లేగదూడలూ తల్లుల పొదుగుల దాగియుండెనండీ
ధేనువు లెద్దులచాటుకు పరుగులు దీయుచున్నవండీ
కాపాడమనీ కృష్ణుని వేడిరి గోపాలకులంతా ॥రాజ॥

అప్పుడు—

వారి శోకమును వినినతోడనే వసుదేవుని సుతుడు
పాము పడగవలె తన యరచేతిని పైకి యెత్తినాడు
చిరునవ్వులతో దాని కొమ్ములను చేతుల బిగపట్టి
వదునెనుమిది యడుగుల దూరములో పడగనెట్టివేసె
ఆ యూపునకా యసురుని ప్రాణా లన్నుపట్టైనండీ
తిరిగి తేరుకొని ఢీకొన ముందుకు పరుగెత్తుచురాగా
మరల కృష్ణుడూ కొమ్ములుపట్టీ గిరగిర త్రిప్పుచునూ
నేలకు చరిచీ పిడికిట గ్రుద్దీ కాల ద్రొక్కినాడు
ముక్కున నోటను నెత్తురుకారగ ఉక్కుచెడుతు రొప్పి
ఎక్కువ మూత్రపురీషాల్విడిచీ రక్కసి చచ్చాడు
గోపబృందమూ సంతోషంతో కొనియాడిరి హరిని
అందరు కలిపీ బలకృష్ణులతో మందకు వెళ్ళారు ॥రాజ॥

o...o

# కంస సంహారం

కంసుని కృష్ణుడు సంహరించినా కథను వినగరండీ
కన్నుగానక చేసిన తప్పులు కట్టి కుడుపునండీ

తరువాత ఒకరోజున —

మూడు లోకముల తిరుగాడుతు సురమునియగు నారదుడు
మధురకు వచ్చి కంసునితోడను మాటలాడినాడు ॥రాజ॥

ఏమని మాట్లాడాడంటే -

దేవకి కడుపున పుట్టినాడయా ఆ వైకుంఠుండు
ముందుగ రోహిణి కడుపున బలరాముడు జన్మించాడు
నందవ్రజమున వారలిద్దరూ మందలోనగలరు
అప్పుడు నీ చేతులలో చిక్కిన దది యశోదబిడ్డ
యోగమాయ యదియనగా కంసుడు వేగమె లేచాడు
ఇంతమోసగాడగు వసుదేవుని ఇపుడె సంహరింతు ॥వినరా॥

అని ఆగ్రహోదగ్రుడై కరవాలము చేతబట్టి లేవబోగా,
నారదుడు అతనిని చూచి నవ్వుతూ —

వసుదేవుడు నీ చెల్లెలి పెనిమిటివాని చంపనేల
గోకుల మందున పెరుగు కృష్ణుడే నీకు శత్రువయ్యా
గోపాలునిపై నీ ప్రతాపమును చూపుమోయి కంసా !
అని నారదుడూ పలికి శలవుగొని చనెను గగనమునకు ॥రాజ॥

అప్పుడు కంసుడు —

దేవకినీ వసుదేవునిపట్టి తెప్పించాడండీ
ఇనుప గొలుసులను కట్టి జైలు యందున త్రోయించాడు ॥రాజ॥

వెంటనే —

సభాభవనముకు కేశియనే రాక్షసుని పిలిచినాడు
రామకృష్ణులను వెంటనె చంపి రమ్మని చెప్పాడు
గజారోహ చాణూర ముష్టికా గణమును పిలిపించి
భటులను మంత్రుల సాళ్వ కోసల ప్రముఖుల రావించి

ఇలా గన్నాడు కంసుడు —

ఇంద్రాదులె భయమంది నన్నెపుడు ఎదిరింపగలేదు
బృందావనమున బాలురిద్దరూ భీతివిడచి నన్ను
పరిమార్చెదమని నల్గురితోటీ పల్కుచుందురంట
చాణూరా ! ఓ ముష్టిక ! మీరీ సందర్భమునందూ
మల్లులపోరును జరిపించండి మధురాపురియందు
అది చూచుటకై రామకృష్ణులను ఆహ్వానించండి

ఆ బలరామకృష్ణులు వచ్చిన తరువాత —

గొప్ప మల్లులగు మీరాబాలుర నవ్వళించి అదిమి
మట్టి ముద్దలుగ పిసికి నీటిలో నెట్టివేయుడయ్యా ॥విన॥

అని చెప్పి తన గజశాలలోని కువలాయాపీడమనే గజ రాజును సంరక్షించే మావటీడును పిలిపించి —

బాలకులిద్దరి నా యేనుగు పాదాలక్రింద ద్రోసి
ముద్దముద్దగా తొక్కించి నా ముందు పెట్టుమనియె ॥రాజ॥

తరువాత మిగతా వారందరితో ఇలా గన్నాడు —

ధనుర్యాగమును రేపు చతుర్దశిదినము జరుగునట్లు
ప్రకటించండని చెప్పి అందరిని పంపించెను రాజా ॥రాజ॥

పిమ్మట తన మిత్రుడగు అక్రూరుని పిలిపించి —

సురలు నాకు భయపడి నారాయణు శరణు చొచ్చిరంట
హరినను చంపెదనని వారలకూ అభయ మిచ్చెనంట

ఆ హరి వసుదేవుని పుత్రుండై అవతరించెనంట
కావున ఆ విషయం మన మిపుడే గమనించాలయ్యా ।వినరా।
అందుకని నీవు వెంటనే బయలుదేరి నంద వ్రజానికి వెళ్ళి -

ధనుర్యాగమిట జరుగునంచు నందాదులకును చెప్పి
చూడరమ్మనీ వస్తూ పన్నులుగూడ తెమ్మనాలి
రామకృష్ణులూ నందుని వెంబడి రాగల రిచ్చటికి
ఆ సమయంలో వారిద్దరి నే నంతమొందజేతు ॥వినరా॥
ఎలాగంటే -

కోపంవస్తే కొండలనైన కూల్చివేయునట్టి
వేదండము ఆ యన్నదమ్ములను పాదాలతొ త్రొక్క-
అవి గానిచొ చాణూర ముష్టికుల వదలెద పోరుకున
వారు రామకృష్ణులను తప్పక వధించగలరయ్యా ॥వినరా॥
తరువాత -

కసిమసంగగా పరిమార్చెద నా వసుదేవునిబట్టి
వృష్టి భోజులను దశార్హముఖ్యుల వీరుల చంపెదను
నా జనకుండగు ఉగ్రసేనునీ నాశము చేస్తాను
పిన్నతండ్రి దేవకుని పట్టుకొని పీచమడచుతాను
మిగిలిన వైరుల నొక్కరొక్కరిని తగినరీతి నడచి
శంబర బాణాసుర నరకాసుర జరాసంధ తతితో
కలసి నేమ భూచక్ర మేలెదను పలుసుఖములతోడ
ఈ రహస్యమును ఎవ్వరియెదుట నోరుజారవలదు ॥వినరా
ఇంకా ఆలశ్యం కాకుండా వారిని తీసుకురమ్మనగా అక్రూరుడు —

నీ మాటను కాదననుగాని విను నా మాటనురాజా !
తమ శక్తిని ఊహింపనేరరీ ధరనెవ్వరుగానీ

ఏ కాలానికి ఏగతు లెందున ఎటుల ప్రాప్తమగునో
ఆకాలానికి ఆ గతులందరు అనుభవింపవలెను
ఈశ్వరేచ్ఛ తప్పింపనేరరు ఎవ్వరు రాజేంద్రా
పోయివచ్చెదను నీ పగవారల పుత్రుల తెచ్చెదను
అని అక్రూరుడు సెలవని బృందావనము కేగినాడు ॥వినరా॥
అచటి జనుల వీడ్కొలిపి కంసుడూ అంతిపురము కేగె ॥రాజ॥

తరువాత -

కంసుని యానతితో కేశియనే ఖలుడు బయలుదేరి
నందవ్రజముకు అశ్వరూపమును పొంది వచ్చినాడు
శూలమువంటి వాలముప్పిలేపి
గాలికి రెపరెప జూలు విదల్చుచు
గుట్టల పిండిగ గిట్టల కొట్టుచు
భీషణమయినా హేషలొనర్చుచు
భయము గొల్పుతూ మందలోని కా హయముదూకెనండీ॥తంధాన॥
బలములేని ఆ గోపబాలురతొ పనిలేదని యెంచి ”
హరియే దిక్కన గలడోయంచూ తిరుగాడుచునుండే ”
వాసుదేవుడిది గ్రహించి ఎదురుగ వచ్చి నిలిచినాడు ”

శ్రీకృష్ణుడు ఇలా గన్నాడు -

ఓరీ నీ బ్రతుకిప్పటికిప్పుడు తీరిపోవుననుచు
తొడను గొట్టి రారాయటంచు ఆ తులువను పిలిచాడు
తురగము నోటిని తెరచి కృష్ణుని కరవాలని రాగా
దానినుండి గోవిందుడు ప్రక్కకు తప్పుకొనెను రాజా
దానవుండు కాళ్ళెత్తి బలముగా తన్నెను శ్రీహరిని
తన్నిన తన్నును తప్పుకొనుచు హరి కన్నులెర్రచేసి
తురగ దానవుని రెండు కాళ్లు చేతుల బిగించిపట్టి
పాము దేహమును గరుడుడు విసిరి పారవేయునట్లు

గిరగిర చక్రము వోలెత్రిప్పి వేగరము విసిరినాడు
ఆ దెబ్బకు నూరడుగుల దూరమునందు పడెను హయము ॥రాజ॥
దూరముగా నేలంబడి దుమ్మును దులుపుకొనుచు లేచి
తోకనూపుతూ తిరిగి దానవుడు దూసుకవచ్చాడు
నోరు దెరచి కృష్ణుని మ్రింగుటకు చేరగ కేశవుడు
కరితుండమువలెనున్న చేతి నాకంఠమందు జొనిపి
కలయ త్రిప్పగా కేశిదంతములు కదిలి విరిగిపోయె
లోపల వాయువు ఆడక అశ్వము ఊపిరి విడిచింది ॥రాజ
లీలామానుష విగ్రహుండగు గోపాలు లీలచూచి
పూలవానలను కురిపించారు భూమిపైన సురలు ॥రాజ॥

ఆ సమయంలో నారద మునీంద్రుడు వచ్చి, శ్రీకృష్ణా! నీవు —

నిప్పు కట్టెలోనున్న యట్లుగా నిఖిల భూతములలో
వ్యాపించుచు సృష్టి స్థితిలయముల వరుసగ చేయుదువు ॥మురళీ॥

స్వామీ! ఇంకా నీవు ఈ అవతారంలో -

ప్రజాపీడకుల రాక్షసాధముల పరిమార్చగవలయు
మురాసురుణ్ణీ నరకాసురునీ ముష్టిక దానవునీ
గజాసురుణ్ణీ వ్యోమాసురునీ కంసదూషకుణ్ణీ
శిశుపాలుణ్ణీ దంతవక్త్రునీ ఛేదింపగవలయు
పౌండ్రకాదులను చంపి భూమినీ పరిరక్షించాలి
కృష్ణా! నీ వొనరించు పనుల లెక్కించ నెవరితరము
దానవుతో పోరాడి తేవలయు పారిజాతపాదు
సాధించాలి శమంతకాన్ని సత్రాజితునుండి
కురుక్షేత్రమున దుష్టులనూ యమపురికి పంపవలయు
పార్థున కనిలో సారథి వగుచూ బలము కూర్చవలయు
॥చిత్తగించు॥

అని స్తుతించి నారదుడు వెళ్ళిపోయినాడు. కొన్నాళ్ళ తరువాత -

గోపబాలకులు రామకృష్ణులొక కొండదరికి చేరి
దాపునగల బీడున పశువులనూ మేపుకు విడిచారు ॥రాజ॥

వారంతా కలిసి —

గోవుల మనుచూ కొందరూ
గొ(ర్రెల మనుచూ కొందరూ
రాజుల మనుచూ కొందరూ
దొంగల మనుచూ కొందరూ

గోపకుమారులు అందరూ-పై కూడియాడిరీ ఆటలూ ।భళా।
భాగవతామృతపానమూ — భగవత్పద సోపానమూ

పిల్లలంతా కలిసి దొంగాట ఆడుకుందామనుకొని మొదలు పెట్టారు. అపుడు -

దొంగాటలొ వ్యోముండను దనుజుడు దూరెను మోసముగా
బాలుర తోడుత నాడుచుండె గోపాలుర రూపములో

ఇలా అడుకుంటూ -

ఆడుచు ఒక్కొక్క బాలుని చేకొని అచటి కొండగుహలో
దాచిపెట్టి ఒక రాతిని జరిపి దాని కడ్డుబెట్టి
చివరిమారు కేశవుని పట్టుకొన చేరె సమీపముకు
గమనించాడది కృష్ణుడు తనకా సమయము చిక్కెనని
శశముమీద లంఘించునట్టి పంచాననమ్ము వోలె
ఆ కిరాతకునిమీదికి ఎగిరీ దూకినాడు రాజా ॥రాజ॥

అలా దూకి ఏమన్నాడంటే కృష్ణుడు -

ఏరా! రాక్షస! మా గోపాలుర నెచట దాచినావూ
ఫలితమిదే దానికని పీకనూ నులిమి చంపినాడు

కొండగుహకు జని దానిని మూసిన బండను తొలగించీ
బంధితులగు బాలురను బయటికి పంపించెను రాజా ॥రాజ

కంసుని ఆదేశానుసారం బయలుదేరి -

అక్రూరుడు మధురాపురిలోనే ఆ రాత్రిని గడిపి
తెల్లవారుటకు ముందే మేల్కొని గొల్లపల్లెకేగె ॥రాజ

మార్గంలో వెళ్ళుతూ శ్రీహరిని ఇలా స్మరిస్తూ నడిచాడు -

ఏ మహనీయుడు లోపల వెలుపల నెల్లనిండినాడో
ఆ హరిపాద నఖప్రభ సోకభవాంధకార మణగు
ఎన్ని జన్మల పుణ్యఫలంబో ఈ జన్మమునందు
పరమాత్ముని నా కన్నుల చూచెడి భాగ్యము కలిగిందీ
కంసుని బోలిన సఖుడు భూమిపై గలడె వెదకి చూడ
పగతోనైనను పంపి నాకు సత్ఫలము గూర్చినాడు

కాని, శ్రీకృష్ణుడు నన్ను చూచి -

కంసుడీతనిని పంపినాడు నను హింసింపగదలచి
అతని స్నేహితుడు వీడని శ్రీహరి ఆగ్రహించునేమొ ॥మురళీ

కాని అలా కాగూడదు. ఎందుకనగా -

సర్వభూతములలో నివసించే జగన్నాథుడతడు
సుజను డీతడని గ్రహించి దయతో చూచి పలుకగలడు ”
మాపటివేళకువెళ్ళి శ్రీహరి శ్రీపాదములందు
సాగిలపడి దండమును పెట్టితే సంతోషిస్తాడు
చిరునవ్వుల చిందించు నోటితో చేర పిలువగలడు
అభయమిచ్చి దయతోడ కేశవుడు ఆదరించగలడు ।మురళీ।

ఇలా అక్రూరుడు ఆలోచించుకుంటూండగా రథం బృందావనం చేరింది. అప్పటికి సాయంకాలమయింది — అప్పుడు -

పచ్చికనూ కడుపారగమేసీ
యమునలోని తోయములను త్రావీ
కడుపులు బరువుగ కదలుచుండగా
హుంకరించుతూ రంకెలువేస్తూ
మందగమనమున వృషభరాజులూ బృంద కరుగుచుండె
కుండపొదుగుల గోవులమందను
చెంగున ఎగిరే చిన్ని దూడలను
పిల్లనగ్రోవిని చల్లగ నూదుచు
గోవులతోలే గోపబాలురను
అక్రూరుడు సంతోషముతోటీ ఆలోకించాడు
రథము నెమ్మదిగ వాటివెంబడీ కదలి నడుచుచుండె
ఆ బాటన పద్మాంకుశరేఖల అడుగులు చూచాడు
గోపాలుని పాదాల ముద్రలని గుర్తుపట్టినాడు
అక్రూరుడు తన రథాన్ని వెంటనె ఆపించెను రాజా
కమలనాభు పాదాల గుర్తులను కనుల కద్దుకొనుచు
కాలినడకతో నందునింటి ప్రాంగణము చేరినాడు
బలరాముని శ్రీకృష్ణుని చూచెను భవనము ముంగిటనే
దోసిలొగ్గి పాదాభివందనముచేసి పులకరించి
సంతోషంతో నిలిచినాడు ఆ జనార్దనుని యెదుట
కనులముందు నగల అతనిని కృష్ణుడు కౌగలించినాడు
బలరాముండక్రూరుని నింటిలోపలకు చేర్చినాడు
అర్ఘ్యపాద్యముల కృష్ణుడాతనిని అర్చించాడండీ
బలరాముడు ఆసనమును చూపి బాగోగులనరసి
మృష్టాన్నముతో అక్రూరుని సంతుష్టిపరచినాడు
విడియమునసగి విశ్రాంతికి చక్కని పడకనుసమకూర్చి
కూరుచున్న అక్రూరునితోటీ సారసాక్షుడనియె ॥రాజ

ఏమన్నాడంటే ?

చుట్టాలను స్నేహితులు మీరలూ సుఖముగ నున్నారా
వసుదేవుడు దేవకితో చెరలో బ్రతికేయున్నారా?
మాతో చెప్పుమటంచు వారలేమయిన చెప్పినారా?
కొడుకుల క్షేమము తెలిసుకవారూ కుములుతు ఉన్నారా?
ఇంతకు నీవూ వచ్చినకారణమేమొ చెప్పలేదు
అని శ్రీకృష్ణుడు నవ్వుతునాతని నడిగినాడు రాజా! ॥రాజ॥

అపుడు అక్రూరుడు ఇలా చెప్పాడు.

నలినాక్షా! ఒకనాడు మధురకూ నారదుడూ వచ్చి
కంసునితోటీ వివరముగా మీ కథను చెప్పినాడు
అంతటితో కోపించి కంసుడూ అగ్గివోలె మండి
వసుదేవుని దేవకిని చంపుటకు బయలుదేరినాడు
ఆపద్ధతి నీతికి విరుద్ధమని ఆపి వెడలె మౌని
నను పిలిపించీ కంసుడు చెప్పెను నారద భాషణము

తరువాత-

ధనుర్యాగ మొనరించెద ననుచూ తమకు చెప్పమనియె
దానిచూడ మిము తోడ్కొని రమ్మని తాను నన్ను పంపె-
గోపుల నుండీ కప్పము తెమ్మని భూపు డానతిచ్చె
నారాకకు కారణమిదియనుచూ నమస్కరింనాడు. ॥రాజ॥

అప్పుడు శ్రీకృష్ణుడు-

అక్కడ ఉన్నా నందుని గోపకు లందరినీ చూచి
విన్నారా అక్రూరుని మాటలు విశదముగా మీరు
తానుచేయు యాగమును చూడ నాహ్వాన మంపినాడు
మామకు మేమన నెంత ప్రేమయో మనము వెళ్ళవలెను
రిక్త హస్తముల రాజదర్శన మయుక్తమగును గాన

పాలు నేయి దధిభాండమ్ములతో బయలుదేరవలయు
ఆలశ్యంబయితే మధురాధిపు డాగ్రహించుతాడు
కృష్ణుడిట్లు అనగానే మధురానగరం వెళ్ళడానికి గోపజన కదిలింది:-

మధురకు బృందావనమును విడిచి మాధవుడేగునని
గోపకాంతలూ విని గుండెలలో తాపము చెందారు
పుండరీకనయనుండు లేక మన ముండజాలమనుచు
పెనుగాలికి తీగలవలె వారల మనసు లాగుచుండ
ఈ ప్రయాణమును ఆపుటెట్లాకో యేమిచేతుమనుచు
గుసగుసలాడిరి ఏకాంతముగా గోపగృహములందు ॥వా॥

వారు ఏమని రహస్యంగా ఆలోచించారంటే-

బ్రహ్మదేవుడే క్రూరచిత్తుడని భావింపవలయు
ప్రీతిపాత్రుని దూరపరచు యీ వ్రాత వ్రాయనేల
తానుగూడ సంసారి గదా ఇదితగునె ధర్మమగునే
వాణియైన తనభర్తకు చెప్పి వారింపగలేదా?

ఐననూ ఇంతకు-

ఎవరో రమ్మని చెప్పినంతనే ఈయన పోవలెనా?
ఏదో సాకును చెప్పి ఇచటనె ఎందుకుండరాదో
మనమంతా ఇట బాధపడెదమను మాట తలపవలదా
గోపవృద్ధులైనను యీ పయనము నాపనోపలేరా
అక్రూరుడు గాడు క్రూరుడెయితడటులెతోచు చుండె
అక్రూరుడె యైనచో మన కృష్ణుని అంపుకో పోతాడా
మాటలు చెప్పి కంస భూధవుని మనసు మార్చలేడా
జాలి గలుగునటు అక్రూరుని పాదాలు పట్టునా ॥మురళీ

అని కృష్ణుని స్మరిస్తూ-

మాధవ మమ్ముల రక్షింపుమయా మమ్ము పేపకయ్యా
నీ పాదాలకు మ్రొక్కుచుంటిమో నీరజాక్ష కృష్ణా ॥మురళీ

అంటూ-

కందర్ప జ్వరపీడితులై గోవిందుని తలచుకొని
కన్నుల నీ రొలకంగ వివశలై కొంత లేడ్చినారు

మరునాటి ఉదయమే కృష్ణుడు-

మరల వత్తునని తనతో వచ్చే మహిళల వారించి
అవుపాలు కట్నాలు కానుకలు అన్ని బండ్లకెత్తి
నందాదుల వెనువెంట గోపు లానందముతో రాగా
మధురకు జనె నక్రూరుడు తోలే రథమునెక్కి గౌరి ॥రాజ॥

ఆ సమయంలో గోపికలు

అదిగో కృష్ణుడు ప్రయాణమై అ యరదమెక్కినాడు
హయములు గిట్టలు చిమ్మిన దుమ్మూ అ దిక్కునలేచె
చూడుడంచు తమలోని ప్రేమతో సుందరాంగులంతా
కన్నుల కబ్బినయంత దూరమూ కదలక చూచారూ ॥రాజ॥

కొంత సేపటికి-

సాగిపోయినది యమున ఒడ్డుకూ చక్కగ నా రథమూ
అక్రూరుండొక చెట్టునీడ నా యరదమును నిలిపాడు

అపుడు బలరామకృష్ణులు—

రథమును దిగి యమునానదిలో నీ రమున గ్రోలి పిదప
రామకృష్ణులూ పూర్వము మాదిరి రథము నెక్కినారు ॥రాజ॥

తరువాత అక్రూరుడు గూడా-

స్నానముకై ఆ నదిలోనికి దిగి సంకల్పము చేసి
అఘమర్షణ సూక్తులతో స్నానము నాచరించినాడు
అర్ఘ్యమునీయగ దోసిట నీరము నందుకొనిన పిదప
ఆ నీరములో రామకృష్ణులను ఆలోకించాడు
నీరములోపలి కెటులవచ్చిరో వీరలంచు లేచి
జలమున రథమున రెండు స్థలాలను చరచర చూచాడు

రథము మీద చిరునవ్వులతో నా రామకృష్ణులుండ
జలములోన నటులే కన్పించుట చాల చిత్రమాయె ॥రాజ॥

అటూ ఇటూ చూస్తూ చోద్యముగా మరల నీటిలోనికి చూచాడు.

యమునానదిలో నాదిశేషు రూపమును చూచుచుండ
పాపరేనిపై నీలిమబ్బువలె పద్మనాభుడుండె
మెరపుతీగవలె లక్ష్మీ కేశవుని ఉరముమీదనుండె
నాభికమలమున చతుర్ముఖుండగు నలువ యాడుచుండె ॥రాజ॥

సప్త మహర్షులు సాధువిప్రులూ
సనక సనందన సనత్కుమారులు
రుద్రుడు దేవేంద్రాది యమరులు
ఉపనిషత్తులతో స్తుతులు చేయగా
ఆనందముతో పరవశించి, హరినక్రూరుడు గాంచె ॥తంధాన॥

శ్రీవత్సము కౌస్తుభ వనమాలలు
విరాజిల్లెడి విశాల వక్షము
శంఖ చక్రములు గదా పద్మములు
మెరయుచుండెడి నాలుగు చేతులు
గలిగి శోభిలెడి హరిన క్రూరుడు గాంచెజలమునందూ ॥తంధాన॥
బ్రహ్మసూత్ర కటి సూత్ర హారముల
కటక కంకణాల్ కేయూరాలతో
సుందర లక్షణ లక్షిత దేహుని
కిరీట కుండలధరు వరచేలుని
అజము విక్రముని హరి నిజలములో నక్రూరుడు గాంచె
॥తంధాన॥

ప్రహ్లాదుడు నారదుడు మొదలగు
భక్తులతోడను పరివేష్టించి

శ్రీపుష్టి తుష్టి కీర్తి కాంతలతో
విద్యావిద్యా శక్తిసేవితుని
ఆదిపురుషుని భక్తితోడ నాడక్రూరుడు గాంచె ॥తంధానతాన॥
గద్గద కంఠుండై పులకించి కరముల జోడించి

ఇలా స్తుతించాడు అక్రూరుడు -

రమాదేవి వక్షస్థలమందున రాజిల్లెడి దేవా! ॥మురళీలోలా॥
సుందరరూపా! సర్వజగజ్జన వందిత శుభపాదా!
సృష్టికి మొదలై సర్వజగాలకు స్రష్టయైనయట్టి
నలువ జనించెనుగద స్వామీ నీ నాభికమలమందు
దుర్మదాంధులను నాశముచేసీ ధర్మము స్థాపింప
యుగయుగాలలో నవతరింతువూ త్రిగుణాతీతుడవె
లోకబీజములు నిండియుండు నీలోన వాసుదేవా!
పుట్టుచుండు నవి పెరుగుచుండునూ గిట్టుచుండు స్వామీ!
నీదు మహిమనే నెరిగినాడనో నీరజాక్ష కృష్ణా
విశ్వవేత్తవూ ముక్తిదాతవూ శాశ్వతుండవయ్యా
వాయువు నీవే యముడవు నీవే వరుణుడవీవయ్యా
అగ్నివి నీవే చంద్రుడవూ జగదాధారుడవయ్యా
అంతట నిండిన నీ రూపమున కనంతవందనములూ
సారహీనమగు సంసారమనే చక్రములో చిక్కి
మరల పుట్టుతూ తిరిగి గిట్టుతూ తిరుగునట్టి నన్నూ
నీ దయామృతపు ధారల తోడ పునీతు చేయుమయ్యా!
॥చిత్తగింపుమా॥

అంటూ వేడుకోగా ఆ నదీజలంలో తన నారాయణ రూపం చూపి తృప్తి పరచాడు. కొంతసేపు తన్మయత్వంతో నిలిచి, తేరుకొని రథం దగ్గరికి రాగా కృష్ణుడు నవ్వి —

దగ్గరిలోనే యమున యుండెగద తడవుచేసితేల
స్నానముచేసి వచ్చుట కింతటి జా॥ుచేసితేల
ఆ జలమున నేమయిన అద్భుతాలాలోకించావా
ఈ లోకములో కాన్పించనివే మేమి చూచినావు ॥వినరా॥

అనగా అక్రూరుడిలా గన్నాడు —

నీలో నుండని చోద్యము లుండునె యే లోకములందు
నింగిని భూమిని గల యద్భుతములు నీలో గలవయ్యా ॥మురళీ

అన్నాడు అక్రూరుడు. తరువాత -

సాగిపోయినది రథము మధురకూ సాయంకాలముకూ
అప్పటికే నందాది ప్రముఖులూ అచటికి చేరారు
వారిని చూచీ రథము నాపె శ్రీవారిజలోచనుడూ
బలరామునితో దిగి అక్రూరుని పిలిచి యిట్లులనియె ॥రాజ॥

అక్రూరా! రథం తీసికొని వెళ్ళు. మేము నెమ్మదిగా వస్తాము అన్నాడు -

అపుడు అక్రూరుడు ఇలా గన్నాడు —

స్వామీ! యీనాటికి మా యింటికి తాము ప్రేమతోడ
తప్పక దయచేయుడు నా జన్మము ధన్యమందగలను
॥చిత్తగించు॥

అని వేడుకోగా శ్రీకృష్ణుడు -

మా వంశము నాశనము చేయగా మదిని తలచినట్టి
కంసుని ధ్వంసముచేసి మీ గృహము గాంచగలను సుమ్మీ ॥వినరా॥

వెళ్ళిరా అని అతనిని పంపించాడు, అక్రూరుడు రాజ భవనానికి వెళ్ళి :-

రామ కృష్ణులా వచ్చిన విషయం రాజుకు చెప్పాడు
సెలవును గైకొని అక్రూరుడు తన నిలయము చేరాడు ॥రాజ॥

నందాదులతో కలిసి రామకృష్ణులు మధురానగరంలోని

పేటలు మేడలు సౌధాల్ భవనాల్ కోటలు పరికిస్తూ
రాజవీధులకు ప్రక్కనగల ఆరామ సంపదలనూ
గజశాలలు గుర్రాల కొట్టములు కనులవిందుగొలుప
మధురానగరపు సౌందర్యానికి మదితో ముదమంది
సంధ్యారాగము అలముకొనిన ఆ సమయములో వారు
పూలవాసనలతోడ చల్లనీ గాలి వీచుచుండ
పట్టణవాసుల నరయుచు మెల్లగ పాదచారులగుచు
తల పంకించుచు రామకృష్ణులా దారిన నడిచారు ॥రాజ॥

ఇలా వీరు రాజమార్గంలో వెళ్ళుతుండగా—

మధురకు కృష్ణుడు వచ్చినాడనే మాట వినినయంత
నగర స్త్రీజన మాభరణాలను తగినరీతి దాల్చి
ఒక్కరి నొక్కరు పిలుచుకొనుచు కడు మక్కువతో గూడి
మేడలనెక్కి మిద్దెలనెక్కి మిట్టలపైకెక్కి
వెన్నుని చూచిరి ఆశ్చర్యముగా కన్నులప్పగించి
తమలో తాము కృష్ణుని చూచీ తర్కించిరి ఇటుల ॥రాజ॥

ఏమని తర్కించుకున్నారయ్యాంటే

పూతన ప్రాణాల్పీల్చినట్టి ఆ పురుషోత్తము డితడా?
నోటను భువనాల్ తల్లికి చూపిన మేటిపాప డితడా?
వెన్నముద్దలను దొంగచాటుగా తిన్న బాలుడితడా?
గోపకాంతలా మనసు హరించిన గోపాలుండితడా?
ఎన్ని జన్మల పుణ్యఫలంబో యీ బాలునివలన
నంద యశోదలు గోపకాంత లానందమందిరకట ॥రాజ॥

అనుకుంటూ సంతోషించారు. అప్పుడు-

అర్ఘ్య పాత్రలో పూవులు పండ్లూ అక్షతలుంచుకొని
వేదవిదులు పూజించిరి కృష్ణుని వేదోక్తముగాను

వారి వారి పూజలందుకొని బలరామకృష్ణులు—

చిరునవ్వుల చిందించుచు ముందుకు జరిగి నడచుచుండ
రాజవస్త్రములు చేతబట్టి ఒక రజకుడెదురు పడెను ॥రాజ॥

అప్పుడు శ్రీకృష్ణుడు ఆ చాకలికి ఎదురుగా అడ్డంగా నిలచి ఇలాగన్నాడు-

రాజుగారి చెల్లెలి పుత్రులమూ రజకా వినుమోయి
మామగారినీ చూచుట కొరకే మధురకు వచ్చితిమి
నీ చేతనుగల మేలివలువలను మాచేతికి నిమ్మా
వాటిని తొడిగే మేమిద్దరమూ కోటకేగుతాము

అని అడుగగా ఆ రజకుడు ఆవేశముతో-

వలువ లెవరివో నేనెవ్వరినో తెలిసి పలికినావా?
పాలు పెరుగు మీగడలు తెగదినీ బలిసి అడిగినావా?
బాలక ఇది మా రాజు విన్న నీ ప్రాణా లీస్తాడు.
వీటిపైన నీ చేయి పెట్టుటకు వీలులేదు పొమ్మా !

అనగానే కృష్ణుడు

చరచినాడు కరచేత రజకునీ శిరము పగులునట్లు
ఆ దెబ్బకు కుయ్యో మొర్రోయని అరచి నేలగూలె ॥రాజ॥

తరువాత-

అన్నదమ్ములిద్దరు తమ కప్పటి కవసరమైనవన్ని
మేలిమేలి వస్త్రాల నేరుకొని మేనికి తొడిగారు

ఇదంతా చూస్తున్న నేతపని వాడొకడు వచ్చి రామకృష్ణులతోటి-

తాను నేర్పుతో నేసిన బట్టలు ధరింపమని తెచ్చి
రామకృష్ణులకు కానుకగా నవి ప్రేమతోడనీయ
చిరునవ్వులతో వాటిని చూచి శ్రీకృష్ణుడు మెచ్చి
ఆ భక్తునకూ సర్వ సంపదలు అనుగ్రహించాడు ॥రాజ॥

ఇంకా కొంతదూరం నడచారు రామకృష్ణులు,

దారిలోన ఒక యింటిలోపల సుదాముడనెడివాడు
రాజ మందిరము కొరకు మాలలను రచన చేయుచుండె
బాలురిద్దరూ అతని యింటిలో కాలు పెట్టగానే
అర్ఘ్య పాద్యములు ఫలములు వారికి అర్పించెను రాజా
గుమగుమలాడే పరిమళాలతో గుబాళించునట్టి
పూలదండలను వేసి సోదరుల పూజించెను రాజా ॥రాజ॥

అసుదాముడు వారికి నమస్కరించి—

లోకరక్షణకు జన్మించిన మీ రాక మాకు శుభము
పావనమాయెను మాగేహము మీ పాదాలను మోప

అప్పుడు కృష్ణుడు తన అభయహస్తమును ఎత్తి

మెచ్చినాను నీ భక్తికి నేనూ వచ్చితి నందులకే
తప్పక కోపము వలయు కోర్కెల సుదామా యిచ్చెదను.

అనగా సుదాముడు వినయంగా తన చేతులు జోడించి—

కం. నీ పాద కమల సేవయు
నీ పాదార్చకులతోడి నెయ్యము నితాం
తాపార భూతదయయును
తాడసమందార నాకు దయ సేయగదే ॥

అని యర్థించే సుదాము కోరిక కటులే యగుననుచు
ఘన సంపదలను ఆసుదామునకు కలుగ చేసె శౌరి ॥రాజ॥

అచటనుండి రాజవీధిలోనికి అడుగుపెట్టేసరికి

నగలు రత్నహారములు తొడిగి చీనాంబరములు కట్టి
చందన పరిమళ సుగంధాలు తన శరీరమునకద్ది
మూడు వంకరల కుబ్జ కృష్ణునకు ముందు తారసిల్ల
ఆమె సమీపముకేగి కృష్ణుడి ట్లడిగినాడు రాజా ॥రాజ॥

ఏమని అడిగాడంటే

అమ్మాయీ! నీవెవ్వతు ఎచటికి అరుగుచుంటివమ్మా
ఈ చందనమూ పూలమాలలూ ఎవ్వరి కొరకమ్మా
చక్కని చుక్కవు నిన్నుబోలిన ఛాన యెందులేదు
చేకొని వెళ్ళే చందనాదులను మాకు నీయరావా?

అని పరిహాసాలాడేనరికి ఆ మరుగుజ్జు

చక్కని చిక్కని వాడవటంచూ సరసాలాడెదనా
సుందరాంగ నీ వంటి చక్కదన మెందు చూడలేదు
చారుశరీరా! త్రివక్ర యని నే పేరుబొందినాను
కంసుని దాసిని అలంకరణలో గలదు ప్రతిభ నాకు
మిమ్ముల జూడగ యీ హారాలను కమ్మని గంధముల
మీకివ్వాలని మనసుగలిగెనూ నాకు ముద్దు కృష్ణా! ॥చిత్తగించుమా

అనుచుండగానే కుబ్జ చేతితోగల సుగంధ ద్రవ్యా లందు కున్నాడు కృష్ణుడు-

కుబ్జను దగ్గరగా తీసికొనీ అబ్జనేత్రు డపుడే
దాని పాదములు తన పాదాలతొ ఊని త్రొక్కిపట్టి
సాగదీయుచూ రెండు చేతులా లాగి వదలగానే
వంకరలన్నీ పోయి అందమగు వనితగ మారిందీ ॥రాజ॥

రు వాత నెమ్మదిగా కంసుని ధనుశ్శాలలోనికి వెళ్లాడు
ృష్ణుడు-

ధనుశ్శాలలో నాలుగువంకలకు చని గమనించాడు
అనేక రకముల ఆయుధాలు గల వాయాగారములో
అన్నింట నొకవిల్లును చూచెను అద్భుతంబుగాను
శ్రీకృష్ణుడు దానిని ముట్టుటకై చేయి జాపినాడు
అచ్చట కావలివారు వద్దనీ అడ్డుపెట్టినారు
ముసి ముసి నవ్వులతో శ్రీకృష్ణుడు ముట్టి చేతబట్టె ॥రాజ॥

లా అందరు చూస్తూ ఉండగానే-

ఎడమచేతితో ఎత్తి నారినీ తొడగుచుండగానే
కరి తుండముచే మావి కొమ్మవలె విరిగిపోయె ధనువు
పెళ పెళ మంటూ చెవులు గింగురన పెద్ద శబ్దమాయె
కంసుని చెవి నాచప్పుడు దూరీ గడగడలా డించె ॥రాజ॥

ప్పుడు కంసభటులు

ధనువును విరిచిన ఆ బాలకునీ దండింపగదలచీ
కావలివారలు మీదికి రాగా గోవిందుడు చూచి
చిత్తు చిత్తుగా భటులనందరిని చితుక బాదినాడు
కోట ద్వారము లన్ని క్షేమముగ దాటి బయటపడియె ॥రాజ॥

ంతలో సంధ్యాకాలం సమీపించింది—

ఆకాశమనే అరణ్య మందున
అంధకారమను హస్తిని పట్టగ
కాల పురుషుడను బోయువాడొకడు
విహాతలో పన్నిన వలవలె
సూర్యుడు కన్పడె తన కిరణమ్ముల శోభతగ్గిపోయి ॥తంధాన॥
నడిమి వయసులోగల చంద్రునిపై
గగన సుందరికి మోజుపెరుగగా

దసిలిపోయిన ముసిలివాడనీ
పతిని దూరముగ త్రోసినట్లుగా
పడమటి కొండను విడిచి జారుతూ భానుడు దిగిపోయే ॥తంధాన॥
షోడశ కళలలో పూర్ణుడైనను
లక్ష్మిదేవికి సోదరుడైనను
హరుని శిరముపై అలరుచున్ననూ
చక్కని చుక్కల నాధుడైనను
పర పురుషుండగు శశిని చూడమని పన్నాల్ ముక్కుంచె ॥తం॥
పడతు లెల్లపుడు పాతివ్రత్యము పాటింతురు గాదా ”
హరికీరితి వారిధి తరగలపై
విరిసిన జల్లులవలె తారకలూ
గగన తలములో కనిపించినవీ
కస్తూరిని వెదజల్లినట్లుగా
చీకటు లెల్లెడ ముసిరి జగమునూ చీకాకును చేసె ॥తంధాన॥
జార చోరులకు భీతి గొల్పుటకు చంద్రుడుదయమందె
అంబర మంతట వెన్నెల పరునగ అల్లుకొనెనురాజా ॥రాజ॥

ఆ రాత్రి బలరామ కృష్ణులు మిగతా స్నేహితులతో భోజనాలు ముగించి కంసుని దుస్సంకల్పాలకు ప్రతీకారాన్ని ఆలోచిస్తూ అప్రమత్తులై ఉన్నారు-

మదురకు వచ్చి తన సేవకులను
మట్టు బెట్టిరట రామకృష్ణులూ
మహావీరులే కదలప్రజాలని
ధనువును లీలగ విరిచి నారట
అని విని కంసుని కన్నుల కసలే కునుకు పట్టలేదు ॥తంధాన॥
ఇంతేగాక-

విషాన్ని తానే మ్రింగినట్లుగా
పిశాచాల చుంబించినట్లుగా
దిగంబరుడై తిరిగినట్లుగా
గాడిదపై తానెక్కి నట్లుగా
ఎరుపు పూలదండలను వేసికొని తిరిగినట్లుగాను
కలలు వరుసగా రాగ విగ్గరగ కలవరించినాడు
చెవులు మూసికొని కూరుచున్ననూ
లోపలి ప్రాణాల్ గడ గడమంటూ
చలన ధ్వనులే వినబడకుండెను
అటు నిటు తిరుగుతు ఆలోచిస్తూ
జలమున తన ప్రతిబింబము చూడగ తలనుగానకుండె ॥తంధాన॥
ముక్కుచివర వ్రేల్పెట్టి చూడగా
ఒక్కచుక్క రెండై కాన్పించెను
తన నీడన బెజ్జముల చూచెనూ
అడుగుల జాడలు కనరాకుండెను
తరులు సువర్ణపు కాంతులీనుతూ మెరయుచటులతోచే ॥తంధాన॥
మరణ సూచకాలివి యనితోచగ మనసు చెదరిపోయె

కంసునికి నిద్ర పట్టడంలేదు. ఏదో చిన్నకునుకు పట్టిననూ—

పాడు కలలు ఎన్నెన్నోవచ్చి భయపెడుతున్నాయి
కష్టముగా ఆరాత్రి ఎట్లులో గడిపినాడు రాజా ॥రాజ॥

ఇంతలో తూరుపు తెల్లవారింది—

తారకలల్లో ఎరుపు వర్ణమూ తగ్గిపోయెనండీ
మిల మిల మెరిసే నక్షత్రాలూ వెలవెల పోయాయి.
చల్లని గాలులు కదిలియాడగా
చీకటి భయపడి పారిపోవగా

విరిసిన సారసముల తేనియకూ
తుమ్మెదలూ ఎగబడుతు చేరగా
ప్రపంచమంతా కుంకుమ ద్రవము పంచుచున్నయట్లు
ఆ రవి తూరుపు కొండమీదికీ బారెడు లేచాడు ॥తంధాన॥

అప్పటికే ధనుర్యాగ శాలలో సేవకులు—

మండపాన్ని సిద్ధము చేశారు మల్లయుద్ధమునకూ
ఎత్తు పల్లముల సర్ది సమయము గావించినారు నేల ॥రాజ॥
చల్లినారు కస్తూరీ జలమూ స్థలమంతట రాజా
తగినరీతిగా నలంకరించీ ధ్వజముల నిలిపారు
మంగళవాద్యా లొక్కుమ్మడిగా మారు మ్రోగెనండీ
కోలాహలముగ వచ్చిన జనులు కూడినారు రాజా ॥రాజ॥

అప్పుడు—

ఆ సమీపమున కంసరాజు సింహాసన మెక్కాడు
ఉండిరి మంత్రులు కంసభూపతికి రెండుప్రక్కలందు
నందుడు తన అనుచర గోపాలక బృందముతో వచ్చి
కంస దర్శనముచేసి తెచ్చిన కానుకలిచ్చాడు
ఆయన యనుమతితో నొక యాసన మలంకరించాడు
కళకళలాడుచు నా ప్రదేశము కానిపించె రాజా ॥రాజ॥

ఇంతలో—

ధరణిని కుంభస్థలి, నిల్పెడి దిక్కరులవంటి వారు
రం మందు చాణూర ముష్టికులు ప్రవేశించినారు

మల్లయుద్ధముకు సమయం సమీపించినట్లు దుందుభి మ్రోగింది—

ధ్వని వింటూనే కృష్ణుడు బలరామునితో లేచాడు
రంగస్థలమున కేగుచుండ ద్వారమున ఘీంకరిస్తూ

యముని చేతిదండమును బోలు తొండమును పైకిలేపి
తమ మీదికి పరుగులతో వచ్చే దంతిని చూచారు
అప్పుడు కృష్ణుడు
మావటివానిని సమీపించి యిటు మందలించినారు
దానిని ప్రక్కకు తప్పించమనీ వానిని కోరారు ॥రాజ॥
అలాకాకుండా-
కచ్చపట్టి ఆ గజమును మావయి రెచ్చగొట్టు నెడల
దానితోడ నిను గూడయముని సదనానికి పంపెదను ।వినరా।
అని శ్రీకృష్ణుడు చెప్పిననూ వినక -
మత్తగజాన్ని వారిమీదకూ మావటి ఉసిగొల్పి
ప్రళయకాలమున విజృంభించెడి పావకశిఖవోలె
ఆ కువలయాపీడమనే ఏనుగు -
గిరగిరవడిగా క్షీరాబ్ధిన మందరగిరివలె తిరిగి
పర్వతాలు తన ఘీంకారానికి పగులునట్లు చేసి
బుసబుగొట్టెడి కోడెత్రాచునూ బోలిన తొండమునూ
గోపాలుని మెడబట్టి చుట్టుటకు చాసెనయ్యా రాజా ॥రాజ॥
అప్పుడు శ్రీకృష్ణుడు —
ముంగుకజారే కురులను వెన్కకు ముడిచి కట్టినాడు
కాసెకోక బిగియంగకట్టి హుంకారము చేశాడు
గరుత్మంతుడూ త్రాచుపామునూ ఒరసి పట్టినట్లు
తొండముపట్టి గిరగిరత్రిప్పి దూరముగా విసిరె ।రాజ।
ఆ కువలయాపీడము—
మరలలేచి అది కుడియెడమలకూ తిరుగుతు వస్తుంటే
గజముపైకి సింగమువలె కృష్ణుడు కనలుచు దూకాడు

పిడుగుపాటువలె కుంభస్థలిపై పిడిగ్రుద్దును వేయ
చీలిపోయి అందున్న తెల్లముత్యాలు జారుచుండె
రక్తముతో ముత్యాలు తోడుగా రాలుచుండగాను
సంధ్యారాగమునందు తారక సరణి గోచరించె ॥రాజ

ఐనా అది ఘీంకరిస్తూ వచ్చి తన దంతాలతో కృష్ణుని కుమ్మబోయింది -

గోవిందుడది చూచినాడు - అపుడె
కుప్పించి లంఘించినాడు - కరిని
పడవేసి తన్నితొక్కాడు - దాని
దంతాలనూడ పెరికాడు — అరిచి
పిడిగుద్దులనుగుద్ది ప్రాణాలు తీశాడు
పడిన యేనుగు నొక్కప్రక్క పారేశాడు ॥ఓరామ జ
కరిదంతములు చేతబట్టి - ఎగిరి
కావలివాండ్ర బొడిచాడు - వారు
భళ్ళుమని రక్తమును కక్కి - అపుడె
పరలోకమున కేగినారు — ఉగ్ర
నరసింహుడై తాను కరిదంతములబట్టి
మల్లయుద్ధముచేయ మండపముకెక్కాడు ॥ఓరామ రాఘ
మంచి వస్త్రాలను కట్టి- పుష్ప
మాలికల మెడలోన దాల్చి — గొప్ప
మణి భూషణాదుల ధరించి - నడచు
బలరామ కృష్ణులను చూచి - జనులు
తన్మయత్వము తోడ తనును తామే మరచి
తమలోన తామిట్లు అనుకొనుచు నున్నారు ।ఓరామరాఘ

ఏమనుకుంటున్నారయ్యాంటే -

ఏడాది నిండనీ నాడే - పాపి
పూతనను మట్టుబెట్టాడు - రక్క-
సుని బకాసురని చంపాడు - దుష్ట
వత్సాసురుని చెండినాడు- మరియు
వ్యోమకేశి దానవుల సంహరించాడు
గోవర్ధనాద్రినీ కేలనే యెత్తాడు ॥ఓరామరాఘవా॥

ఇంకనూ -

కాళీయు మర్దనముచేసీ-మండు
దావానలము మ్రింగినాడు-ఇట్టి
బలశాలి ఎందయినగలడా- ఇతని
బాలుడని భావింపరాదూ - అనుచు
ప్రజలలో గుసగుసలు బయలుదేరీ అచట
గోపాలకృష్ణునీ కొనియాడుచున్నారు ॥ఓరామ॥

ఆ సమయాన చాణూరుడు బలరామకృష్ణుల వద్దకు వచ్చి -

గోవులను మేపుకొను గొల్లపిల్లలతోడ
కుస్తీలు పట్టెడీ కుర్రకుంకను చూచి
వెర్రి యాదవులు నిను వేమారు పొగడగా
మల్లవీరుడవనీ మారాజు పిలిచెనా? ఓ రామ॥
ఎల్లజనులకు నిచట ఉల్లాసమును గొల్ప
కొంతకాలం బిచట సంతోషముగ, మనము
ఆడుకుందాము నీతోడనా యుద్ధము
చిన్నవాడవు నీకు చెప్పితివి ముందుగా ॥ఓ రామ॥
కవచమయినా తొడగలేదే- నీవు
చేతియుద్ధము చేయగలవా-లేక

సాముచేసీ చూపుతావా-కాక
పాలు పెరుగు త్రాగుతావా- అనుచు
బాలకృష్ణుని చూచి పరిహాసములనాడె
చావు దగ్గరబడ్డ చాణూర రాక్షసుడు ॥ఓ రామ॥

సురరాజు వజ్రాయుధానివా-లేక
యమరాజు చేతి దండానివా - కాక
పరమేశు ఫాలనేత్రానివా- పోని
హరి చేతిలోని చక్రానివా- అయ్యో
గుద్దులున్నవి వెన్నముద్ద లిచ్చుటలేవు
కాచుకొమ్మని చెప్పె వాచాలతను చూపి ॥ఓ రామ॥

అపుడు శ్రీకృష్ణుడు చాణూరునితో ఇలా గన్నాడు -

చేతిబలమే లేని వారమూ - మేము
సాము చేయుట కసలె నేరమూ - మీ
రాజు బహుమానాల కోరమూ - వచ్చి
మిముచూచి వెనుకకూ పారమూ-అయయొ
వజ్రదేహులు మల్లయుద్ధ ప్రవీణులగు
మీ ముందు నిలచుటకు మేము చాలముకదా ॥ఓరామ॥

ఆటలంటే మాకుఇష్టమూ - మల్ల
యుద్ధమంటే మాకు కష్టమూ - ఏదో
నీతోటిఆడుటే స్పష్టమూ - ఇపుడు
ఆటమానితె ఎంతో నష్టమూ - ఓయి
నీతోటి నాచేయి కలిపెదను మాయన్న
బలరాముడూ ముష్టికుని చేయి కలుపునూ ॥ఓరామ॥

వెంటనే -

చాణూరుడు హుంకారముచేసీ జబ్బ చరిచినాడు
ఏరా! బాలా! నాతో పోరుట కెంత సాహసమురా

పరమశివుడె నా యెదుట నిలువక పారిపోయెనోయి
ఎరిగియున్నచో నా శక్తిని నీ విట్లు వాగుతావా
ఎవ్వడైన నాతోటి పోరుటకు ఎదురుపడిన యెడల
అట్టి మదాంధునిపట్టి యమునికీ అప్పచెప్పుతాను
నీవే శ్రీహరివైతే బహుశః కావచ్చునోయేమొ
వైకుంఠము కాదిది మథురయనీ నీకు తెలియదేమొ
నీ నామము జపియించు భక్తులిట కానరారుసుమ్మా
కంసరాజు ఆస్థానం బిడియని గ్రహింపవలెనోయి
నారద వీణాగానం బిచ్చట దూరదు నీ చెవిలో
జబ్బలు చరినీ సవాలుచేసే చప్పుడె వినిపించు
రమాదేవితో ప్రణయం కాదిదిసుమా పొగరుబోతా
చాణూరునితో మల్లయుద్ధమున చావుదెబ్బ తినకు
విలాసమ్ముగా తిరుగ నుపనిషద్వీథులు కావిచట
మల్లయుద్ధముకు సిద్ధము చేసిన మండపమిది సుమ్మా
తంధనానె తంధాన తంధనా తంధనానతానా

అంటూ చాణూరుడు -

నిప్పురవ్వలు కక్కినాడు — భళిభళి
ఫెళ్ళనా తొడ చరిచినాడు ”
భుజములను అప్పళించాడు ”
కోరమీసము దువ్వినాడు ”

అడుగడుగుకూ భూమి దడదడా అదరుతూ
వణకిపోతూ౦డగా వచ్చె మండపమెక్క ॥ఓరామ రాఘవా॥

మల్లయుద్ధం ప్రారంభమైంది -

జోడు కోడెలూ తలబువంచి పోరాడ వచ్చినట్లు
రెండు కుపిత సింహములు ఎదురుపడి రెచ్చి దూకునట్లు
కొండగుండ్లు ఒకదాని నొక్కటీ కొట్టుకున్నయట్లు
మదమాతంగము మత్తగజముతో మార్కొడ్డినయట్లు

ఒకరిచేతి నింకొకరుబట్టి యుద్ధోత్సాహముతోడ
కాలు కాలు మెలివేసి బిగించి కావేశముతోడ
పళ్లు బిగించి పిడికిలిపట్టి ప్రక్క జరుగుచుండ
పడలు పెంచి కృష్ణుడు చాణూరుని పడవేసెను ధరపై ॥వినరా॥

క్రిందబడిన చాణూరుడు -

ఒడలు దులుపుకొని లేచి వాడు కళ్ళురిమిచూచినాడు
ఓరీ! బాలక కాచుకొమ్ము నీ యూపిరి తీసెదను ॥వినరా

అంటూ చాణూరుడు -

పద్మనాభు పాదము మెలిత్రిప్పగ ప్రయత్నించినాడు
ఒడుపుతిప్పగా హరి చాణూరుని పుడమిని పడగొట్టె
నేలబడిన చాణూరుడు దెబ్బకు నెత్తురు కక్కాడు
వాసుదేవుడూ చెంగున యెగిరీ వానిమీద దూకి
కంఠసీమనూ బిగ్గరగా తన కాళ్ళతోడచుట్టి
రెండు కుదుపులూ కుదిపి పిడికిటను గుండెమీద బాది
వాని మెడను గట్టిగ బిగబట్టి వంచి మలిపినాడు
ఒకరి మెడను ఇంకొకరు వంచుతూ మకరిపట్టుబట్టి
పోరుసల్పి చాణూరుని కృష్ణుడు భూమిమీద విసిరె
ధరపైబడి చాణూరుడు హాయని మరణము చెందాడు ॥రాజ॥

మరో ప్రక్కన -

బలరాముడు ముష్టికుని మీదబడి ఇలపై పడవేసి
గట్టిగాను కాలితో తన్నగా చుట్టి కరచినాడు

అంతలో —

వాని అనుచరులు మీదికిరాగా వనజాక్షుడు చూచి
వారిని గూడా యమసదనానికి వరుసగ పంపాడు ।రాజ।

అచటి సభలోని వారు రామకృష్ణుల పరాక్రమము
చూచి —

బ్రాహ్మణులంతా లోలోపలనే పలికిరి దీవనలూ
సాధుహృదయు లదిచూచి ఎంతయో సంతోషించారు

అచటి నారీమణులు శ్రీకృష్ణుని సౌందర్యాన్ని చూచి ఒక్కొక్కరు ఇలా అనుకున్నారు —

పాట

(ఒక స్త్రీ) ఎంత అందగాడో ఇతడు ఇంతీ చూడవే
అంత సుందరాంగు డెవరిసొంత మగునకే ॥ఎంత
(మరో సుందరి) వెదురుబొంగుగా పుట్టిన వేణునాదమనే
సదయుడైన వానియొక్క పెదవి తాకునే ”
(ఇంకో అంగన) నెమలిఫించమై జనింప నేరనైతినే- నేడు
కమలనయను శిరముమీద కలిసియుండునే ”
(మరొక అబల) పట్టుదారమై ధరపై పుట్టనైతినే-ఇపుడు
కట్టెడి పుట్టములో నొకటై పట్టియుండునే ”
(మరియొక పడతి) పూలమాలనై నేను పొందలనైతినే-ఎప్పుడు
బాలకృష్ణునీ మెడలో వాలియుండునే ”
(ఇంకో లలన) బృందావన తరుజన్మల నందమైతివే—ఇపుడు
ఆటలు మనచెంత నతడు ఆడుచుండునే ।ఎంత॥

చాణూర ముష్టికులు రామకృష్ణుల చేతిలో మరణించిన తరువాత -

కంసుని వర్గములోన ఎంతయో కలకల మేర్పడుట
గమనించిన కంసుడు కోపంతో కన్నులెర్రచేసి
పటపట పండ్లను కొరకుచు భూమిని పాదముతో తన్ని
ఉగ్రమూర్తియై మంత్రుల చూచీ ఉరిమి పలికినాడు ॥రాజ

ఏమన్నాడంటే —

ఈ బాలకుల తరిమికొట్టుడీ - తరువాత
నందునిపట్టి బంధించుడీ - తదుపరి

వసుదేవుని చంపివేయుడీ - ఆ పిదప
ఉగ్రసేనుని చెరను త్రోయుడే - అనుచు
ఆర్భాటముగ కంసు డటు నిటూ తిరుగుతూ
కత్తిపట్టీ గొంతునెత్తి యాజ్ఞాపించె ॥ఓ రామ రాఘవా॥
గోపాలుడది వినుచు నవ్వుతూ - తమరి
కోపాలు ఇక సాగబోవయా - తమరి
పాపాలు నేటితో ముగిసెనూ — కాన
నీ పాలి మృత్యువును నేనయా - మామ
ఆరిపోయే దీప మధికమై వెలుగురా
ఓరి క్రేలకు యమద్వారమును చూపింతు ॥ఓరామ॥

అంటూ -

కరిమీద దూకేటి హరివలె - లేచి
కంసునిమీద దూకాడు — ఆతని
జుట్టు తనచేత బట్టాడు - వాణ్ణి
నేలపై విసిరికొట్టాడు - అంత
కంసునీ ప్రాణాలు గాలిలో కలిశాయి
హాహాలు ఓహోలు అంతటా నిండాయి ॥ఓ రామ॥

తరువాత -

కంసుని సోదరు లదిగని కృష్ణుని కడకు దూకినారు
నీరజాక్షుడూ పరిఘాయుధమున వారిని చంపాడు
ఆ దృశ్యం తిలకించు నారదుడు అంతరిక్షమందు
కృష్ణుని మహిమల లీలలనూ సంకీర్తన చేశాడు ।రాజ।

అప్పుడు కంసుని భార్యలు గోలుగోలున విలపిస్తూ భర్త దేహం మీదపడి -

పాట

ఓ ప్రాణనాథా కంసరాజా !
మమ్ము విడిచీ వెళ్ళిపోయ్యావా !

భూతకోటిని హింసబెట్టి
పాతకాలను మూటగట్టిన
భూతద్రోహికి చేదుఫలము రాదా ॥ఓ ప్రాణ।
గోపబాలుని సామాన్యుడనీ
పాప దానవుల నెంతోమందిని
రేపల్లియకూ చంపబంపలేదా ॥ఓ ప్రాణ।
నీవు పంపినా రాక్షసులంతా
నిమిషములోనే అతని చేతిలో
నిలువున ప్రాణాల్వదిలి చావలేదా ।ఓ ప్రాణ।
అన్ని యెరిగిన వాడవు నీవే
అగ్నిలోపల దూకినావు
అహంకారమే ఇంతకు తెచ్చిందా ।ఓ ప్రాణ।
గోపాలకునీ శరణు వేడితే
పాపాలను మన్నించకుండునా
మాకీ వ్రాతలు తప్పియుండుగాదా ॥ఓ ప్రాణ॥
ఎవరికర్మ వారనుభవించకా
ఎప్పటికయినా తప్పిపోవదూ
పాపపుణ్యముల ఫలము తప్పుతుందా ॥ఓ ప్రాణ॥

అప్పుడు శ్రీకృష్ణుడు-
కన్నీటిని మున్నీరు చేసికొను కాంతల దరిచేరి
సాంత్వవచనములు పలికి వారినీ శాంతపరచినాడు ॥రాజ॥

అప్పుడు శ్రీకృష్ణుడు -
చచ్చిన వారికి దహనక్రియలను
జరిపించమనీ యాజ్ఞాపించెను
దేవకినీ వసుదేవుని అపుడే
చెరనుండీ విడిపించి కలిసెనూ

బలరామునితో కూడి వారికి ప్రణామములు చేసి
కలకలలాడే చిరునవ్వులతో నిలిచినాడు ఎదుట ॥రాజ॥

అపుడు దేవకీ వసుదేవులు తమలో -

కొడుకులు కాదూ వీరు లోకముల నడిపించెడివారు
ధరపై కారణజన్ములటంచూ ధ్యానిస్తున్నారు ॥రాజ॥

అపుడు శ్రీకృష్ణుడు తన యొక్క -

మాయను కప్పి సామాన్యునిగా మందలించినాడు
చేతులు చాచీ తల్లిదండ్రులూ చేరతీసికొనిరి ॥రాజ॥

తరువాత గోపాలుడు వారితో ఇలా గన్నాడు -

కష్టాలెన్నో భరించి మమ్ముల కన్నారేగానీ
చంక నెత్తుకొని ఆనందంతో చన్ను గుడుపలేదు
బాలలీలలూ ఆటపాటలూ పరికింపగ లేదు
చుంచు దువ్వి మీ పిల్లలనూ లాలించి పెంచలేదు
పసిబిడ్డల రొదవినే భాగ్యమూ పట్టలేదు మీకు
మాకువలసినవి తెచ్చిపెట్టెడి మమత నోచలేదు

కారణాంతరములచేత మీకు మేము దూరపడవలసి వచ్చింది-
కాని -

పురుషార్థము సాధింపగ దేహము నరునకు కావాలి
దాని నిమిత్తమై మీరు మాకు యీ తనువు నిచ్చినారు
తల్లితండ్రుల ఋణము దీర్పగా తరము గాదెవరికీ
వారి సుఖంకై తమ సర్వస్వముల ధారవోయవలయు
అట్లు చేయనివారు బ్రతికినను గిట్టినట్టివారే
వాని బ్రతుకు నీచాతినీచమై వరలుచుండుగాదా !

కాబట్టి మా వలన మీరు —

కంసుని కారాగారమునందున కష్టాల్పడ్డారు
కాపాడగ జాలిన మేము వృథా కాలం గడిపాము

పెద్దలు మీరూ క్షమింపవలె మా పిల్లల తప్పులను
అని పలికే కొడుకులను పితరులూ ఆప్యాయత తోడ
కనులవెంట ప్రేమాశ్రువు లొలుకగ కౌగలించుకొనుచు
అంకముపై కూర్చుండ బెట్టుకొని ఆనందించారు ॥రాజ॥

ఇలాగా తల్లిదండ్రులను కొంతసేపు సంతోషింపచేసి —

తాతగారి కడకేగి వారికితగ నమస్కరించీ
కుశల వార్తలను ఆరోగ్యమునూ గూర్చి అడిగినారు ॥రాజ॥

తరువాత వారు ఆ ఉగ్రసేన మహారాజుతో ఇలా గన్నాడు కృష్ణుడు -

యయాతిభూపతి శాపమువలన యదువంశీయులకు
సింహాసనమును ఎక్కే అర్హత సిద్ధించదుగాన
ఆలసింపక తమరే దానిని అధిష్ఠించుడయ్యా
తామే యీ రాజ్యము పాలింపగ తగినవారు తాతా! ॥భాగవ॥

అని తాతగారిని ఒప్పించి -

ఉగ్రసేను పట్టాభిషేకమును ఊరంతట చాటి
శాస్త్రోక్తముగా విప్రులచేతను జరిపించెను రాజా ॥రాజ॥
కంసుడు పెట్టే హింస భరించక కాందిశీకులగుచు
విదేశాలకూ కంసుని భయమున వెళ్ళిన బంధువుల
యాదవభోజ దశార్హ వృష్ణి కుకురాంధక ప్రముఖులను
రావించుచు వారికి తగువసతులు కావించెను తిరిగి ॥రాజ॥

అప్పుడు —

మధుసూదనునీ కరుణచేతనా మధురానగరంలో
శాంతియుతముగా నిత్యజీవితము సాగించిరి ప్రజలు ॥రాజ॥

అలా రోజులు సుఖంగా గడుస్తూండగా, ఒకనాడు కృష్ణుడు నందుని సమీపించి-

తమకు జనించని బిడ్డల నెవ్వరు తమ సంతతి వోలె
మక్కువతో లాలించి పెంచు వారెక్కడ గలరయ్యా
మీరే మా తలిదండ్రులనుకొని మీ పాలనలోన
కన్నది యెవరో తెలియకుండనే కాలము గడిపాము

ఇంకా మీరు మీ పల్లెకు వెళ్ళి అచ్చటి -

వారందరు ముదమంద మా కథలు మీరు తెలుపుడయ్యా
అనుచు రత్నహారములు నూత్న వస్త్రముల నిచ్చిపంపె ।రాజ।

తరువాత వసుదేవుడు —

వడుగు చేయుటకు తన కుమారులకు వయసువచ్చె ననుచు
చంద్రవంశరాజుల పరంపరాచారాలనుబట్టి
గర్గుడాదిగాగల సద్బ్రాహ్మణ వర్గమ్ములచేత
శాస్త్రోక్తముగా ఉపనయనాలను జరిపించెను రాజా! ।రాజ।

ఆ ఉపనయన సందర్భమున -

గాయత్రీ బ్రహ్మోపదేశముల గర్గుడు చేశాడు
వసుదేవుండా గర్గమహర్షికి వలసిన విచ్చాడు
సద్బ్రాహ్మణులకు గోహిరణ్యములు సమర్పించినాడు
ప్రజలందరికీ అన్నవస్త్రములు పంచిపెట్టినాడు ॥రాజ॥

తరువాత -

సర్వము నెరిగిన రామకృష్ణులూ
వినయముతో శుశ్రూష లొనర్చి
గురుసన్నిధి విద్యల సాధించుట
పరమ ధర్మమని తలచి వెంటనే
కాశీతీరము నందవంతిపుర గ్రామము కేగారు ॥తంధాన॥

అక్కడ -

సకల విద్యలను చదివినవాడు
బ్రహ్మతేజమున వెలిగెడివాడు

మహాతపస్వీ మహిమాన్వితుడూ
భూతదయాపరుడగు బ్రాహ్మణుడు
సాందీపనియను మునీశ్వరుని యాశ్రమము చేరినారు
ఆ మహనీయుని శుశ్రూషించి ఆశీస్సుల గొనుచు

పా ట

చదివినారు బలరామకృష్ణులూ - సాందీపని
సదనమందు వేదాలూ సాంగోపాంగముగాను ॥చదివినారు॥
తర్కశాస్త్ర ధనుర్వేద తంత్రములను దర్శనముల
మనుస్మృతిని రాజనీతియును న్యాయము మొదలగునవి
అరువది నాలుగు విద్యల నాశ్చర్యము గొలుపునట్లు
అరువదినాల్గు దినాలలో అద్భుతముగ సాధించి ।చదివి।
గురువులకెల్లను గురులై కొమరొప్పెడి జగద్గురులు
గురుశిష్య న్యాయముగా కొలిచిరి సాందీపగురుని
పెద్దవారి ననుసరించి కొద్దివారు నడవాలని
ధరణిహితార్థము కాలము గురుకులమున గడపుకొనుచు ॥చదివి॥

అప్పుడు -

సాందీపని శిష్యులతో పలికెనూ- దీని
సాధింపగ మీరే కడుసమర్థులని, తలిచానని ॥సాందీపని॥
విద్యలన్ని పూర్తిచేసి వినయముగా మసలినారు
కరచిన చదువులకు మీరు గురుదక్షిణ నివ్వాలి
పరమపురుషులగు మీకీ ధరణి నసాధ్యంబులేదు
నాకు ముదము గూర్చుటయె మీకు ముఖ్యమగు నటంచు
॥సాందీపని॥
దోసమేమొ నా కొడుకు ప్రభాసతీర్థమందున దిగి
స్నానమాడుచుండ మునిగె కానరైతి తిరిగి వాని

మీర లతని తెచ్చుటలో శూరత్వము గలవారలు
గురుదక్షిణగా కొడుకును సరగున తెమ్మని ఇమ్మని ॥సాందీపని॥
గురువుగారి అనుమతితో -

పాట

బలరామకృష్ణులపుడె కదిలిరీ - వారి
గురువుగారి యానతినీ శిరమునందు ధరించుతూ ॥బలరామ॥
గురుచరణ సరోరుహముల గూర్చి వందనము చేసీ
ఆయన ఆశీర్వాదములంది బయలుదేరారు
రథమునెక్కి- సాగరతీరమునుచేరి పలికినారు
సాగర! మారాడకుండ మా గురుపుత్రుని ఇమ్మని
పలికినారు బలరామకృష్ణులూ - లేనిచో
బాణాగ్నిని నిన్నిపుడే భస్మము చేయుదుమంటూ ॥పలికినారు॥
బలరామకృష్ణులట్లు పలుకుట విని సాగరుడూ
భీతిచెంది వణకుచు తన చేతులు జోడించి పలికె
స్వామీ తమ గురుపుత్రుని పంచజనుడు గొనిపోయెను
నా గర్భములోన దాగినాడు వాడు మహనీయా
అనిన వెంటనే -

సంధించెను శ్రీకృష్ణుడు శరమునూ - పంచ
జనుని పొట్టచీల్చెగాని సాందీపని కొడుకులేడు ॥సంధించెను॥
దానిలోన శంఖమొకటి కానిపించె వారలకు
ఆ శంఖమె పాంచజన్యమను పేరిట బరగె దాని
ఖూని యముని ద్వారముకడ ధ్వానము గావింప యముడు
కోపముతో దూకివచ్చి గోవిందుని చూచి తగ్గె
వినరయ్యా శ్రీకృష్ణుని లీలలూ— వీటి
విన్నవారి పాపాలూ వెనువెంటనే కాలిపోవు ॥వినరయ్యా॥

అప్పుడే యముడు ఇలా గన్నాడు —

దేవా ననుమన్నించుమడి కరుణతో- మీ
పాదధూళి నా శిరమున భక్తితోడ ధరియింతును ।దేవా।
లీలామానుష రూపులు తామనినే తెలియలేక
కోపముతో వచ్చిన నా పాపము దూరము చేయుడు
స్వామీ తమరిచ్చటికి చనుదెంచిన కతమేమో
సెలవిండని హరిని జముడు చేతులు జోడించి యడిగె ॥వినర॥

అప్పుడు గోవిందుడు -

చెప్పెద మా గురునందను నిప్పుడే- మాకు
అప్పగించి మా మెప్పుల నందుమోయి-సమవర్తీ ।చెప్పెదనూ।
అనగా విని జముడు వాని నప్పుడె తెప్పించినాడు
గురునందను నిపుడె మీరు గొంపొండని ఇచ్చినాడు
వానినిగొని సాందీపని వద్దకేగి సమర్పించి
ఏమి ఇంక చేయవలెనొ ఆనతీయుమని పలికిరి ॥వినరయ్యా॥

అప్పుడు బలరామకృష్ణులతో ఇలా గన్నాడు సాందీపని —

చచ్చిన కొడుకును తిరిగి చ్చటికి తెచ్చియిచ్చినాడు ॥తంధానతానా॥
గురువు కోరిన దక్షిణనిచ్చిన కరుణామయులయ్యా ”
మేలుచేసిన మీ యశమ్ము లోకాల నిండుగాక ”
అని దీవించిన సాందీపని యాజ్ఞను పొందినవారై ”
రథమునెక్కి మధురానగరానికి రయమున నేగారు ”
అచటి జనులు శ్రీకృష్ణుని జూచి ఆనందించారు ॥తంధానతానా॥

కొంతకాలం జరిగిన తరువాత ఒకనాడు కృష్ణుడు ఉద్ధవుని పిలిచి ఇలా గన్నాడు -

అమరగురునితో సమముగువాడవు
స్థిరచిత్తుడవూ ధీవిశాలుడవు

కులపెద్దలు నినుతలచి మెచ్చెదరు
వృష్ణి వంశముకు ప్రేమపాత్రుడవు
మంచి పేరుగల నిను పనికై రప్పించితి నుద్ధవుడా ।తంధాన।
నా సందేశము గొంపోపలయును నందవ్రజమునకు ”

అనగా ఉద్ధవుడు తలవంచి —

అభిమానముతో తమ పనికై నను ఆదేశించారు
చేయదగినపని యేదో నాకు సెలవీయుడు స్వామీ ”

అనగా గోవిందుడిలా గన్నాడు -

గోపభామలా నందవ్రజమున పాపము నా కొరకు
రేపుమాపు నలుదిక్కులి వెదకుచు చూపులట్టై నిలిపి
స్మరణ చేతురూ ఎల్లవేళలా సంసారాల్మరచి
ఇంతకాలమూ నా వియోగమును ఎట్లు భరించారో
ఆశ్రిత రక్షణ మొనరించుట నాయభిమతంబుగాన
త్వరలో వచ్చెదనని గోవ్రజమున కరిగి తెలుపుమయ్యా ।వినరా।

అని ఉద్ధవుని చేతిని తన చేతితో పట్టుకొని నడిపించుతూ రథం ఎక్కించాడు —

సాయంత్రానికి నందవ్రజమునకు సాగిపోయె రథము
వచ్చిన ఉద్దవునకు స్వాగతమును పలికిరి యాదవులు ।రాజ।

తరువాత -

నందు డాతనిని కౌగలించి యానందమందినాడు
చిరకాలమునకు కలిసిన మిత్రుని మరువగలరె బుధులు ॥రాజ॥

తరువాత నందుడు ఉద్ధవుని తృప్తిగా భుజింపచేసి ఇలా గన్నాడు-

నిన్ను చూడగా కృష్ణుడెదురుగానున్న యట్లుండె
మధురలోని జనులందరు కంసుని మరణము తరువాత

శాంతి సుఖాలను గలిగి జీవనము సాగిస్తున్నారా
కొడుకులతో వసుదేవుడు ముదమును వడయుచున్నాడా ?
అని శ్రీకృష్ణుని లీలలు తలచుచు కనుల నీరునింపి
తుడుచుకొనుచు డగ్గుత్తికతోడను అడిగెను ఉద్ధవుని ॥రాజ॥
ఉద్ధవా! మా చిన్నికృష్ణునికి ఎప్పుడైనా -
గోపభామినులు గోపాలకులూ గుర్తుకువస్తారా
ఆ గోపాలుడు ఎప్పుడు మమ్ముల ననుగ్రహిస్తాడు
చిరునవ్వుల జల్లుల మామీదట కురిపించే దెపుడు
పంకజనయనుని ముఖభాసుని మేమింక చూచు టెపుడు? ।వినరా।
ఇలాచెబుతూ నందుడు బాధపడుతుండగా -
తన పెనిమిటి తన బిడ్డని గుణముల వినిపించ యశోద
చనుల మొనలలో పాలుపొంగగా కనుల నీరుగార్చె ॥రాజ॥
అపుడు ఉద్ధవుడు అన్నాడు —
వస్తున్నాడు మిమ్ముచూడగా వాసుదేవు డిటకు
మనమున వగవకు డనుచుచెప్పె నాజననీ జనకులకు ॥రాజ॥
ఓయీ! నందరాజా -
రామకృష్ణులను మానవులని యనరాదు లోకములను
రక్షించుటకూ దుష్టులబట్టి శిక్షించుట కొరకు
అచ్యుతాంశతో భూమిపైన వా రవతరించినారు
తొలిచేసిన మీ పుణ్యము వారిని కలిసి మెలగజేసె ॥వినరా॥
అంతేగాక ఆ స్వామి -
అంతర్గతముగ కట్టెలలోపల అగ్ని నిండినటుల
ప్రాణికోటిలో నిండినట్టియా పరమాత్మం డతడు ॥వినరా॥
అలాంటి ప్రభువును -
ధ్యానించుటచే మీ యీ జన్మలు ధన్యత చెందాయి
సర్వేశ్వరు డాతనికి మిత్రులూ శత్రులెవరులేరు

మరణకాలమున అతని నామమును స్మరణచేయు నెడల
అనాయాసముగ దేహము వదిలీ అతని పొందుతారు

అని శ్రీమన్నారాయణుని గుణకీర్తనం చేస్తూ వుండగా చాలా రాత్రి గడచిపోయింది. అంతా హాయిగా నిద్రించారు -

దధిమథించు చప్పుళ్ళువిని యుద్ధవుడు మేలుకొనుచు
కాలకృత్యములదీర్చి భాస్కరుని గాంచి ఉపాసించి
హరిగుణ జాల ధ్యానించుచుండె నొక తరుమూలమునందు
ఆ సమయములో గోపభామినులు అచటి గూడినారు ॥రాజ॥

ఉద్ధవుని చూచి ఇలా అనుకున్నారు -

సుందరమగు వదనారవిందుడై శోభిల్లెడి ఇతడు
రాజవంశజుడు మన కృష్ణునివలె రాజిల్లుచునుండె ।మురళి।

అనుకుంటూ గోపికలు ఉద్ధవుని దగ్గరగా వెళ్ళారు - ఇలా అన్నారు -

మా కృష్ణుని స్నేహితులు మీరనే మాట నెరిగినాము
ఆయన తలిదండ్రుల క్షేమము మీ రరయ వచ్చినారా !
వారినైన గుర్తుంచుకునెను ఆ నీరజాక్షుడకట
మిగిలిన వారలగోడు ఆయనకు తగదని యెంచాడు
మధువును త్రాగిన తుమ్మెద పూవును వదలివెళ్ళినట్లు
మళ్ళిచూడక కృష్ణుడు మధురకు వెళ్ళిపోయినాడు
తాపసులును బంధుజనులకై తపించుతుంటారు
కాని ఆయనకు మాతో ఇప్పుడు కార్యమేమిగలదు ।వినరా।

అని అంటూండగా, మధుపానం చేసిన మత్తుతో ఎగిరే ఒక తుమ్మెదను చూచి, ఒక గోపిక ఇలా అన్యాపదేశంగా పాడింది గీతికను —

దుష్టసావాసాల తుమ్మెదా - నువ్వు ముట్టకుము మా కాళ్ళు తుమ్మెదా
విచ్చినా పూలల్లొ తుమ్మెదా-తేనె మెచ్చి త్రాగాడతడు తుమ్మెదా
వేరొక్క పూవుపై తుమ్మెదా-అతడు వ్రాలడం మామూలు తుమ్మెదా
మా పెదవులను తాకి తుమ్మెదా-అతడు మధువును త్రాగాడు తుమ్మెదా
మా యవ్వనము నంత తుమ్మెదా-అతడు మంచిగా జుర్రాడు తుమ్మెదా
ఈనాడు ఇతరులను తుమ్మెదా—అతడు ఇష్టపడుతున్నాడు తుమ్మెదా
ఇటువంటి చపలునీ తుమ్మెదా-లక్ష్మి ఎటుల వరియించెనో తుమ్మెదా
హరి నిర్మలుండనీ తుమ్మెదా — సాధుజనుడనీ పలికావు తుమ్మెదా
నీవు చెప్పేమాట తుమ్మెదా-మాదు చెవికెక్కబోదోయి తుమ్మెదా
మధురలో మేడలలొ తుమ్మెదా— నీవు గొంతెత్తి పాడవే తుమ్మెదా
వారు నిను పూజించి తుమ్మెదా— గౌరవముగ పంపిస్తారు తుమ్మెదా
రాయబారాలనూ తుమ్మెదా- నీవు నడపుటలొ చతురుడవు తుమ్మెదా
మమ్మ విడిచి అతడు తుమ్మెదా— అతడు మధురకెందుకు వెళ్లె తుమ్మెదా
వేటగానినిబోలె తుమ్మెదా — అతడు వాలినీ చంపాడు తుమ్మెదా
శూర్పణఖనూపట్టి తుమ్మెదా-ముక్కుచెవులు కోయించెనే తుమ్మెదా
బలిని మోసముచేసి తుమ్మెదా- మూడులోకాలు పొందాడు తుమ్మెదా
ఇంతటి వంచకుని తుమ్మెదా - నీతివంతుడని యనదగునె తుమ్మెదా
బోయనీ బోనులో తుమ్మెదా - పడిన లేళ్ళమైనామోయి తుమ్మెదా
ఇహపరాలను విడిచి తుమ్మెదా- అతనిమీద మనసుంచాము తుమ్మెదా
విరహ సాగరమందు తుమ్మెదా - మమ్మ విడువవలదనిచెప్పు తుమ్మెదా

మావూరి గుడిసెలా తుమ్మెదా-పసిడి మేడలగనుండునా తుమ్మెదా
పూలతోటలులేవు తుమ్మెదా-ఇచట గాలి అడవులు గలవు తుమ్మెదా
భద్రగజములులేవు తుమ్మెదా-ఇచట పాడియావులెగలవు తుమ్మెదా
అందచందాలకూ తుమ్మెదా-గొప్ప సుందరులు లేరిచట తుమ్మెదా
ఉరులువేసే విద్య తుమ్మెదా—మాకు తెలియనే తెలియదు తుమ్మెదా
రాజులకు మోజులూ తుమ్మెదా-కొత్తవారిపైనుండునే తుమ్మెదా॥

ఈ దీనాలాపనలు విన్న ఉద్ధవుని గుండె బరువెక్కింది. వారితో ఇలాగన్నాడు -

ఎంత పుణ్యమో తల్లులార మది ఈశ్వరుపై నిలిచె
ఏకాగ్రతతో మీవలె శ్రీహరి నెవరు స్మరిస్తారు

అమ్మలారా! మీవలె -

నిష్టతోడ తపమాచరించెడి నియమము గలవారు
శ్రద్ధతోడ హోమములు నిత్యమూ సాగించెడివారు
పట్టుబట్టి వేదాలు చదువుటలో దిట్టమైనవారు
దానధర్మములు మిక్కిలిచేసే దాతలైనవారు
మాధవునీ మీవోలె గట్టిగా మదితలంపలేరు
మాననీయలగు మీకు కృష్ణుడీ మాటలు చెప్పాడు

అవేమంటే —

కార్యములన్నింటికి నేనేగద కారణభూతుడను
కావున మీకూ నా వియోగమూ కలుగబోదుసుమ్మా
జీవకోటిలో పంచభూతములు చేరియుండునట్లు
మనోబుద్ధి ప్రాణేంద్రియ గుణములకునునాశ్రయమౌచు
ఆత్మయందు నే నాత్మచేతనే ఆత్మను కల్పించి
పుట్టించుచునూ పోషించుచూనూ గిట్టించుచునుంటి

ఇంద్రియ గుణసముదాయరూపమే నేను కాంతలారా
మాయతోడనే నన్ని జగాలను మనుపుతునుంటాను

ఇక —

ఆత్మనిత్యము శుద్ధము బుద్ధము జ్ఞానమయముగాన
మాయకు లోబడి పొందునయ్యాది గుణాదివికారముల

సాధారణముగా -

తమ దగ్గరగలవారికన్ననూ దవ్వుల గలవారే
ప్రేమపాత్రులగుచుందురు చెలులకు భామలార వినుడు

కావుననే —

నను మీరలు చింతించు చుండవలెనని గోరియె నేను
ఎదుటనుండుట తగదని మధురకు నేగినాడనమ్మా

మీరు -

నన్ను స్మరిస్తూ యెల్లప్పుడు మీరున్న కారణమున
శాశ్వతమ్ముగా నన్ను గూడెదరు సందేహము వలదు

అని మీకు చెప్పుమని శ్రీకృష్ణుడు చెప్పినాడు. అనగా సంతోషంతో గోపికలు ఉద్ధవునితో అన్నారు -

అయ్యా అయన మధురానగరిలొ హాయిగ నున్నాడా
ఇక్కడికి యెప్పుడు వచ్చి మా మనసు చక్కపెట్టుతాడు

అది గూడా మాదో పిచ్చి ఆశగాని, ఇంతకూ —

ఆయన వచ్చుట కపటి చెలియలూ అనుమతింపబోరు
బ్రహ్మ మమ్ములను మన్మథవేదనపాలు చేసెనిటుల ॥మురళీ॥

ఇంకా ఆయన —

యమునవడ్డునాగల పొదరిండ్లలో మము తన దరిజేర్చి
మయిమరిపించీ జరిపిన క్రీడల మరచిపోయెనేమొ
మురళీగానముతో మమ్ములనూ పరవశింపచేసి

మా చిత్తములను దొంగిలించిన మాయదారి యతడు
ఆ యమునానదిలోన స్నానముల నాడుచుండ మేము
మా వస్త్రిలను దొంగిలించినది మరపుదట్టైనేమొ
రాసక్రీడలు, చాటుగ మాతో చేసిన బాసలను
ఎప్పుడైన నీతోటి చాటుగా చెప్పినాడ అతడు

ఈ మాటలన్నీ ఎందుకు ? నీవు వెళ్ళగానే ఆతనితో జాగ్రత్తగా మా మాటలు వినిపించు. అవేమిటంటే -

నిన్ను బాసి క్షణకాలమైననూ నిలవలేము మేము
మనసు వివశమై ధైర్యంతగ్గి తనువు రాలిపోవు
ప్రాణాల్ వీడిన పిదపవచ్చిచో ఫలితముండదయ్యా
ప్రాణరక్షకుడవని నిను నమ్మిన ప్రజనిందిస్తారు

అలా కాకుండా —

మరల నాతడూ మా గోకులమున తిరుగుగోరుతాడా
ఆయన సరసాలాడుతు మమ్ముల ననుగ్రహిస్తాడా
ఆయనతో నాలింగన సౌఖ్యము ననుభవించగలమా
మమ్ము విడిచి ఎందేగినావనీ మందలించగలమా

ఇవన్నీ ఆయనతో చెప్పడం మరచిపోవద్దు -

అని కొంతసేపు దుఃఖించీ — వారు
తమ నుద్ధరింపమన్నారు - బారు
కన్నీరు తుడుచుకున్నారు - గుండె
తేలికగా చేసికున్నారు - పిదప

ఉచిత సత్కారాలు ఉద్ధవున కొనరించి
విరహతాపము వీడి మరలివెళ్ళారయ్యా ॥ఓరామ రాఘవా॥

ఇలా కొన్నాళ్ళు ఉద్ధవుడు కృష్ణ లీలలను వర్ణిస్తూ వ్రేపల్లెలో ఉండి నందాదుల సెలవు తీసికొని, మధురకు వెళ్ళాడు —

గోపగోపికల గాథలనన్నీ ॥తంధానో॥
గోవిందునకూ తెలియ చెప్పెనూ ”
ఉగ్రసేనునీ వద్దకువెళ్ళీ ”
నందుడు పంపిన కానుకలన్నీ ”
పేరు పేరునా అప్పగించి తను చేరెను తన యిల్లూ ॥తథాంనతానా॥
రాజరాజ ఓ పరీక్షన్మహారాజా వినుమయ్యా ”

తరువాత ఒకరోజు-

కుబ్జ కోరినటులామె యింటికీ అర్జునయనుడేగి
పూర్వకామితము దీర్చివచ్చె పరిపూర్ణ కటాక్షముతో ॥రాజ॥

పిదప కొన్నాళ్ళకు శ్రీకృష్ణుడు -

ఉద్ధవ బలరాములతోగూడీ ఉల్లాసముతోడ
అక్రూరుని భవనానికి కృష్ణుం డరిగినాడు రాజా ॥రాజ॥

అప్పుడు అక్రూరుడు —

తన యింటికి నేతెంచిన వారిని కనినంతనె లేచి
సముచిత స్వాగత సత్కారాలను క్రమముగా నొనర్చి
ఉద్ధవునీ హృదయాని కద్దుకొని ఉత్సాహముతోడ
హరి పాదాలను తొడపై నిడుకొని పరవశించి అనియె ॥రాజ॥

ఏమన్నాడంటే -

అనుచరవర్గముతోడ కంసునీ అంతమూ చేశావు ॥మురళీ॥
ప్రజలకు శాంతిని గూర్చి వంశమును ప్రతిష్ఠ తెచ్చావు
విశ్వకారణ డనాదిపురుషుడవు విశ్వమయుడ వీవు
కార్యకారణము లెంతమాత్రము కానివాడవగుచు
రజోగుణాన్నీ ధరించి జగముల సృజించుచుండుటచే
వెలుగుచుంటివీ జగత్కారణునివలెను విశ్వమెల్ల
మాయకు లోబడి పుట్టునట్టి యీ మానవులను వోలె
కర్మబంధములు నిన్నేమాత్రము కట్టలేవు స్వామీ

పుట్టుటచే రాబడే ద్వంద్వములు ముట్టలేవు నిన్నూ
భూభారము తగ్గింప పుట్టిన పురాణపురుషుడవు
ఏ జన్మములో పుణ్యకార్యముల నేమిచేసినానో
ఈ జన్మములో మీ పాదాలను నేను తాకినాను
సారహీనమగు సంసారమనే ఘోరజలధినుండి
నను దయతో దాటించమటంచూ నిను వేడుచునుంటి
॥చిత్తగించుమా॥

అని ప్రార్థింపగా కృష్ణుడు అక్రూరునితో —

వరుసకు నీవూ నాకు జనకునివంటివాడవయ్యా
ఆత్మబంధుడ వన్ని సద్గుణములందు పెద్దవయ్యా
ఆలయాలలో రాతిబొమ్మలను అర్చించేవారు
కోరికలెన్నో కోరుచుందు రటుకోర తప్పుగాదు ।వినరా

కానీ, వారికంటే -

మీవలె భగవచ్చరణములంటి సేవచేయువారు
పొందలేని లాభములు వసుధలో నెందుగానబోదు ।వినరా

సరే ఇంతకు నేను ఇచటికి రావడానికి గల కారణం
విను -

పరలోకానికి వెళ్ళిపోయెనట పాండుమహారాజు
పిన్నవారలా పాండుకుమారులు పెద్దతండ్రివద్ద
కన్నతల్లితోగూడి కాలమును గడపుచుంటిరంట
కొడుకులపై వ్యామోహమెక్కువా గ్రుడ్డిరాజు కెపుడు
పాండవులను అత డాదరించునని భావింపగలేను
పాండవులూ మేనత్త బిడ్డలూ బంధువులూ నాకు
కాన క్షేమములు విచారించుటే కర్తవ్యము మనకు
కరిపురానికీ వెళ్ళి వారనుల కలిసి రాగదయ్యా ॥వినరా

అని అక్రూరుని పంపించి తన భవనానికి చేరాడు కృష్ణుడు -

అక్రూరుడు కృష్ణుని యానతితో హస్తిపురము చేరి
రాజభవనమున కరిగి చూచెనూ రాచబంధువులను ॥రాజ॥

అచ్చట ఎవరెవరిని దర్శించాడంటే -

భీష్మవిదుర ధృతరాష్ట్ర బాహ్లికుల
కురుగురువృద్ధుల కర్ణాదులనూ
కుశల ప్రశ్నల నడుగుచు నడచుచు
కుంతీపాండవులను దర్శించీ

మధురానగరీ విశేషాల నొక కథవలె చెప్పాడు ।తంధానతానా।

ఒకనాడు విదురుడు గూడా ఉండగా కుంతీదేవి అక్రూరునికో ఇలా గన్నది -

తల్లులు తండ్రులు భగినులు పెద్దలు పిల్లల యుక్తముగా
మధురలోని మన బంధువులంతా మంచిగనున్నారా
మా విషయాలెప్పుడైన తలతురో మధురానగరమున
నిన్ను ఇచటికి పొమ్మనినప్పుడు అన్నమాటలేవి ॥వినరా॥
లేళ్ళు వచ్చి తోడేళ్ళ మధ్యలో యేండ్లు బ్రతికినట్లు
దుష్టులైన కౌరవుల మధ్యలో దూరినాము మేము
చిన్నపిల్లలగు నా కొడుకులను ఎన్నో విధములుగా
కౌరవాధములు త్రాచుపాములతో కరిపించారయ్యా
గట్టిత్రాళ్ళతో కట్టి భీముని గంగలో త్రోశారు
విషము కలిపి అన్నమును పెట్టి చంపించ దలచినారు
పాండవులకు రావలసిన రాజ్యపుభాగ నిర్ణయములో
ఆ బలరాముడు కృష్ణుడు తమలో నాలోచిస్తారా
అనుచు భక్తవత్సలుని కృష్ణునీ మనమునందు నిలిపి
కనులనుండి నీరొలుకు కుంతినీ అనునయించెనతడు ॥రాజ॥

తరువాత, రాజభవనంలో సుఖంగా కూర్చున్న ధృత రాష్ట్రునితో అక్రూరుడు ఇలా గన్నాడు -

పాపము తమ్ముడు పాండుభూపతి పరలోకము కేగె
న్యాయమార్గమున రాచకార్యములు నడిపిస్తున్నావా
కనులకు రెప్పలవలె మీ ప్రజలను కనిపెడుతున్నావా
ఆర్తుల సమభావనతో చూస్తే కీర్తిపొందుతావు
దారి తప్పితే లోకుల నిందలు తప్పవు రాజేంద్రా
పాండవేయులను నీ బిడ్డలవలె పాలన చేయాలి
భార్యాబిడ్డలు సంపదలును బ్రతికినంతవరకే
మనము పోవునపుడెవరు వెంబడీ చనుదెంచరు రాజా
కూడబెట్టినా సంపదనంతా కొడుకు లపహరించి
ధనము చేతిలో చిక్కిన పిమ్మట దరిచేరరు రాజా ॥వినరా॥

అందుకని—

తమరీ సంపద సుతులచేతిలో ధారపోయ వలదు
అట్లుగానిచో ఇహపరములనీ కపఖ్యాతివచ్చు
నిందల పొందకుమయ్యా యీ తనువు నిలువబోదు సుమ్మా
సందేహింపక పాండవేయులకు సగము రాజ్యమిమ్మా. ॥వినరా॥

అనగా ధృతరాష్ట్రుడు

నీ మాటలు సత్యములని యెరుగుదు నేనే చపలుడను
నీ మాటలు నా మదిలో మెరయును నిలువవు క్షణమైనా
ఇంతకు పరమేశ్వర సంకల్పము ఎటుల నుండగలదో
అదే విధముగా నడువక తప్పదు అవనిలోని జనులు
దేవకి కొడుకుకు నమస్కరించి తెలిపెద నొకమాట
ఆ మహానీయుని ఊహాయెట్టిదో అటులె నడువదగును ॥మురళీ॥

అనగా అక్రూరుడు-

మహా రాజ నీమనసులోనిదగు మాట తెలిసికుంటి
అట్టులెకానీ నాకు సెలవనీ అక్రూరుడు వెడలె ॥రాజ॥

తరువాత అక్రూరుడు-

రథారూఢుడై మధురాపురికీ రయమున వెళ్ళాడు
రామకృష్ణులకు నమస్కరించి ప్రారంభించాడు
హస్తినాపురపు విశేషాలనూ అన్ని విన్నవించి
అక్రూరుడు తన యింటికేగెను హరియనుమతిపొంది ॥రాజ॥

అనంతరము-

అంత కంసుని భార్యలగు నస్తి ప్రాప్తులు కలిసి
పతిహీనలై దుఃఖపడ్డారయా ॥విందామయామనము॥
తమ తండ్రియగు మగధ ధరణీశుకడకేగి
గోడు గోడున యేడ్చి కుమిలారయా ॥విందామయా॥

ఏడుస్తూ తండ్రీ !

మదముతో యాదవులు మధురాపురము చొచ్చి
మన సైన్యములను పరిమార్చారయా ॥విందామయా॥
గర్వించి కృష్ణుడూ కంసరాజాదులను
చెనకి మము విధవలను చేశాడయా ॥విందామయా॥

అని చెప్పగానే-

ఆ మాట విన్నంత నా జరాసంధుడూ
ప్రళయాగ్నివలె మండిపడ్డాడయా ॥విందామయా॥
రోసమ్ముతో కోరమీసాన్ని మెలివేసి
ఆడుబిడ్డలతోడ నన్నాడయా ”
ఏమేమి కంసునీ హింసించెనా దొంగ
గోవిందుడని పళ్ళు కొరికాడయా ”

హరుడు పురుహూతుడూ అడ్డువచ్చినగాని
పరిమార్తు వానినని పలికాడయా ॥విందామయా॥
ఇలలోన దాగినా వినువీధి కెగిరినా
శరణన్న వదలనని ఉరిమాడయా ”
రథతురగ భటులతో రణభేరి మ్రోగించి
మధురకపుడే పయనమయినారయా ॥విందామయా॥
బలరామ కృష్ణులది తెలిసికొాపి వారికై
వేచి దిక్కులను నెదురు చూచారయా ”
అంతలో ధనువులూ అమ్ములూ రథములూ
గగన భాగమునుండి దిగినాయయా ”
అన్నదమ్ములు లేచి ఆరథాలెక్కుతూ
పోరాటముకు సాగిపోయారయా ”
పాంచజన్యమును గోపాలుడూ పూరింప
అరిసేన గజగజ లాడిందయా ”
ఆ జరాసంధుడు అరదాన్ని నడుపుతూ
అచ్యుతునితో నిట్టు లన్నాడయా ”
ఏమన్నాడంటే ? ఏయ్ ! గోపాలా !
అంభారవాలిచట నాలకింపగరావు
అశ్వఘోషలె వినాలన్నాడయా ॥విందామయా మనసు॥
అదలిసై పరుగెత్తు ఆలమందలుగావు
మదగజాలని యెరుగు మన్నాడయా ”
ఒక తన్నుకే విరుగు శకటాలు అనుకోకు
దీపించు రథములని తెలియాలయా ”
మదపతులకరములవలె మృదువుగా మొత్తనిట
పిడిగుద్దు పోటులే పడతాయయా ”

గోపభామలకంటి చూపులూగా వివీ
కరకు కత్తుల మెరుపు గాంచేవయా ,,
చెలుల దోసిళ్ళలో జలములు గావివి
తీక్ష్ణబాణాలనీ తెలియాలయా ,,
ఆర్పివేయుటకు దావాగ్ని కాదిచ్చటిది
అమ్ముల మంటలని అన్నాడయా ,,

అలా జరాసంధుడు అంటూంటే కృష్ణుడు చిరునవ్వుతో —

భూపాలకా! నన్ను గోపాలుడని తలచి
అవహేళనము చేయకన్నాడయా। విందామయామనము॥
నోటితీటను దీర్చు మాటలే యుద్ధమున
పనికివచ్చునని నే వినలేదయా ,,
వీరుడగు నరపతి నారిసారించుతూ
విడచు నమ్ములని నే విన్నానయా ,,
వట్టి మాటలు నీవు కట్టిపెట్టి విల్లు
గురిపెట్టి కొట్టుమని కోరాడయా ,,

అప్పుడు జరాసంధుడు ఇలా గన్నాడు —

పసివాడవురా నాతో పోరగ, బాలక సరిపోవు
ప్రక్కకు తొలగి బలరాముణ్ణి పంపుము అన్నాడు ॥రాజ॥

అప్పుడు శ్రీకృష్ణుడు ఇలాగన్నాడు -

మగతనమే నీకున్న పొగడుకొను మాటలు తగవోయి
అనుచూ కృష్ణుడూ రోషముతో తన అస్త్రము విడిచాడు ॥రాజ॥

వెంటనే ఉభయసేనల నుండి -

భేరీ భాంకారమ్ములూ - సై
గజముల ఘీంకారమ్ములూ ,,

విల్లుల టంకారమ్ములూ ”
వీరుల హుంకారమ్ములూ ”
దద్దరిల్లుతూ మ్రోగెరా - ఆ-యుద్ధము జోరుగ సాగెరా
॥భాగవతామృత॥

అప్పుడు రేగిన ధూళికి భానుడు అగుపించగలేదు
సాగుచుండె కడుభీకరమై యా సంగ్రామంబచట ॥రాజ॥

ఆ సమయమున —

యాదవసైన్యము కొంత మేదినీమీద కూలుచుండ
అది గమనించిన బలరాముడు తన హలము విసిరినాడు
ఆ హలాయుధపుదెబ్బ కెందరో అసువులు విడిచారు
శత్రుసేనలోగల ప్రముఖు లందరూ జయింపబడినారు ॥రాజ॥

అప్పుడా యుద్ధభూమిలో -

నేలబడినవారు కొందరూ - సై
కాళ్లు తెగినవారు కొందరూ ”
చేతులాడినవారు కొందరూ ”
తలలు రాలినవారు కొందరూ ”

వారి దేహముల నెత్తురూ-కారి- యేరువోలె పారుచుండెరూ
చివరి ఊపిరిని వదలుతూ- వారు-శ్రీహరితో నిట్లన్నారు
॥భాగవతామృత॥

ఏమన్నారయ్యాంటే —

సమరమందున చచ్చిన మాకు స్వర్గమె వస్తుందీ
సురలుగమారి వైకుంఠానికి త్వరలో వస్తాము
అప్పుడైన మిము పరాభూతులుగ తప్పక చేస్తాము
అని గర్వముతో పలికినారువా రాయాసము తోడ ॥రాజ॥

ఆ సమయములో -

బలభద్రుండూ పరాక్రమించీ
జరాసంధునీ చేతులు కట్టీ
తలను నరకుటకు సిద్ధము కాగా
హరి సవ్వుతు నత్తరి యడ్డుపడీ

ఇలా గన్నాడు -

ఆయువు మూడనివాని పట్టుకొని అన్నా చంపెదవా
జరాసంధునీ వదలివేయుమని శౌరి చెప్పినాడు

అటు తరువాత జరాసంధునితో కృష్ణుడు ఇలాగన్నాడు —

జరాసంధుడా! విచారింపకుము చనుము నీ పురమునకు
సైన్యము క్రొత్తది సమకూర్చుకొనీ చక్కగ రావయ్యా
అందుకు నీవూ నిరాకరిస్తే అసువుల బాసెదవూ
తనువును రాబందులకు నక్కలకు దానము చేస్తావు

అనగా జరాసంధుడు సిగ్గుతో తలవంచుకొని యుద్ధంనుండి తిరిగి వెళ్ళిపోయాడు. తరువాత బలరామకృష్ణులు-

ఉగ్రసేనునీ వద్దకు నేగీ యుద్ధవిశేషముల
పూసగ్రుచ్చినటు లొక్కొక్కటిగా పూర్తిగ చెప్పారు ॥రాజ॥

తరువాత తమ మాతామహుని దీవనలు పొంది, తమ మందిరానికి చేరుకున్నారు. ఇక మగధలో —

తనకాప్తులు మిత్రులగు రాజులందరిని చేర్చుకొనుచు
తగిన బలముతో మగధరాజు యుద్ధమునకేగె మరల ॥రాజ॥

ఇలా పదునేడుమారులు మధురపై దండెత్తి వచ్చి, అచ్చటి యాదవులచేత పరాభవింపబడి, పద్ధెనిమిదవమారు తిరిగి

ను ముట్టడించాడు జరాసంధుడు-అప్పుడు నారదుడు
ంవనుని వద్దకు వెళ్ళి ఇలా గన్నాడు -
మవనా! అంతట జయించితిపగద అవనీనాథులను
పవనుడు మబ్బుల చెదరగొట్టినటు పరిమార్తువు రిపుల

ఆలమందు యాదవుల నెదుర్కొ-నజాల వేలనోయి
బలము తక్కు-వా? తెలివి తగ్గెనా? భయపడుతున్నావా?
యాదవులల్లో నొకడు జరాసంధాదుల తరిమాడూ
అంతటి యోధుడు ధరపై లేడని అనుకుంటున్నారు ॥వినవా॥

కాలయవనుడు నారదునితో ఇలాగన్నాడు -
ఏమీ! నారద! నీవు చెప్పినా దెచ్చటనున్నాడు
బాహుబలంలో నాకు దీటుగా ప్రవర్తించగలడా
తొడనుగొట్టి నేనిలిచిన బయటికి తొలగక నుంటాడా
ఎట్టివాడునో అతని రూపము ఎవడో చెపుమయ్యా ।వినరా।
ౕడుగగా, నారదుడు ఇలా చెప్పినాడు —
కాలమేఘమువంటి నీలివర్ణమువాడు
కమలదళములవంటి కనులవాడు ॥విందామయా॥
పున్నమజాబిల్లిబోలు ముఖమువాడు
పొడవు చేతులతోడ నడచువాడు ”
పచ్చవలువగట్టి పరగుకాయమువాడు
చెవుల కమ్మల కాంతి చెలగువాడు ”
దిక్కు-లన్నింటిలో చేగివ్యాపానముగ
నలరు తేజమ్ముతో వెలుగువాడు ”
ఇంద్రకోపలగాని ఇంటిటయటనగాని
అంతటా తిరుగాడు నట్టివాడు ”

అంతంత మాత్రాన అందరికి దొరకక
దొరికినటులే తోచి దొరకువాడు ”
పట్టుకొనుటకు తగినట్టు తెలిసినవారు
పట్టితే పట్టుబడునట్టివాడు ”
కాలయవనా! నీకు గాననే తెల్పితిని
చాటుమాటల తేటతెల్లముగను ”

ఇలా నారదుడు చెప్పగా కాలయవను డిలాగన్నాడు -

ఇదియేమి నారదా వింతగా చెబుతావు
నన్నుబోలిన యోధు డున్నవాడా? ॥వినదామయా॥
యముడెత్తివచ్చినా సమయించెదను నేను
శిలలవంటివి నాదు చేతులయ్యా ”

అని పలికి —

కాలయవనుడు గొప్పగా సైన్యమును గూర్చి
వెంటనే దాడికీ వెడలాడయా ॥వినదామయామనము॥
మధురపైబడి సేన నదలించుటను జూచి
బలరామకృష్ణు లిటు తలచారయా ”
బలముల గూర్చుకొని పరితెంచె మాగధుడు
మధురపైబడ సిద్ధమయినాడయా ”
పురికి యిరువంకలన్ బోరుదురు ఇద్దరూ
ఒకచోటనే మనము ఉంటామయా ”
మనమొక్కవైపుండ మరియొకడు అటువైపు
మన బంధువులను పరిమార్చేనయా ”
కాన మనవారినీ కనిపెట్టి అందరిని
శీఘ్రమే ఇతరత్ర చేర్చాలయా ”

అని చెప్పి, సముద్రతీరానికి చేరి, సాగరుని అనుమతి పొంది విశ్వకర్మను రప్పించి, సముద్రంలో నూతననగరం కల్పించమని ఆజ్ఞాపించాడు. అప్పుడే -

పాట

పట్టణమే వెలసె అందమగు ॥పట్టణమే॥
పారావారముకు జేరిన విశ్వకర్మ
నేరుపుమీర కట్టినాడు-దాని
పేరు ద్వారక యన్నారు-దాని
నేరూ ముట్టడింపలేరు-అబ్బ
తారాపథంబంటు చారుగోపురాల
తీరుతెన్నులుచూచు వాడు సేబాసనగ ॥పట్టణమే॥
గట్టీ పునాదులతో కట్టిన ఆ నగరి
పరిధి పన్నెండు యోజనాలు-దాని
చుట్టూ లోతగు కందకాలు-బార్లు
గట్టియున్న మందిరాలు-జాతి
రత్నాల ద్వారాలు రమ్యకవాటాలు
కనక గవాక్షాలు కలిగి కడలిలోన ॥పట్టణమే॥
అమరావతికన్న అలకాపురము కన్న
అహోనాధుపురికన్న అద్ది జముని
నగరమునకన్నమిన్న - దాని
వరిమాణమే గొప్పదన్న - వీధు
లెంతో విశాలాలు వింత కట్టడాలు
అంతూ పొంతూ లోపమింతైన లేనట్టి ॥పట్టణమే॥

వచ :- తరువాత శ్రీకృష్ణుడు మధురానగర నివాసు లంద రినీ తన యోగమాయ వలన రహస్యంగా ద్వారకకు

చేర్చినాడు. పిమ్మట నిరాయుధుడై వచ్చే గోపాలుణ్ణి కాలయవనుడు చూచి తన సేనాపతితో ఇలాగన్నాడు —

మనము వచ్చినదాది మన శత్రుసైన్యాలు
మధుర బయటకురాని కథయేమయా ।విందామయా।
ఎవ్వడో ఒక్కడూ నవ్వుతూ బయటికీ
మొదటి ద్వారముదాటి కదిలాడయా ,,
ఆయుధము చేతిలో నాతనికి లేదాయె
దేనికో వచ్చునది తెలియాలయా ,,
చెయిజాపి మనను యాచింప వస్తున్నాడో
ఆతని చూడండనీ అన్నాడయా ,,
దేవముని చెప్పిన తీరుతెన్నులు వీని
యందు కనబడుచున్న వీతుడేనయా ,,
వీనినేనా గొప్ప వీరుడని నారదుడు
గొంతుచించుక పొగడుకున్నాడయా ,,

అంటూ సింహంలాగా గర్జించి -

ఒక్కపెట్టున పెద్ద కేకవేశాడు — రాజరాజ
కాలసర్పమువోలె బుసకొట్టినాడు - రాజరాజ
కన్నులలో నిప్పులు కక్కించినాడు-రాజరాజ
తురగాన్ని హరిపైకి దూకించినాడు - రాజరాజ

అప్పుడు —

పురము నుండి వెడలిన గోవిందుడు పరుగులు తీశాడు
వేగముతో యవనుండా కృష్ణుని వెంబడిపడ్డాడు ॥రాజ॥

వెంటబడి ఏమన్నాడంటే ఓయీ యాదవవీరా —

వింటిమి కంసాసుల చంపితివని కంటిమి యిన్నిపుడు
నీతో యుద్ధము చేయవచ్చితిని నిజమము గోపాలా
వీరులధర్మము యుద్ధమందున వెనుదిరుగుటకాదు
పరుగెత్తెడి నినుజూచి లోకుల పరిహాసింతురయ్యా

ఇలాగే పరుగెత్తిపోతుంటే నీవు —

ఎక్కడికేగిన వెంబడించి నీ యుక్కడగించెదను
ఇంతవరకు నావింటినెత్తలే దింతయేల భయము

ఇలాంటి నీవు —

కాళీయుని మర్దించితి వండురుగాని నమ్మగలమా
మల్లులతో పోరాడినావనేమాట నమ్మలేము
గజమును పడగొట్టితివనియన్నది నిజముగానిమాట
కంస జరాసంధుల నెదిరించుట కల్పితమగు వార్త ॥వినరా॥

అనే కాలయవనుని చూచి శ్రీకృష్ణుడు ఇలాగన్నాడు -

తొందరయేలా నీ హయమును నాతో రానిమ్మనుచు
కొండలు కోనలు వాగులు యేర్లూ ఘోరారణ్యములు
దాటి ఒకానొక పర్వతగుహాలో దాగెను కేశవుడు
అట్టహాసమునుచేస్తూ యవనుడు అతని వెంబడించి
గుర్రముదిగి గోపాలుడు దాగిన గుహాలో చూరాడు
దీర్ఘకాయుడొకడా గుహాలో నిద్రించుట చూచాడు
కాలయవను డాతనిని గట్టిగా కాలతన్నినాడు
ఆతడు మేల్కొని కండ్లు నులిమికొని అసురుని గనినంత
కంటిమంటలో కాలయవనుడూ కాలచచ్చినాడు ॥రాజ॥

అపుడు పరీక్షన్మహారాజు శ్రీశుకుని ఇలాగున అడిగారు

పాట

కన్నుతెరచినంతలోన కాలయవను నంతవాని ”
బూడిద చేయంగలిగిన పురుషుడెవడో చెప్పుడీ

ఆనగా శుకుడు -

వినవలసిన కథయేనది వివరింతును రాజేంద్రా
ఎరిగియుండు వింత కుమున్నిక్ష్వాకుని పేరు నీవు ”
అతని వంశమందున విఖ్యాతుడు మాంధాతరాజు
వారి సుతుడు ముచికుందుడవారిత బలధైర్యశాలి ”
సురలుగోరని నతడు రాక్షసులను చంపి దేవతలకు
సుఖశాంతులు చేకూర్పగ సురలు కృతజ్ఞత తెలుపుచు ”

ఇలా గన్నారు దేవతలు -

భూలోకము విడిచి రాజభోగాలను వదిలిపెట్టి
మమ్ముల కాపాడుటకై మహనీయా ఇటనుంటివి ”
అచటనున్న నీ సహచరు లందరు స్వర్గము జేరిరి
కాలమెట్టి ఘనులనైన కబళించుట సత్యమగును ”
కాలాత్మం డీశ్వరుడే కాలరూపమున జగమును
పుట్టించుచు గిట్టించుచు పోషించుచు వెలయుచుండు ”

నీవు మాకు చేసిన ఉపకారమునకు ప్రతిగా -

వరమిచ్చెద మర్థింపుము నరపాలా యనగనతడు
గాఢమైన నిద్ర నాకు కావాలని కోరినాడు ”
సుర లటులేవరమీయగ గిరిగుహలో నిద్రించుచు
ఎన్నో యేండ్లు గతించిన కన్నులు తెరవకుండె నితడు ”

ఇప్పుడు

నిద్రాభంగము గలుగక నేటికి తన కండ్లు తెరిచె
కంటినుండి మంటలెగయ కాలయవనుండంతరించె ”

తరువాత ఏం జరిగిందంటే? శ్రీకృష్ణుడు ముచికుందు ముందు నిలిచాడు -

ముందు నిలిచియున్న జగన్మోహనుడగు కృష్ణునిగని
ఆశ్చర్యముతోడ కన్నులట్టె నిలిపి చూచాడు ”

కొంతసేపటికి ముచికుందుడు తేరుకొని —

ఇంద్రరుద్ర రవివిధాత చంద్రాగ్నులలోన నీవు
ఎవ్వరవో అట్లుగాక ఇందిరా మనోహరుడవో ”
నీ తేజము దివిని భువిని నిండి వెలుగుచుండె నకట
ఇంతకిచట నొంటరిగా నేల తిరుగుచుంటివయ్యా ”
క్రూరజంతువులు తిరిగే ఘోరారణ్యంబియ్యది
కావుననిట నీ మెత్తనికాళ్ళు కందిపోవునయ్యా ”
నీ చిరునామా చెపితే నీ సేవలు చేతుస్వామి
అనుచు స్వీయపూర్వగాథనంతయు వివరించాడు ”

అపుడు శ్రీకృష్ణుడు ముచికుందునితో ఇలాగన్నాడు -

నాదగు గోత్రము నామము నా గుణగణముల తెలుపగ
ఆదిశేషునకు నయినను అలవిగాదు రాజేంద్రా ”
నాకే తెలియవు మదీయ నామమ్ము లనంతమ్ములు
అన్నిరూపముల నేనే యలరుచుందునో రాజా ”
లోకుల చీకాకు పరచు రాకాసుల సంహరింప
భూభారము తగ్గింపగ పుట్టుచుందు నప్పుడపుడు ”

అలాగే —

వసుదేవుని సుతుడనగుచు వసుధయందు నవతరించి
గర్వాంధుల దుర్మార్గుల కంసాదుల చంపినాను ”
ఇప్పుడు నీకంటి మంటలెగయ బూదియైనవాడు
కాలయవనుడను దైత్యునిగా నెరుగుము రాజేంద్రా ”
నీ మనస్సు నాయందున నిలిపినావు లోగడనే
అందువలన నిటువచ్చితి నడుగుము వరముల [illegible] ”

అనగా ముచికుందుడు -

మాయచేత మోహితులై మనుజులు తమ సుఖము కొరకు
ధనానికీ కామానికీ దాసులగుచు బ్రతికెదరు ”
పచ్చగడ్డి దొరకుననే భావముతో పరుగులెత్తి
బావిలోన పడుమేకల పగిది పతనమౌతారు ”
మరల పుట్టి మరల చచ్చి తిరిగి తిరిగి చచ్చిపుట్టి
సాంసారిక బంధములో సతతమౌతుంటారు ”

స్వామీ ! అలాగే నేను కూడా -

కామభోగలాలసతో కనులు మూసికున్న నన్ను
మత్తునుండి తప్పిస్తూ చిత్తశుద్ధి గలిగింపుము ”
నీ పాదార్చకులతోడ నెయ్యమునే గోరుచుంటి
ఆ సహవాసమున ముక్తి నందుకుందునని నమ్మితి ”
నీపద సేవ నొనర్చుచు నీ నామము తలచుచుందు
నీ దయచే సర్వబంధ నిర్మూలనమును చేయుము ”
తమరి పాదభక్తులతో దయతో నను జత సేయుము
మోక్షము నాకొసగు మనుచు ముచికుందుడు వేడుకొనెను”

అపుడు శ్రీకృష్ణుడు -

క్షత్రియ వంశమున నీవు జన్మించిన కారణమున
వేటకేగి జంతువులను వేనవేలు చంపినావు ”
ఆ పాపము పోవుటకై ఆచరింపుమయ్యా తపము
మరుజన్మమునందు నన్ను తిరిగిచేరి నిలిచెదవు ”

అని చెప్పి శ్రీకృష్ణుడు మధురకు వెళ్ళిపోయినాడు -

వెలుపలికి గుహనుండీ వెడలినాడు ముచికుందుడు
చెట్లు మనుష్యులు అతనికి చీమలవలె కనిపించెను ”

అపుడు ముచికుందుడు తనలో నిలాగనుకున్నాడు —

కలియుగమూ సమీపించె గాబోలని తలపోయుచు
హరిగుణముల పొగడుచు నుత్తరముఖుడై యరిగినాడు "
గంధమాదనాద్రికేగి గాంచెనచటి దృశ్యములను
బదరికాశ్రమంబుచేరి ప్రారంభించెను తపమును "

ఇది ఇలాగుండగా అచట శ్రీకృష్ణుడు మధురలో అడుగు బెట్టేవరకు —

జరాసంధుడు తన సైన్యంతో జరిపినాడు దాడి
బలరామునితో గూడి కృష్ణుడూ పరుగు తీసినాడు ॥రాజ రాజ॥

అప్పుడు జరాసంధుడు -

అరరే యాదవులారా యెచటికి పరుగిడుచున్నారు
నిలువబడండీ నేడుచూతు మీ బలమెంతటిదగునో
అనుచు సేనతో వారివెంటబడిచనెనా మాగధుడూ
ప్రస్రవణమనే గిరిని అందరూ పరుగిడి యెక్కారు
పలు యోజన పైశాల్యముగల యాపర్వతమునుచుట్టి
ఆ బలకృష్ణుల పట్టుకొనుటకై అంతట వెదకారు
దాని గుహలలో అన్నదమ్ములూ దాగియుందురనుచు
పరిసరాలగల యెండుకట్టెలను గిరియంతట పేర్చి
చెత్తాచెదరము పర్వతమంతట చేర్చి మంటబెట్ట
భుగభుగ ధగధగ మంటలులేచీ గగనమెల్లనిండె ॥రాజ॥

అప్పుడు -

రహస్యమార్గము ద్వారా బయటికి రామకృష్ణులేగి
పరుగున సంద్రములోని ద్వారకాపురికి చేరినారు ॥రాజ॥

తరువాత -

వేడిమంటలో రామకృష్ణులూ మాడియుందురనుచు
జరాసంధుడూ తలచి మధురకూ చనెను సంతసమున ॥రాజ॥

# రుక్మిణీ కళ్యాణము

శ్రీ రుక్మిణి కళ్యాణగాథనూ చెప్పెద వినరండీ
ఆ రమేశునీ దయను బొంది మీ రానందించండీ

అప్పుడు పరీక్షన్మహారాజు శ్రీ శుకుల వారిని ఇలా గడిగాడు —

మౌనిచంద్ర శ్రీ శుకయోగీంద్రా మానితగుణసాంద్రా
బ్రహ్మదేవునీ యానతి గైకొని
రైవతరాజ కుమార్తె రేవతిని
రామునకిచ్చి పెండ్లి చేసిరని
వినియుంటిని పూర్వము పెద్దలచే
గరుత్మంతు డింద్రుని జయించి సుధగైకొన్నట్లుగను
జగతీనాధుల శిశుపాలాదుల సాళ్వాదుల గెలిచి
భీష్మకసుత రుక్మిణిని కృష్ణుడూ పెండ్లియాడినట్టి
కథను నాకు వినిపింపుము స్వామీ కర్ణపేయముగను
మౌనిచంద్ర శ్రీశుకయోగీంద్రా మానితగుణసాంద్రా!

ఎందుకనగా —

చిత్రచిత్రములు కల్యాణదములు శ్రీహరి చరితములు
జన్మజన్మముల పాపజ్వాలలు చల్లబరచు సుధలు ॥మౌనిచంద్ర॥
వినినకొలది యింకను వినాలనీ అనిపించును నాకు
విష్ణుకథామృతమును నేగ్రోలెద వినిపించుండనగా ॥వినరా॥

పరీక్షిత్తునకు శుకయోగీంద్రు డిలా చెప్పాడు—

వినుము విదర్భకు భీష్మకుడనియెడి జననాథుడు గలడు
ఆతనికైదుగురు పుత్రులు గలరు అందుపెద్ద రుక్మి

రుక్మరథుడును రుక్మబాహుడును రుక్మకేశరాజు
రుక్మనేత్రులనువార లొక్కతే రుక్మిణియనుబిడ్డ ॥రాజ రాజ॥

ఆమె అందచందములతో -

బాలిక పుట్టిననాటినుండియే బాలశశినివోలె
రోజురోజుకూ పెరిగి అందమగు రూపుదాల్చుచుండె
చిన్నతనములో రుక్మిణి యాటలు చెప్పెద వివరముగా
చెలులుగూడి బొమ్మల పెండ్లిండ్లను చేయుచు ప్రతిదినము
అబలలతోడను ప్రేమమీర వియ్యాల నందుచుండు
చెలువుమీర గుజ్జెనగూళ్ళను తన చెలులకు వడ్డించు
ప్రోదిసేయు తన పెరటితోటలో పూల తీవియలకు
తోడిబాలికల కూడగట్టుకొని యాడు బంతులాట
చిలుకలకును గోర్వంక పిట్టలకు పలుకులెన్నో నేర్పు
నెమళ్ళకాటలు తాళగతులతో నేర్పుచుండునామె
అడుగులు వేయగ రాజహంసలకు అభ్యాసము నిచ్చు
కాలము గడపుచునుండె నిటులనాకాంత పుట్టినింట ॥రాజ॥

కాలము మారుచున్నది -

వడతి యౌవనప్రాంగణమందున నడుగువేయుచుండె
ఆమె తండ్రితో మాటలాడుటకు నరుగుదెంచువారు
అతిథులు బంధులు వేదవేత్తలూ అచ్చటి పురజనులు
పలుకుచుందురు వాసుదేవుని బలశీలాదులను
ఆ పలుకులువిని రుక్మిణి యెల్లపు డంతరంగమందు
శ్రీహరినే చింతించుచు పతిగా స్వీకరింపదలచె

ఇలాగే ద్వారకలో -

శ్రీకృష్ణుండా బాలగుణములను శీలలక్షణముల
విని తన కిల్లాలుగ నామెను చేకొనగ దలచినాడు

అప్పుడు భీష్మకునితో -

ఈడుజోడు కృష్ణునకు రుక్మిణికి ఎంతో తగుననుచూ
వారిద్దరికి పెండ్లి చేయుడని కోరిరి బంధువులా

ఇది విని—

రుక్మిణీ సతికి జ్యేష్ఠసోదరుడు రుక్మియనెడి వాడు
గోపాలునిపై కినుక వహించీ గ్రుడ్డిఎద్దువోలె
చెల్లెలితో శిశుపాలుని పెండ్లి చేయ నిశ్చయించి
అహంకారమున చుట్టాలందరి నడ్డు పరచినాడు

అపుడు—

అన్నయోచనను యెరిగిన రుక్మిణి అపన్నతనంది
నలినాక్షునకూ తన నిశ్చయమును తెలియ జేయదలచి
అగ్నిద్యోతనుడను బ్రాహ్మణునీ ఆహ్వానముచేసీ
అతనికి సాష్టాంగనమస్కృతులను ఆచరించియనియె

ఏమన్నదయ్యాం తే: స్వామీ—

చెడ్డ పొగరుతో రుక్మి నన్ను ఆ శిశుపాలుని తోడ
జతను గూర్చగానెంచె నద్ది సమ్మతముగాదు నాకు
తండ్రి గూడ నా రుక్మి మాట జవదాటలేడు గాన
తా మూ ద్వారకకునేగి కృష్ణునీ దర్శనమును జేసి
వివరముగా వారికి ఈ సంగతి విన్నవించుడయ్యా
లోకజ్ఞానముగల పండితులగు మీకు చెప్పవలెనా?

అని ఆ బ్రాహ్మణుని ద్వారకకు పంపింది అతడు-

నేరుగ చేరెను బ్రాహ్మణోత్తముడు ద్వారకాపురముకు
తన రాకను లోనికి తెలుపగనే వినిన కృష్ణమూర్తి
అనుమతించి తన భవనములోనికి ఆహ్వానించాడు
కనకాసనమున నున్న కృష్ణునీ గాంచెను భూసురుడు

పెండ్లి కొడుకవూ త్వరలో కమ్మని పేరిమి దీపింప
అంజలి బంధముతోడ నెదురుగా అచ్యుతుండు వచ్చి
విప్రుని పదముల కడిగి తుడిచి సద్విధి విధానమొప్ప
అతిథికి పూజనుచేసి తృప్తిగా నారగింపజేసి

ఇలాగన్నాడు, శ్రీకృష్ణుడు-

ఏసమయానికి ఏది దొరికితే ఆసలేక గొనుచు
తన ధర్మములో నడచు విప్రునకు తిరుగు ఉండబోదు
సంతోషము లేకున్న నశించును శక్రుడైనగాని
సంతృప్తిని మించిన సద్గుణ మీ జగతిలోన లేదు

ఇంతకు-

ఏదేశములో మీరలుందురూ? ఎవరు మీకు రాజు?
ఉదధి మధ్యలోగల మాపురికే విధముగ వచ్చారు?
తమరి రాకలోగల కారణమును దాచక చెప్పండి
దానిని సంతోషముతోనేనూ తప్పక తీర్చెదనూ

అప్పుడా బ్రాహ్మణుడు కృష్ణునితో వినయంగా ఇలాగన్నాడు-

విదర్భదేశము పరిపాలించే విబుధుడు భీష్మకుడు
ఆ రాజన్యుని పుత్రిక రుక్మిణి అనుదినంబు మిమ్మే
మనసున నిలిపే తమ పాదములను తను స్మరించుచుండు
పాణిగ్రహణము తమతో జరుపగ పంపెను నన్నిటకు

ఆమె తమకు పంపిన సందేశాన్ని సావధానంగా వినండి—

నీ గుణాలు చెవిసోక తాపములు నిలువవు దేహమున
తమ శుభరూపము జూడ సంపదలు సమకూరును స్వామీ!
మీపద సేవలు నన్నిపదవులూ ప్రాపించును దేవా!
ఏ నీనామస్మరణ బంధములనెల్ల త్రెంపివేయు

నీయందే నాచిత్తమెప్పుడూ నిలచియుండు కృష్ణా
స్త్రీ సహజంబగు సిగ్గు విడిచినే చెప్పుచున్నదాన
కంస మర్దనా! నను మన్నించీ కరుణింపగవయ్యా
శిష్ట రక్షకా దుష్టశిక్షకా శ్రీనివాస శౌరీ! ॥చిత్తగింపుమా॥

ఇంతేగాక స్వామి!

ధన్యుని లోక మనోభిరాము విద్యాశోభిత రూపు
కుల గుణ సంపన్నుని సౌజన్యుని బలశౌర్యసమేతు
నిను మోహింపని కన్యలుందురే కనగ లోకమందు
మును నిను మోహింపదె ఇందిర. నాకును యంతేగాదా!
॥చిత్తగింపుమా॥

కృష్ణా!

సింగము పాలిటి సొమ్ముకోరెడీ దొంగనక్కవోలె
శిశుపాలుడు మీదాసిని నన్నూ చేగొన దలిచాడు
ఆ యధమునకూ తమ ప్రతాపము అర్ధము కాలేదు
నందనందనా మీ పాణిని నేనంద గోరుచుంటి ॥చిత్తగింపు॥

నీవా!

పూర్వ జన్మముల నేను దేవతల భూసుర బృందముల
పూజలుచేసి మిమ్మేపతిగా పొంద గోరినాను
శిశుపాల జరాసంధాదుల నిర్జించి పేరుగాంచి
కరుణతోడ గొని పొందుసన్ను రాక్షస వివాహవిధితో
॥చిత్తగించుమా॥

మరోమాట—

అంతఃపురమున నన్నుతే నలవిగాదటంచు
ఆలోచింపగవద్దు మాదు వంశాచారముగాను
కల్యాణానికి ముందు వెళ్ళవలె గౌరిని పూజింప
గ్రామానికి వెలుపలగ నున్నదా గౌరీ ఆలయమ్ము

అసమయంలో నను గొనిపోవుడు అనుమానము మాని
అట్లురానిచో నిక్కముగా నే నసువుల బాసెదను ॥చిత్తగింపుమా॥

శ్రీకృష్ణా! ఇప్పుడు చెప్పినదంతా రుక్మిణీ సందేశము. ఇక నేను చెప్పేదేమంటే?—

ఒకరి కొకరూ తగినవారు మీరుభయులు శ్రీకృష్ణా!
మీకల్యాణ మవశ్యమగును ఈలోక క్షేమముకు ॥చిత్త॥

అందుకని తాము ఆలశ్యం చేయకుండా—

త్వరగా తాము బయలుదేరి భూవరులను ఓడించి
రాకుమారినీ మీ యర్ధాంగిగ స్వీకరింపుడయ్యా ॥చిత్త॥

ఆ మాటలు విని శ్రీకృష్ణుడు నవ్వుతూ—

నా మనస్సునూ యేనాడో ఆభామ దోచుకొనియె
ఆ సుందరి పాణి నిగ్రహించుటకు అనుకూలింపాను
ఎదురువచ్చి యెవరడ్డుపడినను చెదరగొట్టినేను
రాజకుమారిని నావెంటనె ద్వారకకు చేర్చుకుందు

అని శ్రీకృష్ణుడు—

రథమును సిద్ధము చేయాలని సారధికి చెప్పినాడా
అగ్నిద్యోతను నారథంబుపై నధిష్టింపచేసి
తాను యెక్కి యెన్నో నగరాలను దాటుచు నా రోజే
కుండిన నగరము చేరినాడు ఆ ఖండన విక్రముడు

ఆ కుండిన నగరంతో రుక్మిణీ వివాహ సందర్భముగా—

వీధులకా పందిళ్ళు వేసిరీ-మంచి
గంధములు పన్నీరు చల్లిరీ- తెల్ల
ముత్యాల ముగ్గులూ పెట్టిరీ-అన్ని
ద్వారాలు తోరణాల్లట్టిరీ- ఇండ్ల
అగరు ధూపాలను అంతటను వేశారు, నగరాన గుమమలు
అలముకొన చేశారు ॥ఓరామ॥

ఆ కుండినరగనంలోని స్త్రీలందరూ -

పన్నీటిలో స్నానమాడిరీ — కొత్త
పట్టుబట్టలు తాము గట్టిరీ - మంచి
గంధాన్ని తమవంటి కద్దిరీ - వారి
పాదాలకు పసుపుపూసిరీ - వారు

ముఖముపై తిలకాలు ముద్దుగా దిద్దారు —
మేటి నగలెన్నియో మెడలో ధరించారు ॥ఓరామ॥

అదిగదిగో రుక్మిణీదేవి - ఆమె
మంగళ స్నానమాడిందీ - చెలులు
వస్త్రాలు కట్టించినారు - పసిడి
నగలెన్నో తొడిగించినారు - రత్న

హారాలు వేశారు పారాణి పెట్టారు -
పెండ్లికూతురినిగా పెద్దలూ చేశారు ॥ఓరామ॥

అదిగదిగో భీష్మకప్రభుడు - అతడు
దేవపూజలు చేసినాడు — ఎన్నో
గోదానములు చేసినాడు — అన్న
దానములు జరిపించినాడు - ఇంట

మంగళవాద్యాలు మారుమ్రోగంగాను —
అంకురార్పణవిధిని ఆచరించాడండి ॥ఓరామ॥

అదిగదిగో శిశుపాలరాజు - భటులు
రథము లేనుగులు గుర్రాలు — ఆతవి
బంధువులు స్నేహితులు ప్రియులు - వెంట
వచ్చేటి జనసమూహాలు - గొప్ప

అడంబరాలతో ఆప్తులగు దొరలతో -
చేది దేశాధిపుడు చేరెను విదర్భకూ ॥ఓ రామ॥

రామకృష్ణుల పారద్రోలి — చైద్యు
రాజునకు రుక్మిణినిగూర్చ - జరా
సంధుడూ దంతవక్త్రిందూ - సాల్వ
పౌండ్రకాది ప్రముఖనృపులూ - అటకు
ఆర్భాటములతోడ ఆర్భాటపడుచునూ -
తమ సైన్యములతోటి తరలి వచ్చారండి ॥ఓ రామ॥
ఎందరో పెద్దలొచ్చారు - వారి
కందరికి విడుదులిచ్చారు — వార
లందులోనను విడిసినారు - పెండ్లి
విందులకు కడుమెచ్చినారు - భీష్మ
కుడు చేదిరాజునకు స్వాగతం పలికాడు -
కడు పెద్దమేడలో విడిది గావించాడు ॥ఓరామ॥

అపుడు -

రుక్మిణీ కల్యాణమునకు - మన
కృష్ణు డొంటరిగానుపోయె - అటకు
చేదిసేనలు చేరగలవు - వాటి
నెదిరింప మనముపెళ్ళాలి- అనుచు
సేనలను గూర్చుకొని తాను మిత్రులతోడ -
బలరాముడు విదర్భకును బయలుదేరాడు ॥ఓరామ॥

యిది ఇలాగుండగా -

రాజభవనమున అంతఃపురమున ॥తంథానో తానె తంధనా॥
ఏకాంతముగా నున్న రుక్మిణీ ”
పరిపరివిధముల ఆలోచిస్తూ ”
ఆందోళనతో నిటు విలపించెను ”
ఇంతకు కృష్ణుడు వచ్చిన జాడను ఎరుగనైతి నేను ॥తంథానతానా॥
తెల్లవారితే సుముహూర్తం బని తెలియదేమొ హరికి ”
ఏగిన విప్రుడు రాకపోవుటకు ఏమికారణంబో ”

విప్రుడచ్చటికి వెళ్ళెనా దారిన విశ్రమించినాడో ”
కృష్ణుడదివిని తప్పుగా తలచి కినుక వహించాడో ”
ఏమిజరుగునో పరమేశ్వరుడూ యేమి దలచినాడో ”
కాత్యాయని ననుకరుణజూచునో కనికరింపబోదో ”
ఎట్టులుండునో నా యదృష్టము యేమి తోచదాయె ”
భూసురుడచటికి పోనిచో - ఆ
కృష్ణుడిచటికీ రానిచో — నా
బాధనాత డెరుగకున్నచో - అతని
పిలిచేవారే లేనిచో - ఇక
చేదిరాజుతో తప్పక వీరు నాదుపెండ్లి జరిపింతురు
అని ఎన్నోవిధాలుగా తలచుకొని వలవల ఏడుస్తూ—
ధారగ క్రిందికి జారుచున్న కన్నీరు తుడువబోదు ॥తంధానో॥
జారుచున్న కొప్పును ముడివేసీ సవరింపగబోదు ”
ముచ్చటలాడదు చెలికత్తెలతో ముంపటివలెనామె ”
పంజరానగల చిలుకకు చెప్పే పాట చెప్పబోదు ”
అన్నము ముట్టదు నీరు త్రాగదూ కన్ను మూయులేదు ”
వీణతీగలను మీటబోదు కడు విస్తుబోయియుండు ”
కిటికీవద్దనె కూర్చొని దిక్కుల నటునిటు గనునించు ”
తోయజాక్షుడూ వచ్చునేమోయని త్రోవ లెదిరిచూచు ”
ఇంతలో రుక్మిణి యొక్క ఎడమకన్నూ భుజము అదిరినది-
అదిరిన వెంటనె అగ్నిద్యోతను డడుగుపెట్టినాడు
ఆతని ముఖలక్షణముల జూచి ఆత్రముతో లేచి
చిరునవ్వులతో నెదురు వెడలి తన చేతులు జోడించి
నిలిచియుండగా బ్రాహ్మణోత్తముడు పలికెనిట్లు రాజా ॥రాజ॥

అప్పుడా అగ్నిద్యోతను డిలాగన్నాడు. ఓ కన్యకామణీ ! శ్రీకృష్ణుడు -

మెచ్చినాడు నీ సద్గుణాలకూ ముచ్చటపడినాడు
ఇచ్చినాడు నాకెన్నో కానుకలు వచ్చినాడు నాతో
అమరులు దానవు లడ్డువచ్చినను ఆగదు మీ పెండ్లి
గోవిందుడు నిన్నందరు జూడగ కొనిపోవుట నిజము

అనగా రుక్మిణి సంతోషముతో శరీరము పులకరించు చుండగా ఇలాగన్నది — స్వామీ !

నా సందేశము చెప్పి తెచ్చితివి నలినాక్షుని యిటకు
ప్రాణభిక్షనూ నాకు పెట్టిన బ్రాహ్మణోత్తముడవు
మిమ్ముబోలిన పుణ్యాత్మకు లీమేదినిలో గలరే
భూసురోత్తమా! మీ యుపకారంబును మరువగలేను
సాధుహృదయ! మిమ్మేవిధానను సత్కరింపలేను
ఆశీర్వాదము లిమ్మని రుక్మిణి అంజలి చేసెంది ||౧౫||

రుక్మిణిని "మనోవాంఛా ఫలసిద్ధిరస్తు" అని అగ్నిద్యోతనుడు ఆశీర్వదించి తన యింటికి వెళ్ళినాడు. ద్వారకా నగరం నుండి శ్రీకృష్ణుడు వచ్చాడనే వార్త గ్రామమంతా వ్యాపించింది.

వంతవాడు : భీష్మకుని ఆహ్వానం లేకుండా శ్రీకృష్ణుడు రావడం విచిత్రంగా ఉందే ?

కథకుడు : స్వామివారు భక్తపరాధీనుడు. రుక్మిణి భక్తురాలు-ఆమె శ్రీవారి రాకను కోరింది గదా ! ఆమె కోరిక తీర్చడమే శ్రీకృష్ణుని ముఖ్యోద్దేశము —

బలకృష్ణులు పెండ్లికి వచ్చారని తెలిసిన భీష్మకుడు
పరివారముతో నెదురు వెడలి మధుపర్కాల నొసంగి
కానుకలెన్నో ఇచ్చి వస్త్రముల కట్టబెట్టినాడు
వివిధ వసతులూగల భవనములో విడిదిచేసినాడు ॥రాజ॥

తరువాత -

వాసుదేవుడూ తమ నగరమునకు వచ్చెనమచు తెలిసి
పురప్రముఖులూ కృష్ణుని చూడగ నరుగుదెంచినారు

వారందరు శ్రీకృష్ణుని ముగ్ధమోహన రూపమును చూచి -

మన రుక్మిణి కితగాడె తగును ఈతనికి నామె తగును
వీరిద్దరికీ ముడిబడజేసిన విధి నేర్పరియగును

అనుకుంటూ శ్రీకృష్ణదర్శనము చేసికుంటూ వెళ్లుతున్నారు.

అప్పుడు రుక్మిణి —

ఆయుధాలతో భటులు ముందుగా నడుగుచుండగాను
ఖడ్గధారు లిరుపంకల సాగుచు కాపాడుచునుండ
వేశ్యలు పూజాసామగ్రులుగొని వెంబడించుచుండ
నగలు ధరించి ముత్తయిదువులూ నడచుచుండగాను
వీణావేణు మృదంగవాద్యములు వినిపించుచునుండ
పరిహాసము లాడుచు చెలికత్తెలు ప్రక్కనడచుచుండ
తల్లులు బాంధవ సతులు తోడుగా తరలుచుండగాను
నగరువెడలె నా రుక్మిణీమగువ నగజాతకు మ్రొక్క

ఆ భవానీ దేవాలయమునకు రుక్మిణి చేరింది -

పాట

గౌరిని పూజించుచున్నదీ-రుక్మిణీదేవి-కోరికలను తీర్చమన్నదీ
తన మనమున పార్వతినే ధ్యానిస్తూ గుడినిచేరి

పరమేశ్వరుని యొక్క రెండు పాదాలను కడిగించీ
హస్తములలో ఈశ్వరికీ అర్ఘ్యమునూ ఇచ్చిందీ
ఆచమనానికి జలమును ఆర్యాంబకు అందిస్తూ ॥గౌరిని॥
ఆనందముగా గౌరిని స్నానము చేయించిందీ
నూతన పీతాంబరముల నా తల్లికి కట్టిందీ
చంద్రశేఖరుని పత్నికి చందనమే అలదిందీ
హరిద్రమును కుంకుమను అగజాతకు సమర్పిస్తు ॥గౌరిని॥
భువనేశ్వరి గళమునందు పూలమాల వేసిందీ
అగరుగంధ ధూపమును అఘ్రాణింపగచేసీ
జ్యోతిని వెలిగించి లోకమాతకు దర్శింపచేసి
నానావిధభక్ష్యములను నైవేద్యం సమర్పించి ॥గౌరిని॥
దక్షిణతాంబూలములను దాక్షాయణి కొసగిందీ
మంగళహారతిని సర్వమంగళ కన్నులకు చూపి
మాహేశ్వరి యెదుట స్వర్ణమంత్రపుష్ప మొసగిందీ
సాష్టాంగముగా అమ్మకు సాగిలపడి మ్రొక్కి లేచి ॥గౌరిని॥

ఇంకా ఈ విధముగా ప్రార్థించింది -

నమ్మినాను నా మనసులోన మాయమ్మా! నిను గౌరీ
అగజాతా నను దయతో చూచీ ఆదరించుమమ్మా!
శ్రీకృష్ణుడు నా మనసు దోచుకునె చిన్ననాటినుండే
అతనినే నాపతిగ తప్పక అందింపుము తల్లీ!

పాట

గౌరీ దేవాలయమున కేగీ శ్రీరుక్మిణిదేవి
శార్వాణికి పూజలు జరిపిందీ

అతుల భక్తితోడ విప్రదంపతులను పిలచిందీ, వారలకు
అతివ నతులొనర్చి, వారి యక్షతల శిలనుదాల్చి శంకరుని
సతికి మ్రొక్కి పలికె దేవి ! నా పతిగ కృష్ణునీ సమకూర్చుము నా
వెతలబాపి సమ్మతము చేయుమని ॥గౌరీ॥

ఐదువు లందరికీ కంఠ సూత్రాముల నొసగిందీ, ఇక్షుదం
డాలను ఇచ్చిందీ దక్షిణలు తాంబూలము లిచ్చీ ఫలములను
వసనములను యొసగీ దీవన లమోఘముగా పొందీ మౌనమును
మాని దేవళమునుండి బయటికీ మానిని వెడలెను మహాలక్ష్మివలె
॥వెడలె॥

వెడలె కాత్యాయని గుడినుండీ భీష్మకుని ప్రియసుత
నీరదంబునుండీ వెడలు క్రొక్కారు మెఱపువోలె, శశిని విడి
జారు లేడివోలె, తెరతొలగ చారుమోహినివలె చూచేటి
వారి చేతులలోనున్న వస్తువులు జారిపడుచు నిశ్చేష్టులు కాగా
॥వెడలె కాత్యా॥

చిత్తము హరియందే నిలుపుచు క్రొత్తభావనలతో మురియుచు
మత్తగజమువోలె నడచుచు పుత్తడిరూపముతో సాగుతూ
మందహాస సుందరరోచులతో అందెల రవళులు సందడింపగా
॥వెడలె కాత్యా॥

ఎడమ చేతితోడ - ముంగురులు
గడగి చక్కచేసి - వయ్యారను
తడివి సర్దుకొనుచు - కడకంట
పుడమి దొరలచూస్తూ - అచట కన

పడిన రాకుమారుల దాటేయుచు-తడబడికృష్ణుని దర్శించుటకై॥వెడలె॥

ఆపుడు రుక్మిణీదేవి —

నీలమేఘశరీరుడై సువి
శాల వక్షము పద్మదళ నే

త్రాలు పీతాంబరము కరితుం
డాలవలె హస్తాలుగల గో
పాలు చూచీ-పులకరించిందీ
తనచేయి పైకీ చాచి రథమును ఎక్కబోయిందీ
శ్రీకృష్ణుడామె చేయి పట్టుకొన్నాడు — పడిలోన
నామెను— హాయిగా కూర్చుండబెట్టాడు—రుక్మిణిని కూడి —
పుడమిరేడులు చూచుచుండగ
వడిగ రథ హయముల నదల్చుచు
కడిగి ద్వారకవైపు కేగగ
సిడము నెత్తుచు ముదముతోడ
శంఖమును పూరించినాడండీ-గోపాలకృష్ణుడు
జంకు గొంకూ మానినాడండీ-వెనుకనే బలరా
ముండు రథమును నడిపినాడండీ ”

అపుడు జరాసంధాదియోధులు ఇలా అనుకున్నారు -

అయయో యెంతటి ఘోరమైనదీ యవమానము మనకూ
ఇంతమంది యిట చూచుచుండగా వింత జరిగిపోయె
పదండి ముందుకు యాదవజాతిని పరాభవించాలి
పరాక్రమించీ పెండ్లికూతురిని బిరాన తేవాలి

అనుకుంటూనే -

ఆయుధాల నందుకుండిరీ — సై
గుర్రాల దూకించుచుండిరీ ”
రథముల నురికించుచుండిరీ ”
బొలికేకలను వేయుచుండిరీ ” వారు
నిలునిలుమని పలుకుచుండిరీ-బాణములు-వాన కురిపించుచుండిరీ

॥భాగవతామృత॥

అరిసేనల బాణములు గుంపుగా హరిని గ్రమ్ముకొనగ
భయముతోడ హరిణేక్షణ చూచెను ప్రాణనాథు ముఖము

అప్పుడు శ్రీకృష్ణుడు నవ్వుతూ—

బేలా! నీసరసన నేనుండగ నేలా యులికెదవు
యదువీరులు చొచ్చుక పోతుండిరి అదిగో అటుచూడు
మన సైన్యాలకు ఎదురు నిల్వలే రనిలో పరసేన
నొచ్చి విచ్చరిపు సేనలు మొత్తము చచ్చెదరిక ముందు

అని రుక్మిణిని ఊరడించాడు. అప్పుడు యాదవ సైన్యాలు శత్రువులపై బడి—

ప్రళయమేఘములనుండి పిడుగులు బయలుదేరు నటుల
యదువీరులు గర్జించి శత్రువుల కెదురు తిరిగినారు
అగ్నిజ్వాలల బోలు బాణముల నరులపైన విడువ
గోడుగోడునా యేడ్చుచు ప్రాణాల్ కొందరు విడిచారు ॥రాజ॥

ఇక ఆయుద్ధభూమిలో—

ఏనుగుతొండా లెగిరి పడినవి
తురగ పాదములు తుంపులైనవి
అరదము లెన్నో విరిగికూలినవి
అరాతిమూకల శిరాలు తెగినవి
ధరాధినాథుల తలలపైనిగల కిరీటాలురాలె ॥తంధాన॥
పాదా ల్విరిగిన వారు కొందరూ ॥తంధానో తంధాన తందన॥
చేతులు తెగినవారు కొందరూ
దంతా లూడినవారు కొందరు
గాయాల్ తగిలినవారు కొందరు

ఎచట చూచిన శత్రుపక్షమం దేడుపులే మిగిలె
ఆ ప్రదేశమున మాంసపంకము అలముకున్నదండీ
నెత్తురు, కాలువవోలె పారుతూ నేల ఎర్రబడియె
నక్కాలు, రాబందుల అరపులతో పిక్కటిల్లెదెసలు ॥తంధాన॥

ఇంకా శత్రురాజుల యొక్క-

రథకేతనములు రాలిపోయినవి
ఛత్రచామరాల్ జారిపడినవి
కేయూరాలూ క్రిందపడినవి
తొడిగిన కవచాల్ తునిగె ముక్కలై
ఆల్లెత్రాళ్ళుతెగి మ్రోతలు ఆగీ విల్లు లొరగిపోయె

॥తంధాన॥

అపుడా ప్రదేశమునగల శత్రువర్గములో-

రథాల ఇరుసుల కిరకిరలేదు
గజాల ఘీంకారాల్ వినిపించవు
హయాల ఘోషలు ఆగిపోయినవి
వీరభటుల హుంకారాల్లేవు

సైనికధిక్కారాలు పూర్తిగా చల్లబడ్డనండీ
పారిపోయిరీ చావగ మిగిలిన వారల చటినుండి ॥రాజ॥

తప్పించుకొని అచటినుండి పారిపోతున్న జరాసంధుడు మొదలగు మగధ యోధులు అక్కడనేపడి గోడుగోడున ఏడుస్తూ ఉన్న శిశుపాలుని చూచి-

పాట:—

పల్లవి:- చింత యేలనో శిశుపాల! ఇంతకై నీకు ॥చింత॥

అ. ప:- ఇంత మాత్రమునకే అంతా మునిగినటుల
వింతగా దుఃఖింప వీరా! తగదయ్యా నీకు ॥చింత॥

1చరణం- ఎంత వారుగానీ ఈశ్వరాజ్ఞను మీరి
సంతోషానందముల సాధింపంగ లేరు

మి :- కాంత కొరకు కడుదైన్యముతో నిట
పంతము బట్టుట సబబగునా ఇల
ఇంతులు కరవై పోయిరె నీకు
ఎంతనవ్వులా టటుల కుంద ॥చింతా॥

2 చరణం:- బ్రతికియున్న యెడల భార్యతో పనియుండు
బ్రతుకు చితికెనేని భార్య యెందుకయ్యా

మి :— బ్రతికితి వింతియె చాలునయ్యా నీ
భార్య సంగతిని దేవుడెరుగును
సతతము మనకున్నట్లగునా
గతము మరిచి ఇంటికిని బొమ్మ ॥చింతా॥

ఐనా -

శరీరధారుల మగు మన మీశ్వరశాసన బద్ధులము
అతని చేతిలో కీలుబొమ్మవలె ఆడుమండగలము

నేను —

ఇదివరలో పదునేడు దాడులను మధురపైన చేసి
పరాజితుడనై బలరామునిచే పట్టుబడితినయ్యా
వాసుదేవుడే కనికరించి నను వదిలించాడపుడు
తదుపరి ధైర్యము చెదరక తిరిగి మగధసైకి వెడలి

పెద్దసేనతో దాడిచేసితిని పద్దెందవసారి
ఓడించితి నామధుర రాజ్యమును ఉత్సాహముతోడ
కావున-

తరచిచూడ జయాపజయములు దైవాధీనములు
మంచికి పొంగుట చెడుకు క్రుంగుట మంచిదికాదయ్యా
కలసివచ్చినది కాలము యాదవకులముకు శిశుపాలా!
అందువలననే త్రిలోక జేతల నడచగలిగినారు
మంచిరోజులూ రాకపోదయా మనకు ముందు ముందు
నాడువారినీ సేనల యుక్తం నాశము చేద్దాము

అంటూ జరాసంధాది రాజులు శిశుపాల్ణ్ణి ఓదార్చారు, ఉత్సాహ పరిచారు. ఎవరి నగరాలకు వారు వెళ్లినారు. తరువాత రుక్మిణి అన్నగారగు రుక్మి, తనచెల్లెలిని కృష్ణుడు అపహరించుకొని వెళ్లాడని తెలిసికొని-

పళ్ళు పట పటా కొరికెరా సై
కన్నుల నిప్పులు కక్కెరా ఉక్కు
కవచాన్ని బిగియించెరా ఎత్తి
కత్తిని గిరగిరతిప్పెరా రుక్మి
కోరమీసమును మెలిచెరా-రథ-సారధినీ రప్పించెరా ॥భళా॥

అపుడు వచ్చిన సారధితో ఇలా గన్నాడు-

ఔరా! యెంతటి మోసమూ మన
యరదము సిద్ధము చేయరా ఒక

గొల్లవాడు దొంగచాటురా వా
చెల్లెలినే యపహరించెరా ఆ
నల్లవాని బొగరు మాపెదా ఇపుడె నాప్రతాపమును చూపెదా॥
మా పాపను గొంపోవగా ఆ
గోపాలున కెంతగుండెరా మా
కేపాటీ సరితూగురా నా
కోపాన్ని వాడెరుగడూ ఆ
పాపాత్ముని దండించెదా నాకోపాన్ని చల్లార్చెదా ॥భళా॥
రిపుసేనల దునుమాడెదా మా
రుక్మిణినే తిరిగి తెచ్చెదా దాని
శిశుపాలునకే యిచ్చెదా పెండ్లి
ఘనముగాను జరిపించెదా నేడె
బంధుజనులు తిలకింపగా ఈ పనిని నేను నిర్వహించెదా ॥భళా॥

అంటూ రథాన్నియెక్కి కృష్ణుని మీదికి బయలుదేరి వస్తూ ఇలాగన్నాడు—

పాట

పల్లవి :- అగుమాగుమో దొంగా బోగలవా ? కండ్లు గప్పి ॥అగు॥
అనుపల్లవి :- సాగలేవు ముందుకింక, నీ గతి మూడింతునిపుడె ॥అగు॥
1 చరణం :- మాపాపను గొనిపోవగ, నేపాటిది గుండె నీది
మాతోడను వియ్యమంద మాసరివాడవ నీవు ॥అగు॥
" మానహీనుడవు నీవు మర్యాద లెరుంగ లేవు
కొమ్మను వదలుము లేనిచో అమ్ములపాలొనరింతును ॥అగు॥

అంటూ మీదిమీదికిరాగా, కృష్ణుడు నవ్వుతూ-

ఒక్కబాణమున వాని ధనువునూ ముక్కలుచేశాడు
గుర్రాలను సారథిని రథమునూ కూల్చివేసినాడు ॥రాజ॥

ఈలోగా రుక్మి మరో వింటిని ఎక్కుబెట్టబోగా-

దానిని గూడా విరుగగొట్టె నా దానవ మర్దనుడు
తునాతునకలుగ నన్నియాయుధాల్ త్రుంచివేసినాడు
కవచాన్ని భేదించి నరకుటకు కత్తి దూయగానే
కనులలోన నీర్నింపి రుక్మిణీ గడగడ వణుకుచును ॥చిత్తగింపునూ॥

శ్రీకృష్ణుని పాదాలుపట్టుకొని ఇలాగన్నది

ప్రాణనాథ ! మాయన్నరుక్మి తమ బలము నెరుగలేక
అపరాధమునే చేసెగాని నాయందు కరుణగలిగి
విడిచిపెట్టుడీ నా విన్నపమును విని మన్నించండీ
అనాథనాథా ! లోకరక్షకా ఆర్తిహర ముకుందా! ॥చిత్తగింపు॥

ఎందుకనగా-

వినుబోలిన మహానీయుని తమ కల్లునిగా పొందుటచే
ఎల్లరు చుట్టాల్ మా తలిదండ్రులు ఎంతో మురిసెదరు
ఇప్పు డీతనిని చంపినందులకు ఎంతో దుఃఖిస్తూ
పుత్రశోక కారణమున నందరు పొగిలి కృశిస్తారు
దుష్టుడైనను, నికృష్టుడైననూ భ్రష్టుడయినగాని
కొడుకు తప్పిదము తండ్రులెంచరూ కడుపుతీపివలన ॥చిత్త

అని కన్నీరు ఒత్తుకుంటూ రుక్మిణీదేవి శ్రీకృష్ణుణ్ణి ప్రార్థించింది. అపుడు స్వామివారు శాంతించి, నవ్వుతూ పరిహాసముగా —

విరూపుణ్ణిగా జేసి రుక్మినీ పరాభవము జేయక
బావా! రమ్మని పిలిచి యాతనిని బంధించాడండీ
శిరము మీసమూ గడ్డము సగమే గొరిగినాడు రాజా
సిగ్గుతోడ నవమానముసైపక శిరమువంచి నతడు ॥రాజరాజ॥

ఇంతలో —

పరసైన్యాలను యాదవ వీరులు పారద్రోలివచ్చి
కట్టుబడిన రుక్మిని వారందరు గాంచినారు రాజా ॥రాజ॥

అప్పుడు బలరాముడు కృష్ణునితో ఇలాగన్నాడు -

భార్య సోదరుడు బంధుముఖ్యుడని పరికింపగలేవా?
తలను మూతిసీ గడ్డము గొరుగుట తగానటయ్యా నీకు

ఇంతకన్న ఆతని -

తలను నరకుటే మంచిదిట్టి నీ తలపుకన్న కృష్ణా!
చంపదగిన వారైనను బంధుల చంపదగదు మనము

అని కృష్ణుని మందలించి రుక్మిణీదేవితో బలరాము డిలాగన్నాడు -

తోడబుట్టువగు రుక్మి దైన్యముకు దుఃఖపడకుమమ్మా!
మా కృష్ణుని నిందింపవలదుసుమ్మా భీష్మకపుత్రీ!
తన చేతకు ఫలమనుభవింపక తప్పదెవరికయినా
అందువలననే నీ సోదరు డీ యవమానము నందె
ధనధాన్యాలకు భూములకొరకై దారల కోసమయి
మానధనులు ధర్మాధర్మాలను మానెదరోయమ్మా

అయినా ఒక పరమరహస్యం చెపుతా విను -

మాయవలన దేహాభిమానులగు మానవులందరికీ

పగవాడని తన బంధుజనుడనే భావము ఉంటాయి

కాని, నిజానికి —

సూర్యునొకని వేర్వేరు జలాలలో చూచు రీతిగాను

గగనమొక్కటే ఘటాలన్నిటిన్ గానుపించునట్లు

ఆలోచించిన అంతట నిండిన ఆత్మయొకటెనుమ్మా

రాగద్వేషము లాత్మకులేవని బాగుగ వినుమమ్మా

సంయోగములూ వియోగమ్ములూ సంతసఖేదములు

జనన మరణములు తరుగుట పెరుగుట కన నాత్మకులేవు

ఈ జ్ఞానముతో అజ్ఞానమునూ విడిచిపెట్టవలయు

అప్పుడు శోకము మోహాము సర్వము అంతరించునమ్మా !

అంటూ బలరాముడు రుక్మిణికి తత్వోపదేశం చేయగా రుక్మిణి -

నిర్మల హృదయములో శ్రీకృష్ణుని నిలిపి పులకరించి

ఆ గోపాలుని ముఖకమలాన్నీ ఆలోకించింనీ ॥రాజ॥

శ్రీకృష్ణుడు తన బావమరది యగు రుక్మిని విడిచిపెట్టాడు. రుక్మి తనయొక్క వికారరూపమునకు బాధపడుతూ, తనను అవమానించిన కృష్ణుణ్ణి గెలిచిగాని, తన కుండిన నగరాన్ని ప్రవేశించనని తన నగర సమీపాన పీఠం వేశాడు, ఇది ఇలా ఉండగా -

రాచమూకలను గెల్చి కృష్ణుడూ రాజకీవితోడ
రాజపుత్రికనుగొని ద్వారకకూ రయమున వచ్చాడు

అప్పటికప్పుడే -

శ్రీరుక్మిణిని గూడి కృష్ణుడేతెంచెనని
నగరిలో సంతోష మెగసిందయా ॥వింటామయా॥

చూడబోవుదమంచు చుట్టాల గుమిగూడి
చీమబారులవోలె చేరారయా ,,

చెలులు గుంపుగ వచ్చి శ్రీరుక్మిణీదేవి
అందాని కాశ్చర్యమందారయా ,,

పూలమాలలు గోపబాలునికి రుక్మిణికి
వేయుటకు చేబూని వెళ్ళారయా ,,

ఆ జంట అందమపుడందరకు నచ్చిసే
బాసనీ తలలూప చేసిందయా ,,

కన్నులను రుక్మిణీ కదలించి త్రిప్పుతూ
కేశవునికీ దృష్టి తీసిందయా ,,

అపుడు ద్వారకాపట్టణ నివాసులు రుక్మిణీకృష్ణుల కల్యాణం జరుగనున్నదని తమ పట్టణాన్ని ఎలా అలంకరింప చేసినా రయ్యాంటే —

ప్రతి యింటిముంగిటన్ పందిళ్ళు వేయించి
సున్నాలు వేయించుకున్నారయా ॥వింటామయా॥

అన్ని ద్వారములకు అరటిబోదెలుకట్టి
కొబ్బరీ మట్టలను కూర్చారయా ,,

తెల్లవారకముందె యిళ్ళ వాకిళ్ళూడ్చి
చానిపిని పచ్చగా చల్లారయా
రంగురంగుల పెక్కు రంగవల్లులు దీర్చి
పూలు దోసిళ్ళతో పోశారయా
గుమ్మాలకూ పసుపు కుంకుమలు పెట్టారు
పురమొక్క ఇల్లుగా మెరసిందయా
గుప్పుగుప్పున తావి గుప్పుతూ పురినిండ
అగరుధూపా లలముకున్నాదయా
మొగముమీదట తూర్పుమగువ సారించిన
బొట్టులాగున ప్రొద్దు పొడిచిందయా
కనులపండువుగాను కల్యాణమంటపము
మిలమిలా మెరయ నిర్మించారయా
మంగళావాద్యాలు మారుమ్రోగుచునుండ
పెండ్లిసంబరములు పెరిగాయయా

అపుడు ముత్తయిదువలు రుక్మిణీదేవిని -

అభ్యంగన స్నానమాడించి తల యొద్ది
జడనల్లి పూలతో ముడిచారయా
పాదాలకూ పసుపు పారాణి పెట్టారు
తిలకాన్ని నుదుటపై దిద్దారయా
చెక్కిలికి కాటుక చుక్క పెట్టంగానె
పొలతికీ పెండ్లికళ పొంగిందయా
వెలిపట్టుచీరనూ చెలులు కట్టించారు
పెండ్లి పందిరికి పంపించారయా

పుడమిపై రుక్మిణీ అడుగు పెట్టినచోట
ఎఱ్ఱతామరపూలు వెలిశాగయా ”

అందియల చిరుమ్రోత లానందలక్ష్మని
పిలచు గీతాలాలపించాయయా ”

పెండ్లికొడుకును పిలిచి పెండ్లికూతురు జతగ
పీటలలో కూర్చుండబెట్టారయా ”

దంపతుల శిరములకు సొంపుగా బాసికాల్
కనులపండువుగాను కట్టారయా ”

సుముహూర్త సమయమున చూర్ణికాష్టకములను
శ్రావ్యముగ బ్రాహ్మణుడు చదివాడయా ”

వధువు కంఠానికీ వరుడు తాలిని మూడు
ముడులేసి అక్షతలు పిడివాడయా ॥వింటామయా॥

తమ తలపు నెరవేర తలబ్రాలనొండురుల్
ఉత్సాహమున బోసికున్నారయా ”

బ్రాహ్మణుం డుభయులకు బ్రహ్మముడి వేశాడు
పెద్దవా రక్షతలు వేశారయా ”

వేదమంత్రాలతో వివిధ తంత్రాలతో
కల్యాణపూతంతు గడచిందయా ”

విందామయా మనము వించామయా
శ్రీకృష్ణచరితమును విందామయా ”

భూసుర వేదోక్తాశీస్సులతో
కవికుమారులా అమృతవాక్కులతో
గాయకోత్తముల మధురగీతులతో
వంది మాగధుల స్తుతి వాక్యాలతో
కల్యాణంబెంతో శుభమ్మగా గడచిపోయెనండీ ॥గోపాలబాలా॥

ఆ శుభసందర్భంలో మహిళలు ఆ వధూవరులకు మంగళ హారతిని ఇలా పాడుతూ ఇచ్చినారు -

మంగళహారతి

మంగళాహారతినీ అంగనా లీయరారే
సుందరీ రుక్మిణికీ నందగోపాలునకు ॥మంగ॥
తల్లీ రుక్మిణీ నీవు ధన్యాత్మురాలవమ్మా
మా నందగోపాలుని మనసు కరిగించావమ్మా ।మంగ
కోరిన గోపాలునే చేరుకున్నావా చెలీ
నీ కోరికలు పండెనే రాకుమారీ నేటికి ।మంగ
ఇందీవరాక్షీ నువు ఇందిరా యవతారివే
అందాల గోపాలుడు ఆదినారాయణుడే ॥మంగ
మంగళం భగవాన్ విష్ణో మంగళం మధుసూదన
మంగళం పుండరీకాక్ష మంగళం గరుడధ్వజ

o—o